## శుభాకాంక్షలు!

**పాఠకులకు, రచయితలకి, ఏజెంట్ లకు ప్రకటనకర్త లకు అందరికీ వినాయక చవితి ప్రత్యేక శుభాకాంక్షలు!**

**-ఎడిటర్**

ముఖచిత్రం

ఆడామగా వాటేసుకున్న సినిమా వాల్‌పోస్టర్‌ల మాదిరి ముఖచిత్రాలు లేకుండా నీటైన మోహన రూపాలతో 'వీక్లీ'ని వెలువరిస్తున్నారు. 'సంతోషం'

# వీక్లీ పోస్ట్

సినిమా పత్రికలకి సాహిత్య పత్రికలకి గల తేడా ముఖచిత్రంలోనే కనుపడే ఆంధ్రసచిత్ర వారపత్రికంటేనే మాకు యిష్టం.

దువ్వూరి వనజ, గిరిజ
(అనపర్తి)

కెరటాలు

ఇటీవల పత్రికలో మంచి కథలు ప్రచురిస్తున్నారు. ఎమ్. హరాగారి సీరియల్ బావుంది. త్వరలో ప్రారంభం కాబోయే కవిత్రయం గురించి ఆసక్తితో

(22 వ పేజీ చూడండి)




# పదండి లోపలికి

ముఖచిత్రం :

శ్రీ సిద్ధి వినాయకుడు

*(చిత్రకారుడు: కాశీ)*



వచ్చే వారం: — అన్నింటిల్లోనూ భీముడే స్పెషల్ —




ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తనమనంబునకగు దా
నొరులకునవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్

THE ANDHRA PATRIKA
GROUP OF
MAGAZINES

ఆంధ్ర సచిత్ర వార పత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు

సంపుటము 83 సంచిక 1

24-8-1990

విడి ప్రతి వెల నాలుగు రూపాయలు

శక సం.1912 భాద్రపద మాసం 2వ తేదీ

**EDITORS:**
**VEERAJI**
M MADHAVA RAO

**ASSOCIATE EDITORS:**
POTLURI VENKATA RAO
Dr GUMMANURU RAMESH BABU

**SUB-EDITORS:**
P PRAMEELA
K S B TILAK
BHISETTY LAXMANA RAO

**ARTISTS:**
KASI
CHALAM

**PRODUCTION & ADMINISTRATIVE MANAGER:**
M THYAGARAJ

**CIRCULATION MANAGER.**
S APPADORAI

**ADVERTISEMENT MANAGER:**
A NANDAKUMAR

Printed and Published by
*M/s Nageswararao Estates Ltd*
at the
Andhra Patrika Press, Gandhinagar,
Vijayawada-520 003,
Editor VEERAJI
Phones: Business: 61247, 61248,
Editorial· 75667.

# రిజర్వేషన్ వ్యతిరేకోద్యమ ఉధృతి!

ఆగస్ట్ రెండో వారంలో బీహార్ వైపు చూడండి - అక్కడ కేంద్రం తీసుకున్న మండల్ కమీషన్ సిఫార్సుల అమలు నిర్ణయంవల్ల తక్షణం చెలరేగిన ఉద్యమంతో ఒక దావానలమై చెలరేగింది. ఉత్తరప్రదేశ్‌లో, ఢిల్లీలో, పశ్చిమ బెంగాల్, ఒరిస్సా రాష్ట్రాలలో బి.సి.లకు కేంద్ర వుద్యోగాలలో కూడా మరో 27 శాతం అదనపు కేటాయింపులు చేయనిర్ణయించామని ప్రధానమంత్రి శ్రీ వి.పి. సింగ్ పార్లమెంటు సమావేశాల ఆరంభంలోనే ఆదుర్దాగా ప్రకటించడంతో - ఆందోళన చెలరేగుతున్నది. మండల్ కమిషన్ నివేదికలోని సిఫార్సులు 1980 నుంచి అటకమీద వున్నాయి. కులాల ప్రాతిపదికమీద వున్న కేటాయింపుల సంఖ్యను - కులాల సంఖ్య మరింత పెంచి కేటాయింపుల సంఖ్యను పెంచే విధంగా సిఫార్సులు చేసిన మండల్‌గారి నివేదికను కూలంకషంగా పరిశీలించి దేశవ్యాప్తంగా చర్చించి, తర్జనభర్జనలు చేసి - "అగ్రకులాలకు" యితరులకు కూడా ఆందోళన కలిగించని రీతిలో - సంజాయిషీ తయారుచేసుకొని వుంటే - శ్రీ వి.పి. సింగ్‌గారి చిత్తశుద్ధిని సామాజిక స్పృహని యెవ్వరూ తప్పుపట్టవలసిన పని లేదు కాని శ్రీ వి.పి. సింగ్ కేవలం రాజకీయ స్పందనతోనే - సరియైన వివరణలు కూడా యివ్వకుండా మండల్ కమిషన్ సిఫార్సుల అమలుకి పూనుకున్నారు. సుప్రీంకోర్టు తీర్పననుసరించి 50 శాతానికి మించి రిజర్వేషన్‌లు వుండకూడదు కనుక యిప్పటికే అన్ని రకాల రిజర్వేషన్‌లు కలిపి, 49.5 శాతం అయ్యాయి. కనుక యింతటితో యివి ఆగాల్సిందే కదా! కాని యిప్పుడు కాంగ్రెసు పార్టీ వంటి ప్రతిపక్షాలు, బి.జె.పి. పార్టీ వంటి సహాయ పక్షాలు కోరుతున్న అగ్రవర్ణాలు, మైనారిటీ వగైరాలకు రిజర్వేషన్‌లు కల్పించుతామని శ్రీ వి.పి. ఎలా అంటున్నారో తెలియదు. బీహార్ రాష్ట్రం పోలీసు కాల్పుల దాకా దారితీసిన హింసా ప్రజ్వలన కాండను ముందుగా పూహించలేకపోడం కూడా తప్పే - ఎందుకంటే బీహార్, యు.పి., ఆంధ్రప్రదేశ్‌లో, "ప్రతిభ"కు గుర్తింపు లేకపోడం నిరవధికంగా కొనసాగడాన్ని వ్యతిరేకిస్తూ ఆస్తి నష్టం జననష్టం కలిగించిన ఉద్యమాలు లోగడ జరిగాయి!

జనాకర్షక పథకాలు అందరికీ ఆమోదం కాకపోయినా అధిక సంఖ్యాకులకైనా ఆమోదయోగ్యంగా వుండాలి. రాష్ట్రాలు మొదటి నుంచి వెనుకబడిన తరగతుల, కులాల, జాతుల వర్గాల రిజర్వేషన్‌ల సంగతి చూసుకుంటున్నాయి. మధ్యప్రదేశ్ వంటి రాష్ట్రాలలో యీ కోటాల పెంపును కూడా చేయడంతో రాష్ట్రాల మధ్య బి.సి.ల రిజర్వేషన్‌ల కోటాలకున్న వ్యత్యాసం కూడా యెక్కువయింది. "వెనుకబాటు" అనేది కేవలం కులాల ప్రాతిపదికమీద నిర్ణయింపబడరాదు అన్న ఆందోళన యీనాటిదికాదు. 1953లో ప్రముఖ గాంధేయవాది అయిన కాకా సాహెబ్ కాలేల్కర్ ఆధ్వర్యంలో 11 మంది సభ్యులతో యేర్పాటయిన సంఘం నివేదిక వెలువడిన నాటినుంచీ వున్నది. కాలేల్కర్ సంఘం నివేదిక వెలువడకముందే అందులోని 5 గురు సభ్యులు నివేదికమీద భిన్నాభిప్రాయం వ్యక్తం చేశారు. సంఘ నాయకులు కాలేల్కర్ కూడా నివేదికలో దేశవ్యాప్తంగా 2399 కులాలను వెనుకబడిన కులాలుగా గుర్తించి సిఫార్సులు విడుదలచేసి, - దరిమిలా ఆత్మప్రబోధానికి లోనై - కులాల ప్రాతిపదికను ముందుముందు తొలగించే ప్రయత్నం చేయమంటూ రాష్ట్రపతికి ఉత్తరం రాశారు. అయితే అటువంటి ప్రయత్నం ఏమీ జరుగలేదు అనడానికి నిదర్శనం 1979, జనవరి 1 నాడు బి.పి. మండల్‌గారి కమిటీని నియమించడమే చాలు. మండల్ కమిషన్ దేశంలో 52 శాతంమంది 3743 కులాలకు చెందిన వారు బి.సి.లంటూ సిఫార్సులు తయారుచేసింది. మన రాష్ట్రంలో కూడా మురళీధరరావు కమిషన్ బి.సి.ల సంఖ్యను 94 నుంచి 102 కి పెంచింది. అయితే కులాల ప్రాతిపదికమీద జనాభా లెక్కలు సేకరించారా? అన్న ప్రశ్న ఎవ్వరూ వేయలేదు. - "కులాలతో నిమిత్తం లేకుండా ఆర్థికంగా, సామాజికంగా వెనుకబాటుతనాన్ని వెదికి జాబితాలు తయారు చేయాలని చాలాకాలంగా వస్తున్న సూచనలను గవర్నమెంట్‌లు పెడచెవిని పెట్టాయి.

దేశంలో రెండు దొంతర్ల రిజర్వేషన్‌లు వద్దన్న నిరసనలు చాలాకాలంగా వున్నాయి. విద్యారంగంలో కేటాయింపులు, స్కాలర్‌షిప్‌లు వసతి, భోజన సౌకర్యాలు కల్పించి - తిరిగి ఉద్యోగాలలో రిజర్వేషన్‌లు పెట్టడంమీద సోకాల్డ్ అగ్రకులాలు లేదా ఫార్వర్డ్ కాస్ట్ విద్యార్థులు ఆందోళనలు చేస్తూ వుండగా - కేంద్ర ప్రభుత్వం మండల్ కమిషన్ నివేదిక మీద తర్జనభర్జనలు - ప్రతిపక్షాలతో చర్చలు, ప్రజా సంస్థలతో సంప్రదింపులు లాంటివి చేయకుండా, పదిసంవత్సరాల క్రితం నాటి జాబితాను అలాగే ఆమోదించటము - చాలా దుందుడుకు చర్య అని దేశ వ్యాప్తంగా విమర్శలకు గురి అవుతున్న తరుణంలో "దీనిమీద నేషనల్ డిబేట్" పెడతాము అంటూ యిప్పుడు గవర్నమెంట్ అనడం మరింత విడ్డూరంగా వుంది. ఇ.సి. అంటే ఎడ్యుకేషనల్లీ బ్యాక్‌వర్డ్ అనా? ఎకనామికల్లీ బ్యాక్‌వర్డ్ అనా? అన్నది కూడా స్పష్టం చేయకపోబట్టే పత్రికలో పై రెండు రకాల వివరణలు యీ "పొడి అక్షరాలకి" యివ్వడం జరిగింది. - రాష్ట్రాలలో కేటాయింపులున్న జాతులకి, కేంద్రం యిప్పుడు గుర్తించిన వెనుకబడిన జాతులకీ మధ్య వ్యత్యాసం 10 శాతం మాత్రమే కనుక మొదట ఆ 90 శాతం వరకు రిజర్వేషన్‌లు వర్తిస్తాయి అంటూ కేంద్రం ప్రకటించడం హర్షించదగ్గ అంశం కాదు. తతిమ్మా 10 శాతంకి కేంద్రంలో కేటాయింపులు లేకుండా పోవా?

ఏది ఏమైనా మండల్ కమిషన్ నివేదికను శ్రీ వి.పి. సింగ్ - వాటి అమలుకు సంబంధించి ఒక ప్రణాళిక రూపొందించి - దానిని రాష్ట్రాలకు కూడా పంపి - "నేషనల్ డిబేట్" లాంటిది అయిన తరువాతనే ఆమోదించి వుంటే యిప్పుడు - బీహార్, యు.పి., ఒరిస్సా మున్నగు రాష్ట్రాలలో చెలరేగిన హింసాయుత ఆందోళనలు ప్రేరేగకుండా వుండేవి - విద్యావిషయకంగా వెనుకబడటం అంటే? ఏమిటి? ప్రాథమిక విద్యాలక్ష్యాన్నే 40 సంవత్సరాల తరువాత కూడా చేరుకోలేని మనం రిజర్వేషన్‌ల ద్వారా - సాంకేతిక, ఉన్నత విద్యలను యిప్పుడున్న మార్గంలో సాధించగలమా?

రాష్ట్రాలు బి.సి.లకు అన్యాయం చేస్తున్నాయి కనుక - సెంట్రల్ విద్యా సంస్థలలో వేరే బి.సి.లకు కేటాయింపులు యిస్తామంటున్నదా? కేంద్ర ప్రభుత్వం ? ఆందోళన చేస్తూ - ఆస్తులను ధ్వంసం చేస్తూ పోలీసు కాల్పులలో ప్రాణాలు కోల్పోతున్నవారి మాటేమిటి? వారుకూడా యీ దేశ ప్రజలే కనుక యీ (సోకాల్డ్) ఎఫ్.సి.ల "ప్రతిభ"కి గుర్తింపు వుంటుందన్న హామీని శ్రీ వి.పి. సింగ్ గవర్నమెంట్ తక్షణం యివ్వాలి - అది ఎలా యివ్వాలి? అన్నది - ఆలోచించుకోవలసింది కూడా వారే కనుక - కాలహరణం చేయవద్దని - యితర రాష్ట్రాలకు ఉద్యమాలు పాకకుండా అరికట్టమని ఫ్రంట్ గవర్నమెంట్‌ని - రాజకీయ పార్టీలను మరీ మరీ కోరుతున్నాము - 'ప్రతిభ', ఆర్థిక మాంద్యం రెండూ చెట్టాపట్టాలేసుకుంటూ వుండే దేశం మనది. కాస్త ఆ విషయం కూడా ప్రభుత్వాలు గుర్తించాలి.

# విఘ్నమూర్తి విశేష రూపాలు!



ఆశ్చర్యగణపతి

అసలే వింత దేవుడు వినాయకుడు. ఆపైన ఎన్నెన్నో ప్రాంతాల్లో ఎన్నెన్నో రూపాలతో అలరారు తున్నాడు. ఏనుగు తల, నాలుగు చేతులు, వాహనం చూస్తే మూషికం.... వినాయకుడిని వింత దైవాన్ని చేస్తే, వివిధ రూపాల్లో వినాయకుడ్ని కొలవడం వల్ల నాట్య గణపతి, పంచముఖ గణపతి, కుబ్జ గణపతి... తదితర రూపాలు విగ్రహాలుగా వెలిశాయి.

వినాయక చవితికి ప్రత్యేకంగా విగ్రహాలు తయారు చేసి, తొమ్మిది రోజుల పాటు భారీగా గణపతి నవరాత్రులు ఉత్సవంగా జరిపే ప్రముఖ నగరాల్లో గణేశుని రూపాలు మరీ విచిత్రాకృతుల్ని సంతరించు కున్నాయి. మహాబలుడు (వస్తాదు) గణపతి, బాల గణపతి, రథాసీన గణపతి, రుషి గణపతి, ఆంజనేయుని భుజా లధిష్ఠించిన గణపతి విగ్రహాలను గత పదేళ్ళుగా హైదరాబాద్‌లో విగ్రహం తయారీ దార్లు సృష్టించారు. ఇంకా ఇటువంటి విచిత్రాకృతుల్లో గణపతులను బొంబాయి నగర వాసులు కూడా దర్శిస్తున్నారు. గణపతిని వివిధాకృతుల్లో తయారు చేయడానికి, శాస్త్ర పరమైన ఆధారాలు పరిశీలించి నప్పుడు గణపతి కున్న నామాంతరాలు ప్రముఖంగా కన్పిస్తాయి. అత్యంత ప్రాచీన ద్రవిడ శిల్పాలను పరిశీలించి నప్పుడు, తత్సం బంధిత గ్రంథాలను పరిశీలించి నప్పుడు గణపతి పిశాచ, భేతాళ, యక్ష రూపాల్లో కన్పించడం, ఉన్మత్త వేషాయనమః, మదోత్కటాయనమః, ధూమకేతవేనమః, విఘాత కారినే నమః... వంటి పేర్లు

( 79 వ పేజీ చూడండి).



నిమజ్జనానికి తీసుకుపోబడుతున్న గణపతి



# న్యాయచట్టం ప్రశ్నలు-జవాబులు



అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ.,ఎల్.ఎల్.బి.

జి. రత్నాకరరావు, కావలి

ప్రశ్న : నన్ను ఒంగోలు జిల్లా జడ్జి స్టెనో టైపిస్టు ఉద్యోగము నుండి తీసి వేయగా నేను 1981లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో రిట్ పిటిషన్ దాఖలు చేసినాను. నన్ను ఉద్యోగము నుండి తీసివేసిన ఆర్డర్‌ను కొట్టివేసి మరల ఉద్యోగములో చేర్చుకొనుటకు రిట్ పిటిషన్ దాఖలు చేయగా సింగిల్ జడ్జి రిట్ ప్రార్థనకు సంబంధం లేని విషయమును చర్చించి రిట్ పిటిషన్ కొట్టివేశారు. నేను 1987లో రిట్ అప్పీలు దాఖలు చేశాను. హైకోర్టులో వారు 11-8-1989 లో ఇచ్చిన జడ్జిమెంట్‌లో ప్రజలకు దీనిని బహిరంగపరచకుండా దాచివేశారు. హైకోర్టు జడ్జి సంబంధము లేని విషయము చర్చించుట నేరము కాదా?

జవాబు : మీ అప్పీలు హైకోర్టు డివిజనల్ బెంచ్ కొట్టివేసినట్లు తెలుస్తున్నది. కాబట్టి సింగిల్ జడ్జి ఇచ్చిన ఉత్తర్వులు సరిగానే ఉన్నవని డివిజనల్ బెంచ్ అభిప్రాయపడినట్లున్నది. మీరు తీర్పు కాపీలు పంపలేదు. ఇక సింగిల్ జడ్జి తీర్పు ఇచ్చేటప్పుడు సంబంధించిన విషయాలు చర్చించడం నేరము కాదు.

జె. జయశ్రీ లలిత, తెనాలి.

ప్రశ్న : మాకు ఒక పూర్వీకుల ఇల్లు ఉన్నది. నాకు ఐదుగురు తమ్ముళ్లు, ఒక చెల్లెలు ఉన్నారు. మా తండ్రి మరణించారు. ఆ ఇల్లు ఇప్పుడు అమ్మినట్లయితే లక్ష రూపాయలు వస్తుంది. దానిలో మా అక్క చెల్లెళ్లకు వాటా ఎంత వస్తుంది? మాకు 1964, 65 సంవత్సరములలో వివాహము జరిగినది.

జవాబు : వివాహమైన కుమార్తెలకు తండ్రి ఆస్తిలో హక్కు లేదని పుల్లారెడ్డి కేసులో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు 1987లో తీర్పు చెప్పింది. హిందూ వారసత్వ (ఆంధ్రప్రదేశ్ సవరణ) చట్టము (1986) లోని 29-ఎ సెక్షన్ ప్రకారం 1985 సెప్టెంబరు 5 తేదీ ముందు పార్టిషన్ జరిగిన ఆస్తి మీద కూడ వివాహమైన కుమార్తెలకు వారసత్వపు ఆస్తి మీద హక్కు లేదు. కనుక మీకు వాటారాదు.

కె. శ్రీనివాసాచారి, కరీంనగర్

ప్రశ్న : నాయొక్క స్కూలు జన్మ తేదీ 5-4-1970 అని ఉన్నది. ఏడవ తరగతి మియోలో 5-4-1967 అని వేశారు. ఇప్పుడు నేను ఇంటర్ రెండవ సంవత్సరం పరీక్ష ప్యాసు అయ్యాను. నేను 3 సంవత్సరముల నుంచే ఒకటవ తరగతి చదివినాను. నా జన్మ తేదీ ఎలా మార్చుకోవాలో తెలుపవలెను.

జవాబు : మీరు ఏడవతరగతి, పదవతరగతి, ఇంటర్ ఎప్పుడు ప్యాసు అయ్యారో వివరించలేదు. బహుశా మీ వయస్సు చాలక జన్మతేది మార్చివుంటారు. ఏడవ తరగతి పరీక్షలో మీకు 5-4-1967 అని మీ జన్మతేదీ వ్రాసినప్పుడు మీరు సరిఅయిన తేదీ తెలుపవలసినది. పదవ తరగతి పరీక్ష వ్రాసినప్పుడు కూడా సవరించుకొనలేదు. అయినప్పటికీ స్కూలు అడ్మిషన్ రిజిష్టర్‌లో మీ యొక్క పుట్టిన తేదీ 5-4-1970 అని వున్నది. గనుక మీయొక్క పుట్టిన తేదీ సవరించవలెనని కోర్టులో దావా వెయ్యండి.

జె. సత్యనారాయణ, తెనాలి.

ప్రశ్న : పూర్వీకుల ఆస్తిని అమ్మి మా తండ్రి 1959లో ఒక ఇల్లు కొన్నారు. తండ్రి మరణించారు. ఆ ఇల్లు ఇప్పుడు అమ్మగా 80 వేలు వచ్చినది. నాకు తల్లి, నలుగురు తమ్ముళ్లు, ఇద్దరు అక్కయ్యలు ఉన్నారు. అక్కలకు 1964, 65 సంవత్సరములలో వివాహము అయినది. మాకు వచ్చిన 80 వేల రూపాయలు ఎలా పంచుకోవాలో తెలుపవలెను.

జవాబు : వివాహమైన కుమార్తెలకు ఆస్తిలో వాటా రాదని పుల్లారెడ్డి కేసులో 1987లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పింది. మీరు, మీ తల్లి 6 భాగములు వేసుకొని ఆస్తిని వంచుకొనవలెను.

కె. వెంకటరావు, చూచికొండ (విశాఖ జిల్లా)

ప్రశ్న: మా తండ్రి, వారి తల్లి కలిసి 1955లో మా తల్లికి 2 ఎకరముల 12 సెంట్లు సెటిల్‌మెంట్ వ్రాసి యిచ్చారు. వారి సంతానం ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. మా అక్కకు 1966లో వివాహము అయినది. మాకు కూడా వివాహము అయినది. ఇప్పుడు మా తల్లి, మా అక్కకు ఒక ఎకరా భూమి దాన విక్రయములతో వ్రాసి ఇచ్చింది. ఆ భూమి మా సాగుబడిలోనికి రావాలంటే ఏమి చెయ్యాలి?

జవాబు: మీ తండ్రి ఆస్తి మీకు చెందుతుంది. మీ అక్కకు వివాహము అయినది గనుక ఆ ఆస్తి మీద మీ అక్కకు హక్కు లేదు. వివాహము అయిన కుమార్తెకు ఆస్తిలో హక్కు లేదని పుల్లారెడ్డి కేసులో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు 1987 లో తీర్పు చెప్పింది.

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..............................

పేరు: ..............................

పూర్తి చిరునామా: ..............................

## సీరియల్

# సూపర్‌హీరో





### మన్నెం శారద

(గత సంచిక తరువాయి)

విజయేంద్ర కేసు హియరింగ్ కొచ్చింది.

ఆ రోజు కోర్టంతా అతని అభిమానులతో, శ్రేయోభిలాషులతో నిండి పోయింది.

నిఖిలేశ్వరితో పాటు రజని కూడ ఆ రోజు కోర్టుకి హాజరవ్వడం ఒక విశేషం.

బోనులో నిలబడ్డ విజయేంద్రని చూసి అభిమానులు జేకొట్టేరు. తన కొడుకు ఎంతో చిక్కిపోతాడు, మరెంతో నల్లబడి వుంటాడని నిఖిలేశ్వరి ఊహించింది. కాని ఆమె ఊహలు తారుమారు చేస్తూ విజయేంద్ర ఇంకాస్త లావయి మరింత పచ్చగా కనిపించడం ఆమెని ఆశ్చర్య చకితురాలిని చేసింది.

విజయేంద్ర తల్లివైపొకసారి చూసి చూపు తిప్పుకున్నాడు. హియరింగ్ ప్రారంభమైంది.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ తిరిగి ఎఫ్. ఐ. ఆర్.లో ఉటంకించిన ఆరోపణల్ని చదివి వాటిని బలపరుస్తూ తన సాక్షుల్ని ప్రవేశ పెట్టేడు.

మొదట కోర్టులో బోనులో కొచ్చి నిలబడిన కోకిలని చూడగానే నివ్వెర పోయింది రజని.

మొదట ఆమెని ఎక్కడ చూసిందీ గుర్తు రాలేదామెకు.

కోకిల విజయేంద్ర తనని ఎలా ట్రాప్ చేసి రేప్ చేసాడో చెబుతుంటే ఆమెకి చప్పున తను చూసిన బ్లూఫిల్మ్ గుర్తొచ్చింది.

అవును. అందులో నటించిందేమో! కరుణాకర్ తనకా కాసెట్ ఇచ్చేడు. అందులో నటించిన హీరో మాత్రం విజయేంద్ర కాడు.

తర్వాత చాదర్‌ఘాట్ చంచల ప్రభృతులు తమ కథల్ని మరోసారి కోర్టుకి వివరించేరు.

జగన్నాథ నాయకర్ తన వాదన ప్రారంభించేడు.

మొదట అతను తన ముద్దాయికి సగం పూర్తికాని చిత్రాలని పూర్తి చేసే అవకాశం ఇవ్వాలని నిర్మాతలు నష్ట పోకుండా చూడాల్సిన బాధ్యత కోర్టుకి వుందని అతన్ని కేసు తేలే వరకు బెయిలు మీద విడుదల చెయ్యాలని కోరేడు.

కాని కోర్టు అందుకు అంగీకరించలేదు.

అతన్ని హవుస్ ఇంప్రిజన్‌మెంటులో పెట్టి ఒకే ఒక స్టుడియోలో మాత్రం అతని చిత్రాలు పూర్తి చేసేందుకు అనుమతించింది.

ఆ మాత్రానికే నిఖిలేశ్వరి ఎంతగానో సంతోషించింది.

అతనితో సగం సినిమాలు పూర్తి చేసిన నిర్మాతలు కొంత వరకు తృప్తిపడ్డారు.

కేసు మరలా వాయిదా పడింది.

రజని నిఖిలేశ్వరి చేతులు పట్టుకొని ఊపి "మంచి జయించి తీరుతుంది ఆంటీ! మీరు ధైర్యంగా వుండండి. నేనీ సంగతి పీయూషకి తెలియజేస్తాను" అంటూబయల్దేరింది.

నిఖిలేశ్వరి శ్యామసుందర్‌తో కలిసి జగన్నాథ నాయకర్ దగ్గర కెళ్ళి కృతజ్ఞతలు చెప్పింది.

"అప్పుడే కాదమ్మా! మీ అబ్బాయి మీద జైలు నీడలు పూర్తిగా చెరిగిపోయేక చెబుదురు గాని. అంతవరకూ నేను నిద్రపోను" అన్నాడు ఆత్మవిశ్వాసంతో.

తిరిగి జైలుకి తీసుకెళ్ళబడుతున్న కొడుకు దగ్గర కెళ్ళింది నిఖిలేశ్వరి.

విజయేంద్ర నవ్వుతూ తల్లి వైపు చూసి "అమ్మా!" అన్నాడు ఆర్తిగా.

**ఇంతవరకూ సాగిన కథ-23:** ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నిఖిలేశ్వరి తన కొడుకు విజయేంద్రకు చిత్రసీమలో వస్తున్న పేరు ప్రఖ్యాతులు చూసి ఆనందిస్తుంటుంది. వ్యభిచార నేరం క్రింద అరెస్టయిన దమయంతి ఆత్మహత్య చేసుకుంటుంది. బ్లూఫిల్ములు తీస్తున్నాడన్న నేరంపై అరెస్టయిన కొడుకు దుస్థితిని చూసి నిఖిలేశ్వరి మనసు కలత చెందుతుంది. దమయంతి హత్య జరిగిన తీరును అనకాపల్లి వ్యాపారస్థుడి ద్వారా శ్యామసుందర్ రాబడతాడు. రాజకీయ ఒత్తిడులతో పీయూష తండ్రి సతమతమవుతుంటాడు. విజయేంద్ర కేసు హియరింగ్‌కు వస్తుంది.

నిఖిలేశ్వరి కళ్ళు నీళ్ళతో నిండేయి. పెదవులు సన్నగా వణికేయి.

"నవ్వాల్సిన క్షణాలు వస్తుంటే ఇంకా ఏడుస్తావు దేనికమ్మా! ముందు ముందు కేసు ఎలా వున్నా నేను త్వరలో నీతో వుండగల్గుతాను. అంతకు మించిన సంతోషం నాకేమీ లేదు" అన్నాడు విజయేంద్ర స్థిరంగా

"నువ్వేమో జైల్లో వుండి బాగానే లావెక్కి రంగొచ్చేవు, మీ అమ్మగారు చూడు నువ్వు ఏం తింటున్నావోనని బెంగపడి చిక్కిపోయేరు" అన్నాడు శ్యామసుందర్.

"అవునమ్మా నేను లావెక్కేను. ఎందుకో తెలుసా! నేను హీరోనని- నాకు తిండి సరిపోదని జైల్లోని నా సోదరులు, ఈ కానిస్టేబుల్స్ తమ తిండిలోని కొంత భాగం ఎంత వద్దన్నా తీసి నాకు పెడుతున్నారు. వాళ్ళకి నేనంటే ఎంతో ప్రేమ. ఇక నీడపట్టున వుండటం వలన రంగొచ్చేను. ముందు జరిగేదాని గురించి ఏమాత్రం ఆలోచన లేకుండా మెడిటేషన్ చేస్తున్నాను. నాకేం ఫర్వాలేదు. నువ్వు కూడ సరిగ్గా భోంచేయమ్మా!" అన్నాడు విజయేంద్ర తల్లి వైపు ఆప్యాయంగా చూస్తూ.

అతి చిన్న వయసులోనే వివాహం కాకుండానే ఇంత పెద్దరికాన్ని, ఆదుపుగా మాట్లాడటాన్ని అలవర్చుకొన్న కొడుకుని చూసి ఆమె ఆశ్చర్యపోయింది.

అతనితో వున్న కానిస్టేబుల్స్ నిఖిలేశ్వరికి నమస్కరించి "సార్‌లాంటి అందగాణ్ణి, మంచి . వాణ్ణి మా జీవితంలో చూడలేదమ్మా! త్వరలో నే సార్ బయటకు వస్తారన్న నమ్మకం మాకుంది. అందు కోసం మేము చందాలు వేసుకుని సిటీలో అన్ని గుడుల్లో పూజలు చేయిస్తున్నాం. తప్పక మా అభిమాన హీరోగారు నిర్దోషిగా నిరూపింపబడి బయటకొచ్చేస్తారు" అన్నారు.

వాళ్ల అభిమానాన్ని చూసి నిఖిలేశ్వరికి, శ్యామసుందర్‌కి కళ్ళు చెమర్చేయి.

"తెలిసింది కదమ్మా, నేనిప్పుడు ఒంటరిని కాను. నాకోసం నువ్వేం బెంగపడకు." అని తల్లికి చెప్పి తిరిగి వెనక్కెళ్ళేడు విజయేంద్ర.

కొడుకు కనిపిస్తున్నంత సేపు చూసి వెను తిరిగింది నిఖిలేశ్వరి.

★ ★ ★ ★ ★

పిళ్ళై జైలు నుంచి తప్పించుకొన్న తర్వాత జేమ్స్ మనసు మనసులో లేదు. ఎప్పుడూ మృత్యువు తన వెన్ను మీదే జరజరా పాకుతోన్న భ్రాంతితో అతను విలవిలలాడి పోతున్నాడు. జైల్లో అతని జులుము చాలవరకు తగ్గిపోయింది. చివరికి భరించలేక అతను శెలవు అప్లయ్ చేసేడు.

"నువ్వు డ్యూటీలో వుంటేనే సేఫ్టీ వుంటుంది. పిళ్ళై గురించి గాలింపు జరుగుతోంది. అతను దొరికి తీరతాడు" అని పిలిపించి సలహా ఇచ్చేడు గాంధీ.

బదులుగా గాంధీ కాళ్ల మీద పడి వలవలా ఏడ్చేసేడు జేమ్స్.

"లేదు సర్! నా మనసు మనసులో వుండటం లేదు. నేనెక్కడ వున్నా పిళ్ళై నన్ను వెంటాడుతున్నట్లే వుంటోంది. మనసు పిచ్చెక్కి పోతోంది. కొన్నాళ్ళు ఏ ఆస్పత్రిలో నన్నా జాయినయి రెస్టు తీసుకోవాలనుకుంటున్నాను సర్" అన్నాడు.

"నీ ఇష్టం. కావాలంటే పోలీసు ఎస్కార్ట్ తీసుకో!" అన్నాడు గాంధీ.

"అలాగే సర్!" అన్నాడు జేమ్స్ సాల్యూట్ చేసి వెను తిరుగుతూ.

అతను బయటికొచ్చి పోలీసు ఎస్కార్ట్‌తో ఒక ప్రయివేట్ నర్సింగ్‌హోంకి వెళ్లి ఆస్పత్రిలో జాయినయ్యేడు. బయట పోలీసులు వున్నారు.

"మీరు తిండి తగ్గించాలి. అంతకన్నా ట్రబులేం లేదు" అన్నాడు డాక్టర్ అతనికి అన్ని పరీక్షలూ చేసి.

"ఆ సంగతీ నాకు తెలుసు. నేనిక్కడ వైద్యానికి చేరలేదు" అన్నాడు జేమ్స్ విసుగ్గా.

"మరి?" డాక్టర్ ఆశ్చర్యంగా అడిగేడు.

"ఒక లం... కొడుకు నన్ను చంపాలని జైలు నుండి పారిపోయేడు. వాడి నుండి తప్పించుకోడానికి మాత్రమే నేను ఇలా జాయినయ్యేను. ఈ విషయం ఎవరికీ తెలియకూడదు" అన్నాడు జేమ్స్.

"అలాగా!" అంటూ డాక్టర్ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ "మరి యూనీఫారమ్‌లో వున్న కానిస్టేబుల్స్ హాస్పిటల్ చుట్టూ వుంటే మీరిక్కడున్నట్టు ఈజీగా తెలిసిపోదా?" అన్నాడు.

జేమ్స్ ఆలోచనలో పడ్డాడు.

"నిజమే! వాళ్లని మఫ్టీలో వుండమని చెబుతాను" అని తన దగ్గరున్న కానిస్టేబుల్‌తో "మీరందరూ యూనిఫారమ్స్ తీసేసి మఫ్టీలో రండి" అని చెప్పేడు.

కానిస్టేబుల్ సాల్యూట్ చేసి బయటికి నడిచేడు.

"మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకొనే బాధ్యత నాది! ఈ ఆస్పత్రి డాక్టరుగా నేను మిమ్మల్ని కంటికి రెప్పగా చూసుకొంటాను. రెస్టు తీసుకోండి" అన్ని తలుపులు దగ్గరకేసి బయటకెళ్లి పోయేడు డాక్టరు.

జేమ్స్ కొంత నిశ్చింతగా కళ్ళు

మూసుకొన్నాడు.

* * * * *

రజని చాలాసేపు ఆలోచనగా గడిపింది.

అంతలో కరుణాకర్ వచ్చేడు.

అతనికి భోజనం వడ్డిస్తూ "విజయేంద్ర అరెస్టు గురించి మీకు తెలుసా?" అంది.

"ఏం?" అని ఎదురు ప్రశ్న వేసేడు కరుణాకర్.

"మీ స్నేహితుడు కదా, ఎప్పుడూ అనలేదేమని?" ఆమె ఎదురుగా కూర్చుంటూ అడిగింది.

"అలాంటి రోగ్ గురించి నీకు చెప్పాలా! ఇంతకీ ఎందుకంత ప్రత్యేకించి అడుగుతున్నావు?" అన్నాడు భార్యని పరిశీలనగా చూస్తూ.

"ఒకప్పుడు మీరు కూడ బ్లూ ఫిల్మ్స్ నాకిచ్చేవారు చూడమని. వాటిల్లో ఎప్పుడూ విజయేంద్ర వున్నవి నేను చూడలేదు" అంది రజని.

బదులుగా భార్య వైపు క్రౌర్యంగా చూశాడు కరుణాకర్.

"అంటే... వాణ్ణలా చూడలేదని బాధపడుతున్నావా? నాకు తెలుసు... నీకెంత పిచ్చి వుందో! జాగ్రత్త! పిచ్చి పిచ్చి వేషాలెయ్యకు!".

అతని మాటలకు రజని దెబ్బ తిన్నట్లుగా చూసింది.

"మీరు శ్రుతి మించి మాట్లాడు తున్నారు" అంది కోపంగా.

"ఫోజులెయ్యకు. భార్యంటే బానిసే అని అర్థం! వాడి టాపిక్ మరోసారి వచ్చిందో... మర్యాదగా వుండదు" అంటూ చెయ్యి కడుక్కుని లేచి వెళ్లాడు కరుణాకర్.

రజని చాలసేపు నిర్లిప్తంగా నిలబడిపోయింది.

తన భర్తకు స్త్రీ అంటే గౌరవం లేదు. అందులో తనంటే అసలే లేదు.కేవలం తన ఆస్తి అనుభవించడానికి ప్రేమ అనే ఆట ఆడి పెళ్ళి అనే ఫలితాన్ని గెలుచు కొన్నాడు. ఈ దేశంలో భర్త ఎంత నిరసిస్తున్నా ఆ భర్తని వదిలేయ డానికి స్త్రీలు ఇష్టపడరు. లోపల కాలిపోతున్నా సమాజ గౌరవం కావాలి! తము సుఖంగా వుండేదానికన్నా సుఖపడు తున్నామని ఇతరులు భావించడానికే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది ఈ దేశపు స్త్రీ!

పెళ్ళయిన రోజు నుండే తనకి తన భర్త ప్రవర్తన పద్ధతులూ నచ్చడం లేదు. అతని ఆలోచనా విధానం ఎంత పాతాళపు స్థాయిలో వుందో తనకి రోజు రోజుకీ అర్థమవుతోంది! అయినా తను భరిస్తోంది! ప్రేమించి పెళ్ళి చేసుకొని విడిపోతే సమాజం ఏమంటుందో నని! కాని లోపల ఏదో తిరుగుబాటు జరుగు తోంది! సర్దుకోలేక గిలగిల లాడుతోంది!సమర్థించుకోలేక సతమత మవుతోంది.



రజని ఆలోచిస్తుండగానే కరుణాకర్ వెళ్ళి పోయినట్టు కారు శబ్దం వినిపించింది. ఆమె మెల్లిగా తన బెడ్ రూమ్‌లోకి నడిచింది. పీయూష దగ్గర కెళ్దామని ఆమె బీరువా తెరచింది చీర కోసం.

మెరూన్ కలర్ మైసూరు క్రేప్ చీర కట్టుకొని ఆ కలర్ స్లిప్పర్స్ కోసం స్టాండులో చూసింది కన్పించ లేదు. ఆమె విసుగ్గా బయట పని కుర్రాణ్ణి పిలిచి 'పైన ఈ రంగు చెప్పు లున్నాయేమో చూడు!" అంది అటక వైపు చూపిస్తూ. వాడు అటకపైన అట్ట పెట్టె క్రిందికి దించి "ఇందులో వున్నాయమ్మా?" అంటూ చెప్పులన్ని కుప్ప పోసాడు. అందులో అడుగునున్న వీడియో కాసెట్స్ చూడగానే ఆమె భ్రుకుటి ముడి పడింది.

వెంటనే "నువ్వెళ్ళరా! నేను చూసుకుంటానులే!" అంది.

పని కుర్రాడు బయట కెళ్ళగానే ఆమె తలుపులు బిగించి అందులో కాసెట్సన్నీ బొత్తిగా పెట్టి చెప్పులు తిరిగి ఆ పెట్టెలో వేసి పైకెక్కి పెట్టేసి కాసెట్సన్నీ తీసుకొని ఒక్కొక్కటే వి.సి. ఆర్.లో ప్లే చేయసాగింది.

చూస్తుండగా ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

అవన్నీ బ్లూ ఫిల్మ్‌లే!

వాటిలో కోకిలే కాక నిన్న సాక్ష్యం చెప్పిన చంచల... హేమ మిగతా వాళ్ళు కూడ వున్నారు.

ఆమెకి కొంత అర్థమయ్యింది. ఇందులో తన భర్త చెయ్యి వుంది. ఏ కాసెట్‌లో నూ విజయేంద్ర లేనే లేడు.

ఆమె కాస్సేపు మౌనంగా కూర్చొని ఏం చేయాలో ఆలోచించు కొంది. తన భర్త క్షేమం కోరి వీటిని దాచి విజయేంద్రకి శిక్ష పడుతుంటే చూస్తూ కూర్చోవాలా? లేక మనసులేని ఆ మనిషితో ఈ పాటికే విరక్తి చెంది వుంది కాబట్టి అతని అసలు రంగు బయట పెట్టాలా! సున్నిత మైన ఆమె స్త్రీ హృదయం కాస్సేపు అటూ ఇటూ వూగింది. చివరికి ఆమెలోని ఆత్మ గౌరవమూ, నిజాయితీనే గెలిచాయి. ఆమె వెంటనే లేచి వాటినన్నిటినీ ఒక బ్రీఫ్ కేసులో సర్ది తిన్నగా శ్యామసుందర్ దగ్గరకి బయల్దేరింది.

ఆమెని చూసి శ్యామసుందర్ కంగారు పడిపోయేడు.

"నేను వెంటనే వెళ్ళాలి. నన్ను ఇక్కడెవరైనా చూస్తే ప్రమాదం సంభవించ వచ్చు. వీటిని చాల జాగ్రత్తగా జగన్నాధ నాయకర్ గారికి అంద చేసే బాధ్యత మీది" అంటూ వెంటనే వెను తిరిగింది రజని.

శ్యామసుందర్‌కి కాస్సేపు ఏమీ అర్థం కాలేదు. అయినా వెంటనే బట్టలు తొడుక్కొని ఈ కేసు నిమిత్తం సిటీలోనే బస చేస్తున్న జగన్నాధ నాయకర్ దగ్గర కెళ్ళి ఆ బ్రీఫ్ కేసు అంద జేసేడు. నాయకర్ వెంటనే వాటిని ప్లే చేసి చూసేడు. అతనికి విషయం అర్థమై పోయింది. మొహంలో చిరునవ్వు తొంగి చూసింది.

"చాలా ఉపయుక్త మైన సాక్ష్యాలు తెచ్చేవు. ఎక్కడివివి?" అనడిగేడు ఆశ్చర్యంగా.

శ్యామసుందర్ రజని విషయం చెప్పేడు.

"సరే! జాగ్రత్తగా నువెళ్ళిపో! త్వరలో ప్రభుత్వంలో కూడ అనేక మార్పులు వచ్చే పరిస్థితి వుంది. బహుశ అది కూడ మన విజయేంద్రకి మంచి చెయ్యొచ్చు!" అన్నాడు నాయకర్.

"మీరు చెబుతున్నది...!" సందిగ్ధంగా అడిగేడు శ్యామసుందర్.



"నక్సలైట్ల గొడవ పెచ్చు పెరిగింది. రాకాని విడుదల చెయ్యక పోతే ఊరుకో మంటున్నారు నక్సలైట్లు. విడుదల చెయ్యడానికి వీల్లేదంటున్నాడు రాయుడు. ఇందులో సరైన నిర్ణయం తీసుకోలేక పోతే ప్రభుత్వమే పుటుక్కు మంటుంది. మరో విషయ మేమిటంటే ఛీఫ్‌మినిస్టరు తీవ్రమైన అనారోగ్య పరిస్థితిలో వున్నాడు. అతను అర్జెంటుగా అమెరికా వెళ్ళాల్సి వుంటుంది. అతని పరిస్థితి అటూ ఇటైతే ఈ ప్రభుత్వమే కుప్పకూలి పోతుంది'' అన్నాడు నాయకర్.

శ్యామసుందర్ అర్థమైనట్టు తల వూపి బయట కొచ్చేడు.

అతను వెంటనే ఈ సంగతి చెప్పడానికి నిఖిలేశ్వరి ఇంటికి బయల్దేరేడు.

* * * * * *

జైలు ఆ రోజు చాల సందడిగా వుంది.

కారణం ఆరోజు ప్రిజనర్స్ కోసం జైల్లో సినిమా వేస్తున్నారు. ఆ సినిమాలో హీరో విజయేంద్ర! జేమ్స్ శెలవులో వెళ్ళేక మిగతా పోలీసు డిపార్టు మెంటులోని వ్యక్తులు విజయేంద్రని కొంత బాహాటంగానే ఆరాధించే పరిస్థితికి వచ్చేరు.

తెరమీద కథ నడుస్తుంటే వాళ్ళు సినిమా చూడటం మానేసి విజయేంద్ర మొహమే చూస్తున్నారు.

విజయేంద్ర హీరోయిన్‌తో స్టెప్స్ వేసి డాన్స్ చేస్తున్నాడు.

వాళ్ళు ఇతన్ని చూసి నవ్వుతుంటే విజయేంద్ర కూడ చిన్నగా నవ్వుతున్నాడు.

"నువ్వెన్ని సినిమాల్లో ఏక్ట్‌చేసి వుంటావ్ గురూ!" ఒకతను అమాయకంగా అడిగేడు.

"యాభయి''

"మొత్తం ఎంత మంది అమ్మాయిల్తో చేసి వుంటావ్?''

"గుర్తులేదు. ఒక ఇరవై మంది పైనే వుంటారు.''

"నువ్వెంత అందంగా వుంటావు

కదా! నిన్ను వాళ్ళెవరూ నిజంగా ప్రేమించ లేదా?"

"లేదు" చిరునవ్వుతో జవాబు చెప్పేడు. "మరింత దగ్గరిగా పూసుకొని నటిస్తుంటే వళ్ళు జిల్లు మనిపించ దంటే నమ్ముమంటావా?" మరొకతని అమాయక మైన ప్రశ్న విని విజయేంద్ర నవ్వుతూ "అదేం వుండదు. అదంతా నటన. వళ్ళు కాల్చేసే లైట్లు చుట్టూ అనుకొని బోల్డంత మంది టెక్నిషియన్స్ గందరగోళంగా వుంటుంది" అంటూ జవాబిచ్చేడు.

"వళ్ళు జిల్లు మంటే పళ్ళు జల్లుమంటూ రాల్తాయి. పిచ్చి పిచ్చి ప్రశ్న లెయ్యకుండా సినిమా చూడండహె!" అంటూ హెచ్చరించేడొక ప్రిజనర్ కోపంగా.

ఆ మర్నాడు విజయేంద్ర జైలునుండి తరలింపబడి మెదక్‌లో హౌస్ ఇంప్రిజన్ మెంటుకి వెళ్ళబోతున్నాడు.

సినిమా కాగానే అందరూ అతన్ని చుట్టి "మమ్మల్ని మరచిపోవుగా! మళ్ళీ పెద్ద హీరో వయి పోతే మేమొస్తే మాట్లాడతావా?" అనడిగేరు దిగులుగా.

"తప్పకుండా మాట్లాడు తాను" అన్నాడు విజయేంద్ర వారి నందర్నీ పేరు పేరునా పలుకరిస్తూ.

ఆ రాత్రి అతనికి నిద్ర పట్ట లేదు.

మొదటి సారి తను జైలు కొచ్చినప్పుడు తను ఆ వాతావరణం చూసి చలించి పోయేడు. ఊపిరాడనట్టు కొట్టు కున్నాడు. కాని.... ఇప్పుడు ఈ వాతావరణాన్ని, ఈ మనుషుల్ని వదలి వెళ్ళ లేక పోతున్నాడు. జైలు శిక్ష అనుభవిస్తున్న నేరస్థు లందరూ రాక్షసులూ, హృదయం లేని వాళ్ళూ కాదు. ఒక బలహీనతకో, ఆరని పగకో–క్షణికావేశానికి లో నై నేరం చేసిన వారు, నేరమెవరో చేస్తే అన్యాయంగా నేరం మోపబడి శిక్ష అనుభవిస్తున్న వారే ఎక్కువ. వీరందరూ అతి కొద్ది రోజుల్లో తనకి ఎంతగానో దగ్గరయి పోయి తనని వెర్రిగా అభిమానిస్తున్న వారే! ఇప్పుడు




వీరందర్నీ వదలి వెళ్ళాలంటే ఏదో బాధగా, దిగులుగా అన్పిస్తోంది.

అతను ఆలోచనల్లో వుండగానే తెలతెల వారింది. జైలు కిటికీ ఊచల వెనుక నుండి వెలుగు సెల్‌లోకి దొంగలా ప్రవేశించింది. మనసేదో తొందర పడుతోంది.

'ఈ పంజరపు బ్రతుకు ఇక వీడి పోవునే, ఎందుకే నీకింత తొందర.... ఓ చిలుక' అన్న మల్లీశ్వరి లోని భానుమతి పాట అతనికి గుర్తొచ్చింది.

తెల్లవారగానే అతన్ని తీసుకెళ్ళ డానికిపోలీసు బలగం వచ్చింది. అతను రాకా వైపు చూశాడు.

రాకా కూడ అతన్ని ఆర్ద్రంగా చూశాడు.

'న్యాయం గెలిచి తీరుతుంది అన్నా!

వెళ్ళు వెళ్ళన్నా!

ఎన్నడు వెను తిరగని వెలుగువైపే నీ పయనం అన్నా!' అన్నాడతను చేతులు కలిపి.

విజయేంద్ర మనసు చిక్కబట్టు కొని ప్రిజనర్స్ నుండి కన్నీటి వీడ్కోలు తీసుకొంటూ బయట కొస్తుండగా ఎదురయ్యేడు పిళ్ళె!

విజయేంద్ర అతని వైపు ఆశ్చర్యంగా చూశాడు. "ఇప్పుడే వస్తున్నా బ్రదర్! ఓపెన్ హార్ట్ సర్జరీ చేసి!" అన్నాడు పిళ్ళె వికటంగా నవ్వుతూ.

పోలీసులు అతన్ని బలంగా పట్టుకోవ డానికి ప్రయత్నించేరు.

"ఎందుకు నన్ను పట్టు కొంటారు శుంఠల్లారా! నేను పారి పోతే మీరు పట్టు కోవాలి! నేనే దర్జాగా జైలు కొస్తుంటే మీరేదో ప్రతాపం చూపించి నన్ను పట్టు కొంటున్నట్టు ఫోజు దేనికిరా!" అంటూ ఆవేశంగా అరిచేడు పిళ్ళె.

"ఏం జరిగింది! మళ్ళీ వచ్చేవేంటి?" అన్నాడు విజయేంద్ర అతని వైపు అనుమానంగా చూస్తూ.

"రావడానికే వెళ్ళేను బ్రదర్! ఆ జేమ్స్ గాడికి బతికుండగానే హార్ట్ ఆపరేషన్ చేసేసేను. కుక్క చావు చచ్చేడు వెధవ! వాణ్ణి చంపడమే నా ధ్యేయం! ఆ పని చేసేసేను. నాకు ఝడిసి హాస్పిటల్లో జాయినయ్యేడు వెధవ! నేనే డాక్టర్ నని, వాడికి తెలియదు పాపం!" అంటూ వికటంగా నవ్వేడు పిళ్ళె.

"నువ్వు డాక్టర్‌వా?" ఆశ్చర్యంగా అడిగేడు విజయేంద్ర.

"హ హ్హా హ్హా! నేనే డాక్టర్‌ని మరి! ఆ నా కొడుకుని చంపడానికి అసలు డాక్టర్ని దాచిన నకిలీ డాక్టర్‌ని. నేను గుండె బయటకి తీస్తుంటే వాడు అరిచిన అరుపు.... హ హ్హా హ్హా! నా జీవితమంతా గుర్తు తెచ్చుకొంటుంటే నాకు తీరని ఆనందం కల్గుతుంది. నా కసి తీరింది బ్రదర్! నా చెల్లెలు మనశ్శాంతి తించింది బ్రదర్! నౌ అయామ్ వెరీ హ్యాపీ!" అతను అరుస్తుండగానే పోలీసులు అతన్ని బలవంతంగా సెల్‌లోకి తోసేసేరు.

విజయేంద్ర నిర్లిప్త మైన చూపులతో బయటకి నడిచేడు.

(ఇంకా వుంది)



# లవ్ గేమ్



చల్లా సుబ్రహ్మణ్యం

మెయిన్ ఆఫ్ చేసి వుంది.

ఎవరు?

ఎవరు చేశారీపని?

అతను తీవ్రంగా ఆలోచించాడు.

అప్రయత్నంగా మెయిన్ ఆన్ చేసి- బాక్స్ మూసి తిరిగి హాల్లోకి వస్తుండగా- అప్పుడు చూశాడు.

నేల మీద ఎండలో మెరుస్తూ కనిపించింది.

పాన్ పరాగ్ జర్దా ప్యాకెట్!!

క్షణంలో ఎలర్ట్ అయ్యాడు స్వాగత్. ఇంతకు ముందు తాను ఇటుగా వెళ్లినప్పుడు లేని ప్యాకెట్- హఠాత్తుగా ఎలా ప్రత్యక్షమైంది?

వెంటనే వాటర్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ వ్యక్తి గుర్తొచ్చాడు.

యస్-

మేడ మీదకు వెళ్తూ- ఇదిక్కడ పారేసి వెళ్లి వుంటాడు. వేగంగా మేడ మీదకు నడవసాగాడు.

అప్పుడు గుర్తొచ్చిం దతనికి. పైకెళ్లే

(గత సంచిక తరువాయి)

మెట్ల మీదుగా నవ్య గది వెంటిలేటర్ స్పష్టంగా కనిపిస్తుంది అనే విషయం. దాని ద్వారా అతను.....

మెరుపు వేగంతో పరుగెత్తి మెట్లెక్క సాగాడు.

పైన ఓవర్ హెడ్ టాంక్ పైప్ తీసి చూస్తున్నాడతను.

పైకి వచ్చిన స్వాగత్‌ని ఆశ్చర్యంగా చూశాడతను.

"ఏమైంది?" అడిగాడు స్వాగత్.

"పైప్ చెడిపోయింది" చెప్పాడా వ్యక్తి.

జర్దా వాసన గుప్పున కొట్టింది.

"ఎండలో మీ రెందుకు సార్- వెళ్లండి. నేను రిపేర్ చేస్తాను"

"అలాగే వెళ్తాను గానీ- ఇంతకు ముందు నన్నెక్కడయినా చూశావా నువ్వు?" అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు స్వాగత్.

అతను తలెత్తి స్వాగత్‌ను చూస్తూ-

"లేదు సార్- ఇదే మొదటిసారి మిమ్మల్ని చూడ్డం" అన్నాడు.

"బాగా గుర్తు తెచ్చుకో- వనస్థలిపురం అవతల- ఓ ఇంట్లో నన్ను చూడలేదా నువ్వు?"

"వనస్థలిపురం? అదసలు మా ఏరియానే కాదు"- ఆశ్చర్యంగా అన్నాడతను.

"అక్కడికి నువ్వొచ్చింది ఇలా పైప్ రిపేర్ చేయడానిక్కాదు. ఓ మనిషిని చంపడానికి"- అతని దగ్గర కొస్తూ అన్నాడు స్వాగత్.

అతని ముఖంలో రంగులు మారాయి.

అప్రయత్నంగా లేచి నిల్చున్నాడు. అతని కుడిచేయి- అతని ప్యాంటు జేబులోకి వెళ్లడం గమనించిన స్వాగత్.

చప్పున రివాల్వర్ తీసి-

"హేండ్సప్- అతి తెలివి ప్రదర్శించకు"- అన్నాడు.

అంతే-

ఓ మనిషి- అంత తొందరగా రియాక్ట్ అయి- అంత వేగంగా రివాల్వర్ తీసి షూట్ చేస్తారని ఊహించని స్వాగత్-

మెరుపు వేగంతో పక్కకు తప్పుకున్నాడు.

అతని భుజాన్ని రాసుకుంటూ దూసుకు పోయింది బుల్లెట్-

క్షణం కూడా ఆలస్యం చేయలేదు స్వాగత్- రివాల్వర్ ట్రిగ్గర్ నొక్కాడు.

అది ఊహించిన వాడిలా చప్పున కిందికి వంగి- అదే వేగంతో ముందుకు దూకాడతను.

స్వాగత్ పక్కకు తప్పుకున్నాడు. అతను బ్యాలెన్స్ తప్పి- ఓవర్ హెడ్ ట్యాంక్‌ను ఢీకొని తూలి కిందపడ్డాడు.

వేగంగా అతని మీదకు దూకాడు

ఇంతవరకూ సాగిన కథ-22: తనను వ్యతిరేకిస్తున్న భార్య నవ్యను దారికి తెచ్చుకునే విషయంలో స్వాగత్‌కు మేనమామ భాగ్యరాజ్ సహకరిస్తాడు. శైలజ హత్య కేసులో చిక్కుకున్న నవ్యను విడిపించేందుకు పబ్లిక్ ప్రాసిక్యూటర్ స్వాగత్‌కు కొన్ని సలహాలిస్తాడు. ఆ సలహాల ఆధారంగా శైలజ యింట్లో స్వాగత్ కొన్ని సాక్ష్యాధారాలను సేకరిస్తాడు. కాని అవి గల్లంతవుతాయి. శైలజను గురించిన వివరాలు తెలుసుకుంటుండగా స్వాగత్ పి. ఆర్. ఒ. పవన్‌కుమార్ హత్యకు గురవుతాడు. నవ్య బాత్రూమ్‌లో పడిపోయి వుంటుంది. పవన్ యింటిని సవ్యసాచి పరిశీలిస్తాడు.

స్వాగత్.

అతని గొంతును తన కుడి కాలితో నొక్కుతూ అన్నాడు.

"చెప్పు- ఎవరు పంపించారు నిన్ను?"

అతని ముఖం ఎర్రగా కంది పోసాగింది. పళ్ల బిగువున బాధను భరిస్తూ తల అడ్డంగా ఊపాడు.

అతని గొంతు మీద వుంచిన తన కాలును ఇంకా బలంగా నొక్కుతూ-

"చెప్పు- ఎవరు- ఎవరు పంపించారు నిన్ను?" అన్నాడు.

అతను ఊహించని రీతిలో- తన ఎడమ కాలుతో స్వాగత్ కుడికాలును బలంగా తన్నాడు.

స్వాగత్ వెనక్కి తూలాడు.

అతను చువ్వలా లేచి- ఒక్క ఉదుటున గాలిలోకి డైవ్ చేసి-

ఆ భవనం మీద నుంచి కిందకి దూకాడు.



నిశ్చేష్టుడై చూస్తుండి పోయాడు స్వాగత్–

వేగంగా వెళ్ళి కిందికి చూశాడు.

అతను మెరుపు వేగంతో కాంపౌండ్ వాల్ దూకి కనుమరుగయ్యాడు.

నెమ్మదిగా మెట్లు దిగి హాల్లో కొచ్చాడు స్వాగత్. భాగ్యరాజ్ సిగార్ కాలుస్తూ పేపరు చూస్తున్నాడు.

స్వాగత్‌ను ఓ సారి తలెత్తి చూసి– తిరిగి పేపర్‌లో నిమగ్న మయ్యాడు.

నవ్య గదిలోకి వెళ్ళాడు.

మీనాక్షి– సావిత్రి– భార్గవిలు ఆమెకేదో చెప్తున్నారు. నవ్య దిండు కానుకుని బెడ్ మీద కూర్చుంది.

స్వాగత్‌ను చూడగానే అంతా ఠక్కున మాటలాపి అతన్ని వింతగా చూశారు.

తన దగ్గర రివాల్వర్ వుందన్న విషయం వాళ్ళు నవ్యతో చెప్పినట్టు గ్రహించాడు తను.

"ఎలా వుంది నవ్యా?" ఆప్యాయంగా అడిగాడు.

అతని ముఖంలోకి ఓ క్షణం చూసి– చప్పున చూపు మరల్చుకుని అందామె.

"రివాల్వర్‌తో నన్ను షూట్ చేసి పారెయ్యక పోయావా? పీడా వదిలేది?!"

★ ★ ★ ★ ★ ★

"నేను మెడ్రాస్ ట్రాన్స్‌ఫర్ పెట్టుకుని వెళ్ళిపోతున్నాను–"

"వాట్.... ఏవిటీ– హ లో.... శ్రీమతేనా మాట్లాడేది?" నవ్య అడిగింది.

# లవ్ గేమ్

"అవును నేనే"–

"ఏవిటే– ఏం జరిగింది? ఎందుకింత హఠాత్తుగా ఈ నిర్ణయం తీసుకున్నావ్?"

"ఏమీ జరగలేదు– నాకీ హైద్రాబాద్ నచ్చలేదు– అంతే–"

"నో– నే నమ్మను– హైదరాబాద్ బావుందనీ– శాశ్వతంగా ఇక్కడే వుండిపోతానని చెప్పావ్– ఇంతలో నే నీ నిర్ణయం ఎలా మారిందో నా కర్థం కావడం లేదు–"

"ప్రస్తుతం నేనేమీ చెప్పలేను– అంతే–"

"నువ్వెక్క డ్నుంచి మాట్లాడు తున్నావ్? ఆఫీస్ నుంచేనా?"

"కాదు– ఇంటి దగ్గర్నుంచి– ఆఫీస్‌లో ఆర్డర్స్ కూడా తీసుకున్నాను. ఈ రోజే రిలీవ్ చేశారు. సాయంత్రం ఫ్లైట్ కెళ్ళిపోతున్నాను–"

"శ్రీమతీ– ప్లీజ్– ఏం జరిగింది? ఆగు– నువ్వు ఇంటి దగ్గరే వుండు. నేనే వస్తున్నా నక్కడికి–" ఆదుర్దాగా అంది నవ్య.

"వద్దు– నే నెవర్నీ చూడదల్చు కోలేదు. నా కిప్పుడు ఏకాంతం కావాలి– ప్లీజ్– ఏమీ అనుకోకు–"

షాక్ తిందినవ్య. అసలు తానేం వింటుందో అర్థం కాలేదామెకు.

"శ్రీమతీ– అయితే మన పందెం.. స్వాగత్‌ని దెబ్బతీసి.... విడాకులు...."

"ప్లీజ్ నవ్యా– ఒక్క విషయం– ఏమీ అనుకోవుగా–"

"చెప్పు–"

"ఈ పంతాలు– పందాలూ మానేసి హాయిగా భర్తతో సంసారం చేసుకో– ప్లీజ్– ఓ స్నేహితురాలిగా నేనిచ్చే సలహా అది–"

"శ్రీ...మ....తీ...." అమితాశ్చర్యంతో అంది నవ్య.

"అవును– అసలా విషయం చెప్పాలనే ఫోన్ చేశాను. భర్త ఎలాంటివాడయినా భార్య భరించి– అతన్ని దారిలో పెట్టుకోవాలి. అది మన సాంప్రదాయం–"

"నువ్వు... నువ్వేనా మాట్లాడేది?" కంగారుగా అంది నవ్య.

చిన్నగా నవ్వి అంది శ్రీమతి.

"అవును నేనే– ఇంతకాలం ఓ మైకంలో వుండి– ఎంతో జీవితాన్ని వ్యర్థపర్చు కున్నాను. అంతేకాదు– నీలాంటి వాళ్ల జీవితాల్లో కూడా శాంతి లేకుండా చేశాను. ఇప్పుడు తెలిసింది నవ్యా– నా ఆశయాలూ సిద్ధాంతాలూ ఎంత మూర్ఖమైనవో– అవును మగాడే కాదు. ఆడదానిలో కూడా మంచి– చెడు– రెండూ వున్నాయి. నేను మగాడిలో చెడును ఆడదానిలో మంచిని మాత్రమే చూశానింత కాలం. ఇప్పుడు నా కళ్ళు తెరుచు కున్నాయి. ఇంత కాలం నీ జీవితంలో ప్రవేశించి నిన్ను నీ భర్తకు దూరం చేయడానికి నీతో సహకరించి నందుకు సిగ్గు పడుతున్నాను. నన్ను క్షమించు– ఉంటాను–"

"శ్రీమతీ–" ఆశ్చర్యంతో ఆమెకు మాట రాలేదు.

"మీ రిద్దరూ కలిసి– ఎప్పుడైనా మద్రాస్ రండి. పంతంతో కాదు సుమా– హాయిగా చిలకా గోరింకల్లా రావాలి. వచ్చి నా ఆతిథ్యం స్వీకరించాలి. ఉంటానే– బై..."

రెండు నిముషాలు అలాగే ఫోన్ పట్టుకుని నిలబడింది నవ్య.

ఇంత హఠాత్తుగా ఈ నిర్ణయం ఎందుకు తీసుకుందో ఆమె కర్థం కాలేదు.



ఓ సాగి వెళ్ళి చూసి రావాలనుకుంది. కానీ ఆమె మాటలు గుర్తొచ్చి- ఆగిపోయింది.

ఇదీ స్వాగత్ పథకంలో భాగం కాదు కదా?!

ఆమె ఉలిక్కిపడింది.

అవును- శ్రీమతిని ట్రాప్ చేసి- ఆమె చేత ఈ విధంగా ఎందుకు మాట్లాడించి వుండకూడదు? కానీ శ్రీమతి విషయం తనకు తెలుసు. ఇలాంటి స్వాగత్‌లు వేయి మంది వొచ్చినా ఆమె చలించదు. అయితే శ్రీమతి మనస్సు మారడానికి కారణ మేమిటి?

ఏ పరిస్థితులు ఆమె నీ విధంగా మార్చాయి?

ఆలోచన్లతో ఆమె తల వేడెక్కిపోయింది. మంచం మీద పడుకుంది.

శ్రీమతి వెళ్ళిపోతుంటే- తన శరీరంలో ఓ భాగం- తన నుంచి వేరైపోతున్న ఫీలింగ్-

ఎలాగయినా ఆమెను ఆపాలి. శ్రీమతి వుంటే తనకు మోరల్ సపోర్ట్- అయినా- అయినా- హాయిగా సంసారం చేసుకోమని చెపుతుందేవిటి?

అసహనంగా తల విదిలించింది.

వీలైతే సాయంత్రం- ఎయిర్ పోర్ట్‌లోనైనా కలుసుకుని మాట్లాడి- ఆ ప్రయాణం ఆపాలి- కనీసం ఈ ఒక్క రోజైనా ఆపి ఆమెతో మాట్లాడి విషయం తెలుసు కోవాలి.

హాల్లో భాగ్యరాజ్ భార్గవీ మీనాక్షి ఏదో సీరియస్‌గా చర్చించుకుంటున్నారు. మీనాక్షి అతన్ని ఏవో ప్రశ్నలడుగుతోంది. భాగ్యరాజ్ చెప్తున్నాడు. సావిత్రి వేరే గదిలో నిద్రపోతోంది. సుందరమూర్తి- మన్మధరావులు కలిసి బయట కెళ్ళారు.

స్వాగత్ తన గదిలోంచి బయట కొచ్చాడు.

"ఆఫీస్ కెళ్ళలేదా?" అడిగాడు భాగ్యరాజ్.

లేదన్నట్లు తలూపాడు స్వాగత్.

"ఇంట్లో భోజనం చేసి ఎంత కాలమైంది?" అడిగాడు భాగ్యరాజ్.

స్వాగత్ మాట్లాడ లేదు.

"రా బాబూ భోంచేద్దువు గానీ-" భార్గవి లేచి నిలబడి అంది.

"వద్దు- ఆకలి లేదు-" అంటూ బయటికి నడవబోయాడు.

సరిగ్గా అప్పుడే-

భాగ్యరాజ్ సిగార్ నోట్లో పెట్టుకుని లైటర్‌తో వెలిగిస్తున్నాడు.

లైటర్ వెలిగించినప్పుడు- అది ఆఫ్ చేసేంత వరకూ- మృదువైన సంగీతం వినిపిస్తోంది.

ఉలిక్కిపడ్డాడు స్వాగత్.

చివాలున వెనక్కి తిరిగి చూశాడు.

భాగ్యరాజ్ అతన్ని చూసి నవ్వి అన్నాడు.

"ఏవిట్రా- ఏమైంది?" సిగార్ పొగ పైకి వదిలి అన్నాడు.

## అనుపమ్‌ఖేర్ జి.కె.!

అనుపమ్‌ఖేర్ సామాన్య జ్ఞానం శూన్యం అని చిత్ర పరిశ్రమలో జనం అనుకుంటున్నారు. సిద్ధార్థ బసు తన ప్రసిద్ధ టి.వి. ప్రోగ్రాం 'ఇండియా క్విజ్'లో పాల్గొమని అనుపమ్‌ని అడిగితే, ఈయన నిరాకరించాడట. కారణం - సామాన్యజ్ఞానం శూన్యమనా? సిద్ధార్థ అడిగే ప్రశ్నలకి అనుపమ్ జవాబులు చెప్పలేడని సందేహం! సిద్ధార్థకికాదు - అనుపమ్‌కి. అనుపమ్ స్థానంలో తానుంటే, తప్పక పాల్గొనేవాణ్ణంటాడు జాకీష్రాఫ్...

- రాభారకనుం

"ఏం లేదు-"

రెండు క్షణాలు అతన్ని చూసి విసురుగా బయటికొచ్చి కారులో కూర్చున్నాడు. మరుక్షణం కారు వేగంగా రోడ్డు మీదకు దూసుకు పోయింది.

అతనికేదో అర్థమై- అర్థం కానట్టుంది. అసలా కోణంలో ఆలోచించ డానిక్కూడా అతనికి మనసొప్ప లేదు. అయినా అలా ఎందుకు కాకూడదు?

అదే ఆలోచిస్తున్నా డతను.

మై గాడ్- అదే నిజమైతే....?

యాక్సిలేటర్ బలంగా నొక్కాడు. వెంటనే ఈ విషయం సవ్యసాచికి చెప్పాలి. అతని మనసు మొద్దు బారి- ఆలోచించే శక్తి కోల్పోయా డతను.

సరిగ్గా అప్పుడే-

అతని కారును ఓవర్‌టేక్ చేసి- అతని కారుకు అడ్డుగా నిలబడింది ఓ మారుతీ కారు.

సడన్ బ్రేక్ వేసి కారాపాడు.

వెంట్రుక వాసిలో గొప్ప ప్రమాదం తప్పిపోయింది.

కోపంగా కారు దిగి- అడ్డుగా ఉన్న కారు వేపు నడుస్తుండగా- ఆ కారు లోంచి దిగింది-

శ్రీమతి!!

"మీరా?" ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును- మిమ్మల్ని పట్టుకోవాలని దాదాపు పది కిలో మీటర్లు వెంబడించాను. ఇక్కడ దొరికారు-" అంది నవ్వుతూ-

స్వాగత్ ఆమెను ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

కళ్ళు లోతుకు పోయి- ఎర్రగా ఉన్నాయి. జుట్టు రేగిపోయి- మనిషి పూర్తిగా అలసి పోయినట్టు- ఏదో దిగులుతో బాధ పడుతున్నట్టుంది.

"ఏవిటి విశేషం?" అడిగాడు స్వాగత్-

"పెద్ద విశేషమే. మీరు నా కారుని నాలుగు గజాలు ఫాలో కండి. ఆ తర్వాత చెప్తాను." అని- కారెక్కి స్టార్ట్ చేసింది. స్వాగత్ ఆమెను ఆశ్చర్యంగా చూస్తూ ఆమెను అనుసరించాడు.

ఆమె కారు వేగంగా దూసుకు

పోతోంది.

సనత్ నగర్ దాటి- కుక్కట్‌పల్లి మీదుగా- కె. పి. హెచ్. బి. కాలనీ దాటి- అక్కడ విశాలమైన ప్రదేశంలో - ఉన్న ఓ భవనం ముందు కారాపింది.

స్వాగత్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఆ భవనానికి దాదాపు నాలుగైదు కిలో మీటర్ల వరకూ ఇళ్ళు లేవు.

ఎప్పటిదో నవాబు కాలం నాటి భవనంలా ఉందది. దాని చుట్టూ అడవిలా పెరిగిన చెట్లు మొక్కలు-

భవనం చుట్టూ ఇనుప తీగెతో కంచె వేసి వుంది. పెద్ద మఱ్ఱి చెట్టు భవనం మీదకు వాలి వుంది.

ఇనుప కంచెకున్న గేట్ తీస్తూ అంది శ్రీమతి.

"త్వరగా రండి- క్విక్-"

వేగంగా భవనంలోకి ప్రవేశించాడు స్వాగత్-

మర్రి చెట్టు మీద ఏదో పక్షి వింతగా కూస్తోంది.

శ్రీమతి ఆ ఇంటితో చాలా పరిచయం ఉన్న దానిలా వేగంగా మెట్లెక్కి రెండో అంతస్థులో వరుసగా ఉన్న గదుల్లో నాలుగో గది ముందాగి- స్వాగత్‌ని చూసింది.

అతని కళ్ళలో కనిపిస్తున్న ఆశ్చర్యాన్ని చూసి దిగులుగా నవ్వింది.

తాళం తీసి లోపలికెళ్ళింది.

ఆమె ననుసరించాడు స్వాగత్.

ఆ గది చాలా శుభ్రంగా వుంది. పాతకాలంనాటి పెద్ద పెద్ద సోఫాలు నాలుగు- వాటి మధ్య పెద్ద టీపాయ్- గోడలకు పురాతనమైన పెయింటింగ్స్- హాలు మధ్యలో పెద్ద షాండ్లియర్.

వింతగా చూస్తున్న అతన్ని చూసి,

"కూర్చో" అంది శ్రీమతి.

ఆమె కంఠంలోని మార్పును గమనించాడు స్వాగత్. శ్రీమతి అతని కెదురుగా కూర్చుని వెనక్కు వాలి కొన్ని క్షణాలు కళ్ళు మూసుకుందామె.

కలలో మనిషిలా చూస్తున్నాడు స్వాగత్.

ఆమె కళ్ళు తెరిచి హఠాత్తుగా అంది.

"నువ్వు నవ్యను ప్రేమించి పెళ్ళి చేసుకున్నావ్ కదూ?"

"అవును"

"అయితే నీ ప్రేమతో మేమాడిన గేమ్‌లో ఓటమి మాదే!"

బాధగా నవ్వుతూ అందామె.

"గేమ్?!!" ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును. భాగ్యరాజ్ నీకు మేనమామ అవుతాడు కదూ..."

"అవును-"

"నువ్వు డిగ్రీ ఫైనలియర్లో వున్నప్పుడు మీ నాన్నగారు చచ్చిపోయారు... అవునా?"

తలూపాడు స్వాగత్. అతనికంతా అయోమయంగా వుంది.

"అప్పట్లో నువ్వు అమ్మాయిల్తో తిరగడం - విలాసంగా ఖర్చు పెట్టడం - నీ జులాయితనం - ఇవన్నీ చూసి నీమీద మీ నాన్నగారికి సదభిప్రాయం లేకుండా పోయింది. తరచుగా మీ ఇద్దరికీ ఎప్పుడూ గొడవలు జరుగుతుండేవి- నువ్వు చాలాసార్లు చిన్నప్పుడే పోయిన మీ అమ్మను తలచుకుని ఒక్కడివే ఏకాంతంగా బాధపడేవాడివి..."

"ఇవన్నీ నీ కెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నాకన్నీ తెలుసు. అందుకే నిన్నిక్కడకు తీసుకొచ్చాను. ప్రశ్న లడగకుండా చెప్పేది విను-" అని వాచీ చూసుకుంది.

మూడు దాటి ఇరవై నిముషాలు.

"అందుకే మీ నాన్న చచ్చిపోయే ముందు తన యావదాస్తి- నీకు కాకుండా నీ భార్యకు, ఆమె ద్వారా నీకు కలిగే సంతానానికీ చెందేట్టు వీలునామా రాసి మీ మేనమామ భాగ్యరాజ్‌ని మీకు గార్డియన్‌గా పెట్టి కన్ను మూశారు. వీలునామా విషయం నీకు తెలీదు. భాగ్యరాజ్ కూడా నీతో ఎప్పుడూ చెప్పలేదు. అప్పటికే నువ్వు నవ్య ప్రేమలో మునిగి తేలుతున్నావ్. ఆ విషయం తెలిసిన భాగ్యరాజ్ షాక్ తిన్నాడు..."

"ఎందుకు?"

ఆమె నవ్వి "ఆయనకో కూతురుంది తెలుసా?" అంది అతని కళ్ళలోకి చూస్తూ.

"తెలుసు. ఆమె అమెరికాలో చదువుకుంటోంది" అన్నాడు స్వాగత్.

"అవును. ఆమెను నీ కిచ్చి చేస్తే- కోట్లాది రూపాయల ఆస్తికి ఆమె వారసురాలవుతుందన్న విషయం అతనికి తెలుసు గనుక- నవ్యతో నీ ప్రేమ ఆయనకు బొత్తిగా ఇష్టం లేదు-"

"కానీ- మా ఇద్దరి పెళ్ళి జరిపించింది ఆయనే-" అన్నాడు స్వాగత్.

"అవును. పెళ్ళయితే జరిపించారు గానీ- మీ ఇద్దర్నీ విడదీసి- ఒకరంటే ఒకరికి ద్వేషం కలిగించి విడాకు లిప్పించి అప్పుడు నీకు తన అమెరికా కూతుర్నిచ్చి చేయాలని అతని ఆశయం. అతని అదృష్టంకొద్దీ శోభనం నాటి నుంచే మీ ఇద్దరూ బద్ధ విరోధుల్లా ప్రవర్తించ సాగారు. ఈ విషయంలో నువ్వు అమాయకంగా బొంబేలో వున్న భాగ్యరాజ్‌ని సహాయం కోరావు. ఆ అవకాశం కోసమే చూస్తున్న భార్యాభర్త లిద్దరూ హైదరాబాద్ వచ్చి నీ ఇంట్లో తిష్ట వేశారు. అప్పట్నుంచీ నవ్య మనస్సు ఎన్ని విధాల విరిచివేయాలో అన్ని విధాలా విరిచి సఫలీకృతులయ్యారు"

"కానీ... మా ఇద్దర్నీ కలపాలన్నదే వారి ఉద్దేశ్యం-పైగా..."

ఆశ్చర్యంతో అంటున్న అతన్ని చూసి నవ్వింది శ్రీమతి.

## కన్నడం మోజు!!

చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం రాయితీలు ప్రకటించింది. అనేక మంది నిర్మాతలు స్పందించారు. ఫలితంగా- ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ లొకేషన్స్‌ల్లో-షూటింగ్‌ల ముమ్మరం పెరిగింది. అయితే ఇంకా కొంతమంది తెలుగు నిర్మాతలు కన్నడ చిత్రరంగం వేపు మొగ్గు చూపడం- ఆ భాషలో నిర్మాణం సాగించడం-ఓ విశేషంగా చెప్పుకుంటున్నారు మద్రాసులో!

అందరూ ఆంధ్రప్రదేశ్ వేపు మరలుతుంటే- కొంతమంది యింకా కర్నాటక వేపు మోజు చూపుతున్నారంటే-కారణం ఆంధ్ర-కర్నాటక మధ్య గల "సబ్సిడీ" వ్యత్యాసమా? గిట్టుబాటు సౌలభ్యమా?? ఏమనుకోవాలి!

"అలా నటించారంతే- మీ ఇద్దరికే కాదు- బయట ప్రపంచానిక్కూడా వాళ్ళు చాలా ఆదర్శమూర్తులుగా కనిపించి- పరోక్షంగా నీచేత సర్కస్ చేయించారు. అవునా?"

ఉలిక్కిపడ్డాడు స్వాగత్.

"కొన్ని రోజుల క్రితం నీకు ఫోన్ చేసి- బంజారా హోటల్లో ఓ యువతిని కలుసుకోవాలని చెప్పాడు... యామై కరెక్ట్?"

పిడుగుపడినట్టు అదిరిపడ్డాడు స్వాగత్.

"అంటే... అంటే.."

"యస్- నీకు ఫోన్ చేసింది భాగ్యరాజే- నువ్వు దానికి ఒప్పుకోలేదు. పైగా చాలా రాష్‌గా మాట్లాడావు..."

"అవును. పోలీస్ రిపోర్ట్ కూడా ఇస్తానన్నాను. అందుకతను తనమాట వినకపోతే నీ అప్పుల్ని ఒక్కొక్కర్ని శవాలుగా మార్చేసి- నీ ఇంటికి పార్శిల్ చేస్తానని బెదిరించాడు. నేను భయపడి అతను చెప్పిన ప్రకారం చేయడానికి ఒప్పుకున్నాను" చెప్పాడు స్వాగత్

"ఈలోగా డిటెక్టివ్‌చేత నీకు ఫోన్ చేయించి ఆమెను బంజారా హోటల్‌కి వెళ్ళేలా చేసి- సరిగ్గా ఆమె వచ్చేసరికి నువ్వు ఆ యువతితో కలిసి ఆమె కెదురయేలా ప్లాన్ చేశాడు. పైగా నీకు నీ వాళ్ళెవరు కనిపించినా- ఓ అపరిచితుడి లాగానే ప్రవర్తించాలి. ఏమాత్రం గుర్తు పట్టినట్టుండకూడదు అని హెచ్చరించాడు. నువ్వు అలాగే ప్రవర్తించావ్. అలాగే మరోసారి ఫోన్ చేసి ఇద్దరమ్మాయిల్తో నువ్వు నవ్య చూసేలా

## లవ్ గేమ్

ఎంజాయ్ చెయ్యాలన్నాడు. దానికి నువ్వు ఒప్పుకోలేదు. ఫలితం శైలజను హత్య చేసి ఆ నేరాన్ని నీ భార్యమీదకు నెట్టాడు. ఆ భయంతో తర్వాత నువ్వు సఫిల్‌గూడా ఫ్లాట్‌లో మరో యువతితో వున్నట్టు నటించడానికి ఒప్పుకున్నావు. దాని ఫలితమే- మీ అత్తగారి వాళ్ళందరి ముందూ నువ్వు దోషిలా నిలబడ్డావు.

ఇలా ఓ పథకం ప్రకారం నీ భార్య మనసులో నువ్వంటే విపరీతమైన ద్వేషం-కసి-అసహ్యం కలిగేలా చేసి మీ ఇద్దరికీ విడాకులు ఇప్పించడానికి వేదిక తయారు చేశాడు..."

"రాస్కెల్" ఆవేశంతో పిడికిలి బిగించాడు స్వాగత్.

"నాకు ఇంతకుముందే అనుమాన మొచ్చింది మామయ్యమీద. ఆ విషయం లాయర్‌తో చెప్పడానికి బయల్దేరేసరికి-- మీరు కలిశారు" అన్నాడు స్వాగత్.

"నీ కనుమాన మొచ్చిందా? ఎలా?" ఆశ్చర్యంగా అడిగింది.

"నాకు ఫోన్ చేసి మాట్లాడేటప్పుడు- సిగరెట్ లైటర్ సంగీతం చాలాసార్లు వినిపించింది. అదే మ్యూజిక్ నేనెక్కడో విన్నాననుకునేవాడిని గానీ- అది భాగ్య రాజ్ సిగరెట్ లైటర్ మ్యూజిక్ అని గుర్తు రాలేదు. ఈ రోజు ఆయన సిగరెట్ వెలిగించుకోవడానికి లైటర్ వెలిగించే సరికి నాకు హఠాత్తుగా గుర్తొచ్చి షాకయ్యాను. కాకపోతే అదే మ్యూజిక్ వున్న లైటర్ ఆ హంతకుడి దగ్గర కూడా ఉండొచ్చుగదా అని రాజీ పడాలని ప్రయత్నించాను" అన్నాడు.

శ్రీమతి నవ్వింది.

"ఇంతకీ ఇవన్నీ మీ కెలా తెలుసు?" అనడిగాడు ఆశ్చర్యంగా.

శ్రీమతి నవ్వింది. పెద్దగా నవ్వింది. నవ్వి- నవ్వి ఆ నవ్వు దుఃఖంగా మారి- రెండు చేతుల్తో ముఖం కప్పుకుని కుమిలి కుమిలి రోదించసాగింది.

ఊహించని ఈ పరిణామానికి అతను నివ్వెరపోయాడు.

నిశ్శబ్దంగా, నిస్సహాయంగా చూస్తున్నాడామెను.

ఆమె హృదయ విదారకంగా ఏడుస్తోంది.

నెమ్మదిగా లేచి, ఆమె తలమీద చేయివేసి అన్నాడు,

"మేడం- ప్లీజ్... రిలాక్స్ అవండి..."

ఆమె అతనూహించని విధంగా అతని చేతిని పట్టుకుని, దానికి తన చెంపలను హత్తుకుని అంది.

"నువ్వు-నువ్వెంత మంచివాడివి?"

"మేడం..." కంగారుగా అన్నాడు స్వాగత్.

ఆమె లేచి నిల్చుని అతని భుజాలమీద చేతులు వేసి అంది,

"మేడంని కాదు బావా- నీ మరదల్ని!"

అతని గుండె క్షణం లయ తప్పింది.

ఆమెకి మతిభ్రమించిందేమోనన్న అనుమాన మొచ్చింది.

నివ్వెరపోయి అలాగే చూస్తున్న అతన్ని చూసి- బాధగా నవ్వి-

"అవును బావా- భాగ్యరాజ్- భార్గవిలు మా అమ్మ నాన్నలు!"

"వేయి వాల్టుల కరెంట్ షాక్ తిన్నట్టు

అదిరిపడ్డాడు స్వాగత్.

ఒకదానివెంట ఒకటి వేగంగా బయట పడుతున్న నిజాల్ని అతని మనస్సు రిసీవ్ చేసుకోలేకపోతోంది.

"అది... అదెలా సాధ్యం- పల్లవి... అమెరికాలో ..."

"ఆ పల్లవిని నేనే. నాకు పది సంవత్సరాల వయసులో చూశావు నువ్వు. మళ్ళీ పదమూడేళ్ళ తర్వాత చూసిన నన్ను నువ్వు గుర్తు పట్టలేదు. పైగా నేను 'శ్రీమతిగా' పేరు మార్చుకుని రంగ ప్రవేశం చేశాను..."

"అంటే నువ్వు అమెరికా వెళ్ళలేదా? పేరు మార్చుకుని ఇక్కడికి రావలసిన అవసర మేముంది? మరి నవ్య నీకు స్నేహితురాలెలా అయింది?" అయోమయంగా అడుగుతున్న అతన్ని చూసి అంది శ్రీమతి.

"అమెరికా వెళ్ళాను. అక్కడ కేవలం రెండు సంవత్సరాలు మాత్రమే వుండి, తిరిగి బొంబే వచ్చాను. అమ్మా-నాన్నలు నాకీ పథకం చెప్పి నన్ను ఉద్యోగంలో పెట్టారు. అప్పటికే నీకు నవ్యతో పెళ్ళి ఫిక్సయింది. పెళ్ళికి ముందు నవ్య ఓ ప్రైవేట్ కాలేజీలో ఉద్యోగం చేస్తుండేది. ఆమె ఉండే హాస్టల్లోనే నేనూ జాయినయి ఆమెని పరిచయం చేసుకున్నాను. సహజంగా స్నేహానికి విలువనిచ్చే నవ్య నాతో చాలా త్వరగా కలిసి పోయింది.

నవ్య పెళ్ళి సెటిలవగానే ఉద్యోగం మానేసి ఇంటికెళ్ళిపోయింది. నాకూ హైదరాబాద్‌లో బోర్ కొట్టి మద్రాస్ వెళ్ళి కాలక్షేపం చేశాను.

పెళ్ళయి-నువ్వు అమెరికా వెళ్ళి వచ్చేలోపల మా మధ్య ఉత్తరాలు సాగాయి. తను నెలకి పది రాస్తే- నేను ఇరవై రాసేదాన్ని. అలా మా స్నేహం- గాఢ స్నేహంగా మారింది.

నవ్య కాపురానికి హైదరాబాద్ రాగానే నన్ను ట్రాన్స్‌ఫర్ పెట్టుకోమని రోజూ ఫోన్లో పోరు పెట్టేది. ఆ అవకాశం కోసమే చూస్తున్న నేను వెంటనే ఇక్కడి కొచ్చాను.

అప్పట్నుంచీ నవ్య మనస్సు పూర్తిగా విరిచి- నీమీద ద్వేషం కలిగించే ప్రయత్నాలు ప్రారంభించాం..."

## లవ్ గేమ్

ఆమె చెప్పడం ఓ క్షణం ఆపి- అతన్ని చూసింది.

అతని కళ్ళలో ఏ భావమూ లేదు.

నిస్తేజంగా చూస్తున్నాడామెను.

"నవ్యతో కలిసి నీమీద డిటెక్టివ్‌ని పెట్టాను. ఆ డిటెక్టివ్‌కి ఐదు వేల రూపాయలిచ్చి మేము చెప్పినట్టు చేయమన్నాం. అతనలాగే చేశాడు. మేము అనుకున్నట్టు మామీద ఏమాత్రం అనుమానం రాకుండా మా గేమ్‌లో మేము సక్సెస్ అయ్యాం- నవ్యచేత నీకు విడాకులిప్పించడానికి - వాళ్ళింట్లో వాళ్ళంతా కూడా ఒప్పుకున్నారు-"



స్వాగత్ నెమ్మదిగా కదిలాడు.

ఒక్కో అడుగు వేస్తూ- పాతదై శిథిలావస్థలో వున్న ఆ కిటికీలోంచి చూస్తూ అన్నాడు.

"మీకు... మీకు ఆస్తే కావాలంటే- మొత్తం ఆస్తి- నవ్య మీకు రాసిచ్చేది కదా పల్లవీ! ఎందుకింత నాటకం ఆడి- ఇన్ని ప్రాణాలు తీసి ఇందరి జీవితాలతో చెలగాటమాడారు?"

సుడిగాలిలా వచ్చి అతని పాదాలమీద వాలి కన్నీటితో అభిషేకిస్తూ అందామె.

"నన్ను క్షమించు బావా - మొదట్లో నీమీద మోజుతో అమ్మా నాన్న చెప్పినట్టు చేశాను. వాళ్ళు ఆడమన్నట్టు ఆడాను. కానీ... కానీ...? చెప్పలేక తలను అతని పాదాలకేసి కొట్టుకుంటున్న ఆమెను లేవనెత్తాడు స్వాగత్.

"ఇన్ని ప్రయత్నాలు చేసినా- ఇంత నాటకం ఆడినా నవ్య నిన్ను మనసారా ద్వేషిస్తున్నా ఆమెమీద నీకున్న చెక్కు చెదరని అనురాగాన్ని, ఆత్మీయతను చూసి నేను చేస్తున్న దెంత దారుణమో తెలుసుకున్నాను. హాయిగా సంసారం చేసుకోవలసిన ఇద్దర్ని లేనిపోని అపోహలు సృష్టించి వేరు చేయాలనుకోవడం ఎంత ఘోరమో అర్థమైంది. అంతేకాదు. నాకోసం విషాన్నైనా ఆనందంగా తాగడానికి సిద్ధపడ్డాడు ఆ సూర్యం. ఇన్ని మంచి మనసుల మధ్య నేను కలుపుమొక్కలా బతుకుతూ- వారి జీవితాలను నాశనం చేయాలనుకోవడం నాకే సిగ్గనిపించింది. అందుకే అమ్మా నాన్నలతో ఇక ఈ నాటకానికి తెర వేసి నిజం చెపుదామన్నాను. వాళ్ళు నన్ను పిచ్చిదాన్ని చూసినట్టు చూశారు. ఇన్ని సంవత్సరాల తమ కష్టం ఫలించబోయే తరుణంలో నేనిలా మాట్లాడ్డం వాళ్ళు సహించలేకపోయారు. నేను ససేమిరా విన్లేదు. ఒప్పలేదు. ఎలాగయినా ఈ విషయం నీకు చెప్తానని వచ్చేశాను..."

ధారలుగా స్రవిస్తున్న కన్నీటిని సైతం తుడుచుకోకుండా చెప్తోందామె.

స్వాగత్ కంగారుగా అన్నాడు.

"అయితే నిన్ను వాళ్ళేం చేయరా?"

"నా కోసం వెతుకుతుంటారు. ఇది మేమంతా కలుసుకుని మాట్లాడుకునే స్థలం... బహుశా ఇక్కడిక్కూడా ఎవర్నైనా పంపిస్తారేమో నాన్న..." అంది.

సరిగ్గా అప్పుడే కింద ఆ భవనం ముందు కారాగిన చప్పుడు వినిపించింది. శ్రీమతి కంగారుగా కిటికీలోంచి చూసి భయంతో వణికిపోతూ అంది.

"మై గాడ్ - పాషా... పాషా వచ్చాడు."

"పాషా ఎవరు?"

"మాష్టర్ షూటర్ - పవన్‌కుమార్ని చంపింది వాడే..." అంది శ్రీమతి.

(ఇంకావుంది)

# ఎవరు దోషి?

బొల్లిముంత వెంకట రమణారావు

సమయం ఉదయం పదిన్నర కావస్తోంది... అది విజయవాడ బస్‌స్టేషన్! అక్కడంతా జనంతో కిటకిట లాడ్తోంది. తెనాలి బస్సు కోసం ఎదురు చూస్తున్నాను నేను.

విజయవాడ ఎప్పుడొచ్చినా ఈ మాటలే మన చెవుల్లో పడుతూ వుంటాయి. "జేబు దొంగలున్నారు జాగ్రత్త!" "అపరిచితుల దగ్గర మీ సామాన్లు వదిలి వెళ్లవద్దు"లాంటి ప్రకటనలు మైకు ద్వారా వినపడుతున్నాయి.

అసలు జేబుదొంగలు మన జేబుల్లో నుండి పర్సులు ఎలా మాయం చేస్తారో చూడాలని నా ఆశ! వాడు పర్సు తీసేటప్పుడు పట్టుకొని అందరి ముందు ఒక హీరో ఫోజు పెట్టాలని నా కోరిక! అందుకే ఈసారి నా పర్సుని ప్యాంట్ బ్యాక్ పాకెట్‌లోనే వుంచాను.

తెనాలి బస్సు ప్లాట్‌ఫాం మీదకు వచ్చి ఆగింది. గుమికూడిన ప్రయాణీకుల్ని ఛేదించుకుంటూ బస్సులోనికి ప్రవేశించాను... ఆ మరుక్షణం ఉలిక్కిపడ్డాను! కారణం! ప్యాంట్ వెనుక జేబులోని పర్సు మాయమైంది!! నా వెనుకే బోల్డుమంది ఎక్కారు అంతమందిలో ఎవరు దొంగో ఎలా తెలుస్తుంది? అన్నది ఓ యక్షప్రశ్న?

అయినా పర్సు కొట్టేసిన దొంగగారు ఇంకా అక్కడే ఎందుకుంటారు? నా పిచ్చి కాకపోతే! పర్సు పోయినందుకు కాదు నా బాధ. అది వ్యక్తిగత పరాభవంగా భావించాను.

మళ్లీ పర్సు కొట్టిన దొంగను తలచుకోగానే, అయ్యో పాపం! అంటూ నా పెదవిపై చిరునవ్వు మెరసి మాయమైంది.

గతంలో నా స్నేహితులకు జరిగిన అనుభవాలు గుర్తుకొచ్చాయ్... గబగబ బస్సు దిగి బస్‌స్టేషన్‌లో పోలీస్ కౌంటర్ దగ్గరకు ఫిర్యాదు చేయడానికి వెళ్లాను. నా పేరు... అడ్రసు, పర్సులో ఉన్న విలువ వ్రాసుకొని "పర్సు దొరికితే కబురు పంపుతామని" అన్న వారి మాటలకు నవ్వుకుంటూ వచ్చేశాను.

అక్కడే ఉన్న ఓ కానిస్టేబులు మీలాంటి చదువుకున్న వారు కూడా అజాగ్రత్తగా వుంటే ఎలా సార్? అని తన సహజ ధోరణిలో ఒక నతి వాక్యం చెప్పాడు.

మా అజాగ్రత్తయే కదా! మీకు శ్రీరామరక్ష! అని మనస్సులో అనుకున్నాను

నేను పోలీసు రిపోర్టు ఇవ్వడం చూసి ఏమిటి సార్? పోలీస్ రిపోర్టు ఇస్తే పోయిన డబ్బు తిరిగొస్తుందా? వచ్చినా తిరిగి ఒకిస్తారా? అంటూ పలకరించాడు ఒక ఆసామి మొహం మీదకు చిరునవ్వు తెచ్చుకుంటూ. [illegible]



రాకపోవచ్చు కానీ, బాధ్యత గల ఓ పౌరుడిగా రిపోర్టు ఇస్తే దొంగలు ఎన్ని జేబులు కొట్టేసింది- తమకు అందవలసిన కమీషన్ పోలీసులు లెక్కవేసుకుంటారు.

నా మాటలకు "ఆఁ!" అంటూ ఆశ్చర్యంతో ఆ పెద్దమనిషి నోరు తెరవడం చూసి "ఆరోగ్యానికి అంత మంచిది కాదు, దోమలు దూరిపోగలవు నోరు మూసేయండి!" అని ఒక పాత జోక్ పేల్చి ముందుకు కదిలాను.

## 'ఎవరు దోషి?'



ఆఫీస్ పనిమీద మళ్ళీ నాలుగు నెలల తర్వాత విజయవాడ రావటం జరిగింది. బస్టాండ్‌లో బస్సుదిగుతున్న నాకు గతం గుర్తుకు వచ్చింది. నాలో నేను నవ్వుకున్నాను. బస్టాండు నుంచి బయటకెళ్తున్న నన్ను ఎవరో పిల్చినట్లయింది "బాబుగారూ!" అన్న పిలుపుతో అటువైపు చూశాను.

సుమారు ముప్ఫై ఏళ్ల వయస్సున్న వ్యక్తి ఒక కాలులేదు. మనిషి కాస్త బలంగానే వున్నాడు. మాసిపోయిన బట్టలతో ప్లాట్‌ఫాం మీద ఓ మూల, అతనిముందు ఒకగుడ్డ దానిపై చిల్లర పైసలు ప్రయాణీకులంతా తమకు తోచినంత చిల్లర పైసలు వేసి వెళ్తున్నారు. నేను ఒక పావలాబిళ్ళ వేసి అడుగు ముందుకేయబోయాను.

ఇంతలో "బాబుగారూ! నేను మిమ్మల్ని పిలిచింది యాచన కోసం కాదు..." అన్నాడు. ఆశ్చర్యంగా వెనక్కి తిరిగిచూశాను... అతని చేతిలో నల్లని పర్సు కనిపించింది. ఆ రోజు బస్సులో పోయిన పర్సు అదే!! "ఈ పర్సు నీ దగ్గరకెలా వచ్చింది"? అని ఆశ్చర్యంగా ప్రశ్నించాను.

"మీ పర్సే ఇది... నేనే కొట్టేశానండి!" నాకు నువ్వు చెప్పేది ఏమీ అర్థం కావటంలేదు. చూస్తే కుంటికాలుతో వున్నావ్? నువ్వెలా కొట్టేసావ్?

"అవునండీ! ఆ రోజు మీ పర్సు కొట్టిన తరువాతే నా కాలుపోయింది బాబుగారూ" అన్నాడు బాధగా.

......"ఆ రోజు సాయంత్రం పోలీసువాళ్ళకు రోజులాగే మామూలు ఇవ్వాలని వెళ్ళడంతో మీరు డబ్బు పోయిందని రిపోర్టు ఇచ్చిన సంగతి తెల్సింది. మీ పర్సు వాటా డబ్బు అడిగారు. ఆ పర్సులో డబ్బులేదని చెబితే ఎవరు నమ్ముతారు? నేను దొంగనికదా? నన్ను విరగదీసి వదిలారు బాబుగారూ! వాళ్ళు కొట్టిన దెబ్బలకు ఈ కాలు విరిగింది. సమయానికి సరైన మందులు వాడనందువల్ల అవిటివాడినై పోయానంటూ" గద్గద స్వరంతో చెప్పాడు.

నేను తెల్లబోయి చూస్తూ ఉన్నాను.

బాబుగారూ! మిమ్మల్ని పిలిచింది ఒకే ఒక విషయం తెలుసుకోవాలని! ఆ పర్సులో నిజంగా డబ్బుందా? లేదా? ఉంటే ఏమయింది? లేకపోతే మీరు ఎందుకు రిపోర్టు ఇచ్చారు? అన్న ప్రశ్నలతో అప్రయత్నంగా నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

బాబుగారూ! మీరు బాధపడకండి... ఆ పాపిష్టి ప్రపంచం నుంచి విముక్తి పొంది, ఇప్పుడే మనిషిగా బ్రతుకుతున్నాను. అసలు విషయం తెలుసుకోవాలని తప్ప మిమ్మల్ని బాధపెట్టాలని కాదు అన్నాడు అతను.

"నిజానికి ఆ పర్సులో డబ్బులేదు. కేవలం పోలీసులను, దొంగలను ఒక నాటకం ఆడించాలని ఖాళీ పర్సునే జేబులో వేసుకున్నాను. కాని నేను చేసిన పని ఇలా ఓ వ్యక్తి అవిటితనానికి కారణమవుతుందనుకోలేదు" అన్నాను బాధగా.

"బాబుగారూ! ఈ దేశంలో కాళ్ళూ- చేతులు ఉన్నా డబ్బు లేకపోతే ఎవరూ సుఖంగా బ్రతకలేరు. ఇప్పుడు నాకు కాలు లేకపోవడంవల్లే రోజుకి పాతిక రూపాయల వరకు సంపాదిస్తున్నాను" అన్నాడు కాస్త గర్వంగా.

నేను మౌనంగా ఒక యాభైరూపాయల నోటు అతని చేతిలో బలవంతంగా పెట్టి వెనక్కు తిరిగాను. "బాబుగారూ! ఈ పర్సు నా దగ్గరే ఉంచుకుంటున్నాను. మీరు చేసిన మేలుకు కృతజ్ఞతగా" అని అతడన్న మాటలు వ్యంగ్యమో, నిజమో నాకర్థం కాలేదు.

నేనేం బదులివ్వలేదు... ఇప్పటికీ అతని అవిటితనానికి కారకులెవరో, దోషులెవరో నాకర్థం తెలీదు. ○

---

( 4 వ పేజీ తరువాయి)

ఎదురు చూస్తున్నాను. నా విన్నపం ఏమిటంటే– ప్రస్తుత రచనలతో బాటు మన పత్రికలో లోగడ ప్రచురితమైన సీరియల్స్ కంటిన్యూగా ప్రచురించమని. ఎందుకంటే నేటి తరానికి గొప్పవారి గురించి తెలియాల్సిన అవసరం ఎంతైనా వుంది! ఆనాటి స్థితిగతులు, పరిస్థితులు, తెలుసుకోవటమే గాక కరువైపోతున్న మంచి మానవత్వాల గురించి గుర్తు చేయాల్సిన గురుతర బాధ్యత మీపైవుంది కనుక. నేటి వేగవంతమైన నాగరికతకు కళ్ళెం వేసి కనులు తెరిపించాల్సిన అవసరం ఎంతో వుంది. దాని కోసం సాహితీరంగంలో మార్పులు ఎంతైనా అవసరం. మీరు సాధిస్తారనే నేను ఆశిస్తున్నాను. యువ రచయిత లకు మీరిస్తున్న ప్రోత్సాహం కూడా బావుంది.

జి. బాలాజీ
కొంగారెడ్డిపల్లి

### కథలు

ఈ వారం పత్రిక నిజంగా ముత్యం,

# వీక్లీ పోస్ట్

10-8-90 కథ చాలా బావుంది. 'నీ వెనుక నీ నీడ' రచన కె. కె. రఘునందన బాగా చేశారు.

కొటికలపూడి శివరామప్రసాద్
(హైదరాబాద్)

### మోతాదుగా

సాహిత్యం పట్ల ఆసక్తి, అభిరుచి ఉన్న పాఠకుడు కాని పాఠకురాలు కాని రచనల్లో క్రొత్త విషయాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తారే తప్ప కేవలం సెక్స్ కథలు కావాలని ఎవరూ అడగరు. అంత మాత్రం చేత సెక్స్ కథలు అసలు రాకుండా ఉండాలని అనకూడదు. బాలలకు బాలపత్రికలు, మహిళలకు పత్రికలు ఉన్నట్లే యువతరానికి ప్రత్యేకించి కొన్ని పత్రికల్లో ఒక శృంగారమైన కథను ప్రచురిస్తే వాళ్ళు ఆ కథతో పాటు ఆ పత్రికను మొత్తం క్షణంలో చదివేస్తారు. కానీ కథనంలో ఎక్కువగా సాహిత్యాన్ని నింపి అవసరమైనంత వరకే శృంగారాన్ని పెట్టి అసభ్యత, అశ్లీలతలకు తావు లేకుండా చేస్తే అది సర్వజన ఆమోదం పొందగలుగుతుంది. అందుచేత నేడు పెరుగుతున్న విజ్ఞానాభివృద్ధితో పాటు సైంటిఫిక్‌గా పాఠకులకు కొంత సెక్స్ పరిజ్ఞానం తెలుసుకొని ఉంటే లైఫ్‌లో కొంచెం థ్రిల్‌ను పొందే అవకాశం కలుగుతుంది.

కొరబండి శ్రీనివాసరావు
ఒంగోలు

### కవిత

వారపత్రిక 6.4.90 లో ప్రచురించిన కవిత "ఓ మనిషీ" చాలా బాగుంది. రచయిత్రి దగాని సుధగారికి నా శుభాకాంక్షలు.

దగాని మాధవి
హైదరాబాద్ ○

నేడు మీరు యవ్వనంలో ఉన్నారు
పరిపూర్ణమైన ఆరోగ్యం మీ అదృష్టం
సిరిసంపదలు మీ కష్టార్జితం రేపటిగురించిన
ఆత్మవిశ్వాసం మీ సొంతం

కానీ ఊహించుకోనివి జరగటమే జీవితం
కొన్ని సంఘటనలు మీకు ఆనందాన్నిస్తాయి
కొన్ని మిమ్మల్ని సంభ్రమపరుస్తాయి
మరికొన్ని విచారంలోనూ ముంచుతాయి

జీవితంలో ఎన్నెన్నో సమస్యలు
ఎదురుకావచ్చు. ఆ సమస్యలలో చాలావాటికి
డబ్బు ఒక్కటే పరిష్కారమని మీకు తెలుసు
అందుకే ఆర్థికపరమైన భద్రతకోసం,
మార్గదర్శి ద్వారా డబ్బు ఆదాచేయండి

మీ అవసరాలన్నిటికీ తగినవిధంగా
మార్గదర్శిలో ఎన్నెన్నో పథకాలున్నాయి మీ
డబ్బుకు మార్గదర్శిని మించిన భద్రతలేదు

మార్గదర్శి చిట్‌ఫండ్స్‌కు 25 సంవత్సరాల
చరిత్ర ఉంది. సాలీనా 120 కోట్ల రూపాయల
బిజినెస్ టర్నోవర్‌తో, 80 కోట్ల రూపాయల
**అక్షన్ టర్నోవర్‌తో భారతదేశంలోకెల్లా నంబర్
1 చిట్‌ఫండ్** సంస్థగా మీ ముందు
నిలుస్తోంది — మార్గదర్శి

అన్నిటా అగ్రగామి అయిన మార్గదర్శితో
కలిసి నడవండి మరిన్ని వివరాలకు మా
ఏజెంట్లను కలవండి లేదా మమ్మల్ని
సంప్రదించండి

**డబ్బుకోసమేనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత**









## మార్గదర్శి

**చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిస్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీస్:
అబిడ్ సెంటర్, హైదరాబాద్- 500 001

బ్రాంచీలు ● బషీర్‌బాగ్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట్, హైదరాబాద్ ● దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ ● కోఠి, హైదరాబాద్ ● ఎమ్ జి రోడ్, సికింద్రాబాద్ ● ఎ ఎమ్ సి కాంప్లెక్స్, విజయవాడ ● బందర్‌రోడ్, లబ్బీపేట, విజయవాడ ● జగదాంబా జంక్షన్, విశాఖపట్నం ● స్టేషన్‌రోడ్, గుంటూరు ● జె పి ఎన్ రోడ్, వరంగల్ ● టి నగర్, రాజమండ్రి ● సుభాష్‌రోడ్, కాకినాడ ● నెహ్రూరోడ్, కర్నూలు ● వైరారోడ్, ఖమ్మం ● నరసింహారావ్‌పేట్, ఏలూరు ● ఆర్ ఆర్ స్ట్రీట్, నెల్లూరు

# నేడు మీదే...
# కానీ రేపటి మాటేమిటి?



KIRON/MCF/10189

# బీజింగ్ ఆసియాడ్ '90



చైనా రాజధాని బీజింగ్‌లో యీసారి ఆసియా క్రీడోత్సవాలు జరుగుతున్నాయి. చైనాలో పరిస్థితులు సర్దుమణిగి తమ దేశ రాజధానిలో ఆసియా క్రీడలు జరప నిశ్చయించి, క్రీడాపోటీల కార్యక్రమం కూడా విడుదలచేసింది. చైనాలో గత 50 ఏళ్ళలో జరుగుతున్న మొదటి అంతర్జాతీయ పోటీ యిదే అనవచ్చును. మాస్కోలో 1980లో జరిగిన ఒలింపిక్స్‌కు ఆ దేశంలోని విదేశస్థులకు బహిరంగ ఆహ్వానం లభించినది. అలాగే యీ ఆసియా క్రీడలు చైనాలో అందరికి స్వాగతం పలుకుతున్నాయి. ఈ పోటీలు జరుపటాన్ని చైనా ప్రతిష్టాకరంగా భావించి భారీ ఎత్తున ఏర్పాట్లు చేసింది.

చైనాలో పోటీలను గత సియోల్ ఆసియాడ్ కన్నా దిగ్విజయంగా చేసి తమ ప్రతిభ ప్రపంచానికి చాటాలని ఉద్దేశముతో యున్నది. రోజు రోజుకు మారుతున్న క్రీడారంగ ప్రతిభ, నెలకొల్పబడుచున్న రికార్డులు చైనాలో మరికొన్ని క్రొత్త రికార్డులు సృష్టించబడగలవని ఆశించవచ్చును.

మన ప్రాచీన క్రీడ 'కబడీ' బీజింగ్ ఆసియా క్రీడలలో మొట్ట మొదటిసారిగా 'మెడల్ స్పోర్ట్'గా సెప్టెంబరు 28 నుండి అక్టోబరు 2 వరకు జరుగును.

బీజింగ్ ఆసియా క్రీడోత్సవాలలో 27 క్రీడలలోను రెండు ప్రత్యేక ప్రదర్శన క్రీడలలో పోటీలు జరుగును.

27 క్రీడాపోటీలు: ఆర్చెరి, అథెలెటిక్స్, బ్యాడ్మింటన్ (షటిల్), బాస్కెట్ బాల్, బాక్సింగ్, కానోయీంగ్, సైకలింగ్, ఫెన్సింగ్, ఫుట్ బాల్, గల్ఫ్, జిమ్నాస్టిక్స్, హ్యాండ్ బాల్, హాకీ, జూడో, కబాడీ, ఫ్లోయీంగ్, సేపక్ టక్రా, షూటింగ్, సాఫ్ట్‌బాల్, ఈత, డైవింగ్, వాటర్ పోలో టేబుల్ టెన్నీసు, టెన్నీసు, వాలీబాల్, వెయిట్ లిఫ్టింగ్, కుస్తీ, ఉఘా, యాచింగ్.

ప్రదర్శన క్రీడలు: బేస్‌బాల్, సాఫ్ట్ టెన్నీసు:

ఫ్లోయీంగ్, సేపక్ టక్రా, సాఫ్ట్‌బాల్, ఉఘా మనకు తెలియని క్రొత్తక్రీడలు. సేపక్ టక్రా యిప్పుడిప్పుడే కొన్ని ప్రాంతాలలో పోటీలు జరుపుచున్నారు. అలాగే సాఫ్ట్ టెన్నీసు మనకు క్రొత్త. ఆసియా క్రీడలలో యిన్ని (27 క్రీడలలో) పోటీలు జరుగుట ఒక రికార్డు. ఇదివరలో యిన్ని పోటీలు లేవు.

పతకముల వేటలో యీసారి మనం నాలుగు, అయిదవ స్థానం పొందగలమని క్రీడారంగ మేధావుల ఆలోచన. క్రొత్త క్రీడలు అనేకం యుండుట, వాటిలో మనకు ప్రవేశం లేకపోవుట యిందుకు కారణం అంటారు. కనీసం మన సంప్రదాయ క్రీడ కబడీలోనైనా మ ‌కు స్వర్ణపతకం లభించగలదని ఆశిద్దాం.





# ఆసియా క్రీడోత్సవాల కార్యక్రమం

16 రోజుల క్రీడాపండుగలో - క్రీడాపోటీలు, రెండు ప్రదర్శన క్రీడలు యుండును.

| | |
|---|---|
| 1990 సెప్టెంబరు 22 | ప్రారంభోత్సవ కార్యక్రమం |
| అక్టోబరు 1నుండి 5 | ఆర్చెరి |
| సెప్టెంబరు 27 నుండి అక్టోబరు 3 (సె.30 విశ్రాంతి) | అథెలెటిక్స్ |
| సెప్టెంబరు 28 నుండి అక్టోబరు 6 (అ.1 విశ్రాంతి) | బ్యాడ్మింటన్ (షటిల్) |
| సెప్టెంబరు 23 నుండి అక్టోబరు 6 (అ.4 విశ్రాంతి) | బాస్కెట్ బాల్ |
| సెప్టెంబరు 26 నుండి అక్టోబరు 3 (అ.2 విశ్రాంతి) | బాక్సింగ్ |
| అక్టోబరు 2 నుండి 5 | కానోయింగ్ |
| సెప్టెంబరు 24 నుండిఅక్టోబరు 1 (సె.25 విశ్రాంతి) | సైకలింగ్ |
| సెప్టెంబరు 24 నుండి అక్టోబరు 4 | ఫెన్సింగ్ |
| సెప్టెంబరు 23 నుండి అక్టోబరు 6 (సె.30-అ.2 విశ్రాంతి) | ఫుట్ బాల్ |
| సెప్టెంబరు 24-27 | గాల్ఫ్ |
| సెప్టెంబరు 23-26 | జిమ్నాస్టిక్స్ |
| సెప్టెంబరు 23-అక్టోబరు5 | హాకీ |
| సెప్టెంబరు 24 -అక్టోబరు 5 | హ్యాండ్ బాల్ |
| సెప్టెంబరు 28 -అక్టోబరు 1 | జూడో |
| సెప్టెంబరు 28 -అక్టోబరు 2 | కబాడీ |
| సెప్టెంబరు 23-26 (25 విశ్రాంతి) | రోయింగ్ |
| సెప్టెంబరు 23 -అక్టోబరు 6 | సేపక్ టక్రా |
| సెప్టెంబరు 25-30 | షూటింగ్ |
| సెప్టెంబరు 22 -30 | సాఫ్ట్ బాల్ |
| సెప్టెంబరు 23 నుండి 28 | స్విమ్మింగ్ |
| అక్టోబరు 1-6 | డైవింగ్ |
| సెప్టెంబరు 2 - అక్టోబరు 1 | వాటర్ పోలో |
| సెప్టెంబరు 24 - అక్టోబరు 2 (సె.28 విశ్రాంతి) | టేబుల్ టెన్నిస్ |
| సెప్టెంబరు 24 - అక్టోబరు 5 | టెన్నిస్ |
| సెప్టెంబరు 23 - అక్టోబరు 5 | వాలీబాల్ |
| సెప్టెంబరు 23 - అక్టోబరు 1 (సె.26 విశ్రాంతి) | వెయిట్ లిఫ్టింగ్ |
| సెప్టెంబరు 23-26 | కుస్తీ |
| సెప్టెంబరు 30-అక్టోబరు 3 | కుస్తీ |
| సెప్టెంబరు 29-అక్టోబరు 4 | ఉషూ |
| సెప్టెంబరు 22-27 | యాచింగ్ |

## ప్రదర్శన క్రీడలు

| | |
|---|---|
| అక్టోబరు 3,4,5 | బేస్ బాల్ |
| సెప్టెంబరు 24-27 | సాఫ్ట్ టెన్నీసు |
| అక్టోబరు 7 | పోటీల ముగింపు కార్యక్రమం |

మన దేశం నుండి *125* మంది క్రీడాకారులు, అధికారులు, అధినేతల బృందం పాల్గొనవచ్చునని ప్రాథమిక వివరాల వలన తెలియుచున్నది.

-ముకరమ్.





సీరియల్

# సాగరమథనం

## అడివి సూర్యకుమారి

(గత సంచిక తరువాయి)

ఒక అత్యవసర సమావేశాన్ని ఆ రోజు రాత్రిఏర్పాటు చేశారు.

అహింసావాద టి.వి.పి. నాయకుడు మేఘవర్ణ మాట్లాడుతూ

"దాదాపు 800 సంవత్సరాల క్రిందటి నుండి మనం ఈ గడ్డమీద జీవిస్తున్నాం. ఇక్కడే పుట్టి ఈ మట్టిలో కలిసిపోతున్నాం. మన తాత తండ్రులు వారి పూర్వీకులు అంతా ఈ గడ్డలో కలిసిపోయారు. ఇది మన మాతృభూమి. ఇక్కడి నుండి మనల్ని వెళ్ళిపొమ్మనే అధికారం ఎవరికీ లేదు. సింహాళీయులెంతో మనమూ అంతే. మనం రెండవ తరగతి పౌరులుగా పరిగణించబడటం అన్యాయం".

అనగానే సభలో 'అన్యాయం, అన్యాయం' అన్న కేకలు వచ్చాయి.

మేఘవర్ణ చేయెత్తి ఆపమన్నట్లుగా తన ఉపన్యాసం సాగించాడు. "సింహాళులతో మనం సమంకాదు అన్న సమస్య లేదు. వాళ్ళూ మనం ఒకటే. సింహళులుగా చెప్పుకొనబడే వీరంతా మనకంటే కొన్ని వందల సంవత్సరాల ముందుగా ఈ దీవికి ఇండియా నుండి వచ్చిన వారే. ఆ తర్వాత మనం వచ్చాం. నిజానికి వాళ్ళూ మనం వచ్చింది ఇండియా నుండే. మనమంతా ఒకే జాతికి చెందిన వాళ్ళం. కాబట్టి సింహాళీయులకున్న హక్కులన్నీ మనకూ ఉండాలి. కాని.. ఇది జరగలేదు. కాలేజీల్లో, హైస్కూళ్ళలో, ఉద్యోగాల్లో తమిళులకు రిజర్వేషన్లు కల్పించారు. కాని దీన్ని ప్రత్యేకంగా తమిళులకిస్తున్న సౌకర్యంగా ప్రభుత్వం ప్రకటించింది. దీనివల్ల ఓపెన్ కాంపిటీషన్‌లో అందరితో సమానంగా అవకాశాలు పొందవలసిన తమిళులు దెబ్బతిన్నారు. అంతేగాక వ్యాపార సంస్థల్లో, రాజకీయ వ్యాసంగంలో మన ప్రాపకం నశించటానికి ఈ రిజర్వేషన్ ఒక దోహదం చేసింది. ఇది తమిళుల అసంతృప్తికి ప్రధానకారణం. ఈ రిజర్వేషన్ బిల్లువల్ల శ్రీలంకలో ప్రొఫెషనల్, టెక్నికల్ ఎంప్లాయిమెంట్‌లో ఉన్న వారి పర్సెంటేజి ఇలా వుంది. సింహాళులు 82% అయితే తమిళులు 12% మాత్రమే.

పరిపాలనా వ్యవస్థలో సింహాళులు 81% వుంటే మన తమిళులు 16% మాత్రమే. మిగతా కేటగిరీల్లో సింహాళులు 84% వుంటే, మనం 12% మాత్రమే ఉన్నాం."

సభలో నుండి 'సిగ్గు... సిగ్గు.. ఇందుకు మనం సిగ్గుపడాలి. షేమ్ షేమ్' అన్న కేకలు అరుపులు గోలగా తయారైంది.

మేఘవర్ణ గొంతులేవగానే నోళ్ళన్నీ మూతబడ్డాయి.

'1972లో స్టాండరడైజేషన్ పాలసీ ప్రకారం అన్ని ఉద్యోగాల్లోకి తమిళుల్ని ప్రత్యేకించి కేటాయించబడ్డ నిష్పత్తి మేరకు మాత్రమే తీసుకోవటం జరిగింది. ఈ మేరకుప్రభుత్వోద్యోగాల్లో , కార్పొరేషన్లలో, అన్ని సంస్థల్లోనేగాక, ప్రత్యేకించి పోలీసు, మిలిటరీలో కూడా ఈ రిజర్వేషన్ అమలు జరిపారు. దీనితో ప్రస్తుతం ఈ పదహారు సంవత్సరాలుగా సింహాళీయులే పోలీసు, మిలిటరీ శాఖలన్నింటిలో, మిగతా రంగాల్లో అధిక డామినేషన్‌లో ఉన్నారు. ఇంక మనం అన్ని ఉద్యోగాల్లోనూ కలిపి 5% మాత్రమే ఉన్నాం'.

'ఇది అన్యాయం, అక్రమం, ప్రభుత్వపు దమననీతికిది తార్కాణం, మనం దీన్ని ప్రతిఘటించాలి' అన్న కేకలు సభలో చెలరేగాయి.

"శ్రీలంకను మొత్తం 5 జోన్స్‌గా

ఇంతవరకూ సాగిన కథ-2: శ్రీలంక ఉగ్రవాదులను అరికట్టడంలో తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చి స్వదేశం తిరిగి వెళ్తున్న భారత శాంతి సేనకు వీడ్కోలిచ్చేందుకు వచ్చిన ముగ్గురు అధికారులు దుండగుల బుల్లెట్లకు బలిఅవుతారు. ఈ సంఘటనకు కారకుడిగా అనుమానించే రణసింఘెను ఒక అజ్ఞాత వ్యక్తి హతమారుస్తాడు. అధికారులు అతని శవాన్ని స్వాధీనం చేసుకుంటారు. ఆ అజ్ఞాత వ్యక్తి ఎవరా అని అధికారులు ఆలోచిస్తుంటారు. జాఫ్నా తీరంలో రామేశ్వరం నుంచి వస్తున్న ఓడపై బాంబింగ్ జరిగి ప్రాణ నష్టం సంభవిస్తుంది.

విభజించారు. అందులో 3, 4 జోన్స్ మన తమిళులవి. 1, 2, 5 జోన్స్ సింహళీయులివి. శ్రీలంక నార్త్ రీజియన్‌లో ఉన్న జాఫ్నా, మన్నారు, వాయునీయల్లో మన తమిళులు 86.35% ఉంటే సింహళీయులు 2.98% ఉన్నారు. ఈస్ట్ రీజియన్‌లో భట్టికోల, అంపెరాయి, ట్రింకోమలిల్లో మనవాళ్ళు 40.90% ఉంటే సింహళీస్ 24.92% ఉన్నారు. మొత్తంమీద 65 10% మనం ఉన్నాం. 13.24% సింహళీయులున్నారు. శ్రీలంక మొత్తం మీద రెండు జోన్లు మనవి. దేశమంతా మనం ఉన్నాం. అయినా మనం ఇలా రెండవ తరగతి పౌరులుగా గుర్తించబడటం అన్యాయం. అయితే మనం మన హక్కుల్ని అహింసాపరంగా సంపాదించుకోవాలే తప్ప హింసతోకాదు."

ఆ మాటలు వింటూనే ఉగ్రవాద నాయకుడు ఉన్నికృష్ణన్ ఆవేశంగా లేచాడు. "మీ అహింసావాదమే ఇంత దూరం తెచ్చింది. ఇంకా కొన్ని రోజులీ అరాచకాలిలాగే సాగితే అసలు తమిళులనే వాళ్ళు కన్పిస్తారంటావా? సింహళీయుల దౌర్జన్యాలు చూస్తూ కూడా మీరింకా అహింసను పట్టుకు వ్రేలాడటం బాగుందా? మొన్నటి దారుణం కళ్ళారా చూసి కూడా మీరిలా మాట్లాడటం ఏం బాగా లేదు. ఒక్కసారి ప్రజల ముఖాల్లోకి చూడండి. ఎవరి మొహంలోనైనా మీకు ప్రశాంతత కన్పించిందా? ప్రజలకు శాంతి లేదు. రక్షణ లేదు. ఈనాడు వీరంతా అనాథలు. ప్రజా ప్రతినిధులు నోరువిచ్చి తమ కష్టసుఖాలు చెప్పుకోవటాని కసలు అవకాశం ఉందా ఈ దేశంలో చెప్పండి... మాట్లాడరేం... ఇలాంటి సమయంలో చెప్పాల్సింది శాంతి వన్నాలు కావు తుపాకీని తుపాకీతోనే ఎదుర్కోవాలి. తరిగిపోతున్న మన స్వేచ్ఛను మనం తిరిగి సంపాదించుకోవాలి".

'ఔను.. ఔను.. ఉన్నికృష్ణన్... జిందాబాద్' సభలో కేకలు.

అతణ్ణి కూర్చోమన్నాడు మేఘవర్ణ. "మిత్రులారా! మీ ఆవేశం వెనక ఉన్న బాధ, గుండెకోత, ఆవేదన నేనర్థం చేసుకోగలను. మన పొరుగువ వున్న ఇండియా నలభై ఏళ్ళక్రిందట ఎటువంటి స్థితిలో ఉందో మీకు చరిత్ర చెప్తోంది. 200 సంవత్సరాలు బ్రిటిష్‌వారి పాలనలో భారతీయులు పడ్డపాట్లు, చేసిన త్యాగాలు ఒక్కసారి చదివి తెలుసుకోండి.



సూర్యుడస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని భారత్ ఎదిరించి గెలిచింది తుపాకులతో కాదు. అహింసాయుధంతో. నేడు మనమూ ఆ ఆయుధాన్నే ఉపయోగిద్దాం. అహింస అంటే మీ దృష్టిలో చాలా అల్పమైందిగా, శక్తిహీనంగా కన్పిస్తోంది కదూ! సమయం వస్తే అహింస అణుబాంబు కంటే శక్తివంతమని ముందు ముందు మీరే తెలుసుకుంటారు. ఇప్పుడు మనం రేపు బయలుదేరి కొలంబో వెళ్ళి పార్లమెంటు ముందర నిరాహారదీక్ష సాగిద్దాం. మాకు రక్షణ కల్పించండని కోరుదాం. ఏమంటారు?

షూటింగ్ హాలంతా నిశ్శబ్దం. అందులో సగం మందికి అతని మాటలు నచ్చలేదు. చేవచచ్చిన వాడిమాటల్లా అన్పించాయి. నచ్చినా నచ్చకపోయినా అంతా మౌనంగానే ఉండిపోయారు.

అది మేఘవర్ణమీది గౌరవం. అంతే!

మర్నాడు-

అహింసావాద టి.వి.పి. నిరాహారదీక్ష పార్లమెంటు ముందు సాగించింది.

టి.వి.పి.ని సపోర్టు చేసే రాజకీయ పార్టీ నాయకులని అరెస్టు చేసింది ప్రభుత్వం.

మేఘవర్ణని అరెస్ట్ చేశారు.

ర్యాలీలు నిర్వహించవద్దని, ఇవి ప్రజల్లో ఇంకా ద్వేషాన్ని రగుల్చుతాయని, ఇలాంటి ఊరేగింపులకి ఇకమీదట అనుమతించబోమంది గవర్నమెంటు.

అతి సామాన్యమైన మానవ హక్కులొక్కొక్కటి ప్రభుత్వం హరించటం చూస్తుంటే తమిళుల్ని బానిసలుగా చూస్తున్నట్లన్పించింది టి.వి.పి. ఉగ్రవాదులకి. వాళ్ళు దీన్ని ప్రతిఘటించసాగారు.

"సింహాళీయులకి మేం ఎందులో తీసిపోం. మాకు సమాన హక్కులూ, సౌకర్యాలు కావాలి. మా ప్రజా ప్రతినిధులకి పార్లమెంటులో అవకాశం ఉండాలి. మా కోర్కెలు చర్చించాలి. తీర్చబడాలి' అని అరుస్తూ టి.వి.పి. తిరిగి ర్యాలీ ప్రారంభించింది.

'మేఘవర్ణని వెంటనే విడుదల చెయ్యాలి' అని కేకలు వేస్తూ ఊరేగింపు సాగుతోంది.

ఆర్మీ జోక్యం చేసుకొంది.

తమిళులెక్కువగా ఉండే జాఫ్నా, ట్రింకోమాలీలలో ఊరేగింపుని ఏ విధంగానైనా అణిచేందుకు పోలీసులకు ఆర్డర్స్ వచ్చాయి.

ఉగ్రవాద టి.వి.పి. యువకులానాడు వీరభద్రుల్లా విజృంభించారు. మైకులు

## జీవితంతో జీవితాన్ని వెలిగించు

ఓ మనిషీ!
దీపంతో దీపాన్ని వెలిగించినట్లు
జీవితంతో జీవితాన్ని వెలిగించు
విచక్షణా రహితంగా పశువులా
ప్రవర్తించవద్దు

మానవతకు తలవంపులు తేవద్దు
చరిత్రలో నీ స్థానం
సమున్నతం కావాలి
చరిత్రహీనుడవు కావద్దు
చరిత్ర గతిని మార్చాలి కాని
చరిత్రకు దుర్గతి పట్టించవద్దు.

తాళ్ళపల్లి మురళీధరగౌడు

పట్టుకొని అరుస్తూ ఊరేగింపు సాగించారు. ప్రభుత్వ దమన నీతిని చెండాడే విధంగా ప్రసంగిస్తూ సామాన్య పౌరులకి తమకు జరుగుతున్న అన్యాయాలు అర్థమయ్యే విధంగా చెబుతున్నారు.

"మా స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వం హరిస్తోంది. మీరు ప్రశాంతంగా మా కోర్కెలు తీర్చకపోతే జాఫ్నా, ట్రింకోమాలీలను పూర్తిగా మాకొదిలెయ్యండి. మేమే గవర్నమెంటు ఫామ్ చేసుకుంటాం".

ఈ మాటలు అక్కడి అసిస్టెంటు పోలీసు సూపరింటెండెంట్ విన్నాడు. వారి స్లోగన్లు, ఉపన్యాసం గవర్నమెంటుకి యాంటీగా ఉన్నాయి. ఇది ప్రభుత్వంపై తిరుగుబాటు అంతేగాక మరో ప్రభుత్వాన్ని పోటీగా తయారు చేయటం పెద్దనేరం.

అతనికి ఫుల్ పవర్స్ గవర్నమెంటు ఇచ్చింది.

ఆ ర్యాలీలో పాల్గొన్న వారందరినీ యాంటీ గవర్నమెంటుగా ట్రీట్ చేసి కాల్చెయ్యమని ఆర్డర్స్ ఇచ్చాడు.

అంతే -

పోలీసుల దౌర్జన్యానికి అంతులేదు.

కన్పించిన వాళ్ళని కన్పించినట్లు కాలుస్తున్నారు. భయంతో కకావికలై పరిగెత్తే జనాన్ని తరిమి తరిమి కాలుస్తున్నారు.

ర్యాలీలో పాల్గొనని సాధారణ పౌరులు సైతం ఆ తుపాకీల తూటాలకి బలౌతున్నారు.

ఆ కాల్పులకి విచక్షత లేదు.

విచక్షణ లేదు.

పిల్లలూ, ముసలివాళ్ళూ, యువకులూ, స్త్రీలూ, పురుషులూ అన్న వివేచన లేదు.

అదొక తూటాల వర్షం.

ఆ రోజు జాఫ్నా పట్టణ రోడ్లు తమిళుల రక్తంతో తడిశాయి.

ఈ సందడిలో

కంటికి నదరుగా కన్పించిన తమిళ యువతుల్ని వ్యాన్‌లోకి బలవంతంగా లాక్కెళ్ళి ఎక్కించారు పోలీసులు. వారి కేకలు కాల్పుల చప్పుళ్ళలో కలిసిపోయాయి. వారి రోదనలు చావుకేకల అరుపులలో తేలిపోయాయి.

ఆ వ్యాన్ అతి వేగంగా ఊరిబైట వున్న గెస్ట్‌హౌస్ వైపుకి వెళ్ళిపోతోంది.

కాల్పులు, చావులు, కేకలు నడుమ జరిగిన దారుణాన్ని టి.వి.పి. యువకులు తెలుసుకోలేకపోయారు.

చావగా మిగిలిన వాళ్ళు భయంతో పారిపోయారు. వ్యాన్‌లోని యువతులు భయంతో బిగుసుకుపోయారు.

లోపలున్న ఐదుగురు పోలీసుల హీనమైన చర్యలకు వారు వేసే కేకలకు రోడ్డు కటుఇటు వున్న కొండలు కోనలు ప్రతిధ్వనిస్తున్నాయి. యువతుల ఆక్రందనలతో ఆ ప్రదేశం మార్మోగుతోంది.

వ్యాన్‌లో ఉన్న పోలీసులైదుగురు తుపాకీలు గురిపెట్టి 'నోర్మూయండి, శబ్దం బైటికి వచ్చిందా! కాల్చిపారేస్తాం' అన్నారు.

వాళ్ళు భయంగా చూస్తూ కూర్చున్నారు. కొందరు నోట్లో గుడ్డలు కుక్కుకొని ఏడుస్తున్నారు.

'వీళ్ళు తమని తీసికెళ్ళి ఏం చేస్తారూ?'

తలచుకుంటేనే వాళ్ళ గుండెలు అవిసిపోతున్నాయి.

వ్యాన్‌లో నుండి దూకేసి ప్రాణం పోగొట్టుకున్నా ఫర్వాలేదనుకున్నా కిటికీలాంటివేం లేవు దానికి.

పోలీసులు వెకిలిగా నవ్వుతూ, అసభ్యంగా వారి శరీరవర్ణన చేస్తూ మాట్లాడుకోసాగారు.

ఆ మాటలు వినలేక ఆడపిల్లలు

## సాగర మధనం

చెవులు మూసుకుంటున్నారు. మనసులో కన్పించని దేవుళ్ళకి మొక్కుకుంటున్నారు. ఈ రాక్షసుల బారినుండి తమని కాపాడమని బాలమురుగన్‌ని వేడుకొంటున్నారు.

ఇంతలో -

కొద్దిదూరంలో, టర్నింగ్ పాయింట్‌లో

నడిరోడ్డుమీద ఆరడుగుల నాలుగంగుళాల భారీ విగ్రహం నిలబడింది.

రెండు చేతులు ఎత్తాడు వస్తోన్న వ్యాన్‌ని ఆపమన్నట్లుగా.

డ్రైవర్ వ్యాన్‌ని ఆపే సూచనలేవీ కనబడలేదు.

వ్యాన్ మలుపు తిరిగేచోటు దగ్గరయింది.

అది హెయిర్ పిన్‌బెండ్. కనుక వెహికల్ డెడ్‌స్లోగా పోతూ టర్న్ తీసుకుంటోంది.

ఆగంతకుడు డ్రైవర్ వైపున్న కిటికీ లాగి, క్రిందికి లాగాడు డ్రైవర్ని. కిందికి లాగటం, అతణ్ణి ఫుట్‌బాల్‌లా తన్నటం రెప్పపాటుకాలంలో జరిగాయి.

అతను తన్నిన తన్నుకు డ్రైవర్ బంతిలా ఎగిరి వెళ్ళి ప్రక్కనే ఉన్న కొండ రాయికి తగిలి అప్పటికప్పుడే ప్రాణం విడిచాడు. అతను ప్రాణంపోతూ వేసిన చావుకేక, నాలుగడుగులు ముందుకు జరిగి వ్యాన్ ఆగటం రెండూ ఒకసారి జరిగాయి.

వ్యాన్ ఆగటం, డ్రైవర్ చావుకేక వినటంతో లోపలున్న పోలీసులు గబగబ వ్యాన్ దిగారు.

బైటకొచ్చిన ఐదుగురు ఆగంతకుణ్ణి చూస్తూనే అతనివైపు కాల్పులు సాగించారు.

అతను గాలిలోకి డైవ్‌చేసి ఒక పోలీసును తన ముందుకు లాక్కున్నాడు. తనవారి కాల్పులకి బలైన అతణ్ణి మరో సిపాయిపై విసిరి తనని కాపాడుకుంటూ ఎదుటివాళ్ళని దెబ్బతీస్తున్నాడు. వారి కాల్పులకి వారిలో ఇద్దరు బలయ్యారు. మెడమీద వేసిన దెబ్బకి ఒకడి మెడ కర్రపుల్ల విరిచినట్టు విరిగిపోయింది. మిగతా ఇద్దర్ని రెండుచేతులా ఎత్తిపట్టి గిరగిరతిప్పి కొండ రాయి వైపు విసిరాడు. సరిగ్గా డ్రైవర్ పడ్డ చోటపడి ఆ క్షణంలోనే తలపగిలి ప్రాణం విడిచారు వాళ్ళు.

వ్యాన్ దిగిన యువతులు ఆశ్చర్యంగా భయంగా ఆ దృశ్యాన్ని చూడసాగారు.

ఇతను మనిషా! లేక ఏవైనా సూపర్‌పవర్స్ ఆవహించిన వాడా!

లేకపోతే ఒక మనిషి ఇద్దరు బలవంతుల్ని సునాయాసంగా చిన్నపిల్లల్ని తిప్పినట్లు గిరగిర తిప్పి బంతుల్నెగరేసినట్లు విసిరెయ్యడమే! ఆ వేగానికి వాళ్ళిళ్ళి కొండక్కొట్టుకొని తలపగిలి అక్కడికక్కడ చావటమేమిటి?

ఇంత మహాద్భుతమైన దృశ్యాన్ని వాళ్ళ జీవితంలో ఎప్పుడూ చూడలేదు.

వాళ్ళ కళ్ళు మరింత విశాలంచేసి అతనివైపే చూడసాగారు. అతను రోడ్డుదిగి వల్లంలోకి వెళ్ళాడు. కొండరాతి వైపు నడిచి మూడు శవాల్ని ఈడ్చుకుంటూ తీసుకొచ్చి వ్యాన్‌లో పడేశాడు. రోడ్డుమీది మూడు శవాల్ని కూడా ఇలాగే వ్యాన్‌లో ఎక్కించాడు.

ఆ తర్వాత ఆడపిల్లల వైపు తిరిగి 'భయపడకండి. నావల్ల మీకు ఉపకారమే తప్ప అపకారం జరగదు. మీరంతా జాఫ్నా సిటీవాళ్ళేనా? వేరే ప్రాంతాల నుండి తీసుకురాబడ్డారా?' చక్కటి తమిళంలో అడిగాడు. వాళ్ళకతని మధురమైన సౌమ్యస్వరం వినేసరికి ప్రాణాలు లేచొచ్చాయి.

ఒక్క పరుగున అంతా అతణ్ణి చుట్టుముట్టి ఏడుపు మొదలుపెట్టారు.

'ఏడవకండి ఈ గొడవలు సద్దుమణిగే దాగా జాగ్రత్తలో ఉండండి. అయినా మీరింతమంది ఉన్నారు. దాదాపు పదిమందిపైనే ఉన్నారు కదా! ఆ ఐదుగురు పోలీసుల్ని ఎదిరించలేకపోయారా?'

"మేం ఏం చెయ్యగలం! ఆడపిల్లలం. వాళ్ళా మగవాళ్ళు. పైగా పోలీసులు. చేతుల్లో తుపాకులున్నాయి."

'ఇదిగో ఈ బలహీనతే మిమ్మల్నీ స్థితికి తెచ్చింది. ఏం ఆడపిల్లలయితేనేం? తెలివి లేదూ! శక్తి లేదూ! శారీరకంగా మటుకు మీరెందుకు బలహీనులు కావాలి? వ్యాయామం చేయడం, కరాటే, జూడో లాంటివి నేర్చుకోండి. ధైర్యం పెంచుకోండి. మిమ్మల్ని మీరు రక్షించుకోవటమే కాదు ఇతరుల్ని కాపాడే స్థితికి మీరురావాలి. ఇలాంటి దుర్మార్గులకి బుద్ధి చెప్పాలి.'

'ఇప్పుడు ఈ వయసులో మేం ఏం వ్యాయామాలు చేయగలం?'

'వ్యాయామానికి, విద్యకీ వయసుతో పనిలేదు. సాధన, కృషి, పట్టుదల ఈ మూడు ఉంటే అసలు ఆడవాళ్ళు సాధించనిదేముంది?'

అందరిలో నుండి ఓ పిల్ల ముందుకొచ్చింది 'తప్పకుండా మీరు చెప్పినట్లు చేస్తాం. కాని... మాకవి ఎవరు నేర్పుతారు? ఎక్కడ నేర్పుతారు?' అందిఆమె పేరు షీలా.

'మీకు శక్తి సేవాశ్రమం తెలీదా! ట్రింకోమలిలో వుంది. అక్కడికి వెళ్ళండి'

అన్నాడు.

'మీరెవరు? మా ప్రాంతం వారిలా లేరు?' అప్పుడు చూశారతన్ని విమర్శగా.

అతడు చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో వెయ్యి జ్యోత్స్నల చల్లదనం వుంది. ఆ నవ్వు వాళ్ళకి ధైర్యాన్నిచ్చింది.

'నేను మీ వాణ్ణే. ప్రస్తుతానికింత కంటే చెప్పలేను. పదండి. మిమ్మల్ని జాఫ్నాలో దించాలి' అంటూ వ్యాన్ వైపు నడిచాడు.

డ్రైవర్‌సీటులో కూర్చున్నాడతడు. ఆడపిల్లలంతా బ్యాక్‌న ఎక్కారు.

వ్యాన్ స్పీడుగా వచ్చిన దారి మళ్ళింది.

చీకటి పడుతోంది.

జాఫ్నాలో అడుగుపెట్టగానే వ్యాన్ ఆపాడు.

ఆడపిల్లలంతా దిగి వెళ్ళిపోయారు.

వ్యాన్ నేరుగా ఎ.ఎస్.పి. ఆఫీస్‌కి

## సాగరమథనం

పక్కగా ఆగింది.

అతను వ్యాన్ దిగి ఆ ప్రక్కనే ఉన్న సందుగుండా లోపలికి వెళ్ళిపోయాడు.

ఏదో పనిమీద బైటికొచ్చిన స్టేషన్ హౌస్ ఆఫీసర్ వ్యాన్ రావటం చూశాడు.

లోపలికొచ్చి ఎ.ఎస్.పి. చెవి దగ్గర నోరుంచి, చిన్నదైన స్వరంతో "సార్! వాళ్ళని దించి వ్యాన్ వచ్చింది" అన్నాడు.

ఏ.ఎస్.పి. మొహంలో ఆనందం, కోరిక పోటీ పడ్తున్నాయి.

'ఇంక బైలుదేరుదామా!' అన్నాడు ఆత్రంగా.

'డ్రైవర్నిలాపిలు' అన్నాడు ఏ.ఎస్.పి.

ఎస్.హెచ్.ఒ. గబగబ బయటికి వ్యాన్ దగ్గరికొచ్చాడు. వ్యాన్‌లో డ్రైవర్ లేడు.

'వీడెక్కడికి పోయాడింతలో!' అనుకుంటూ చుట్టూ చూశాడు. కూడా వెళ్ళిన కానిస్టేబుల్స్ ఏరి? కొంప దీసి అక్కడే ఆడపిల్లల దగ్గర వుండిపోయారా! కొంపలు మునిగాయే ఈ సంగతి ఏ.ఎస్.పి.కి తెలిస్తే, ముందాయనే బోణీ చెయ్యాలి. ఎవరైనా ఆ పిల్లలమీద ముందుగా చెయ్యేస్తే వాళ్ళపని అఖరుగదా! ఏ సంగతి చెప్పటానికి ఈ డ్రైవరు వెధవ ఎక్కడ తగలడ్డాడు?" అనుకుంటూ వ్యాన్ వెనక్కి వెళ్ళాడు.

అక్కడ వ్యాన్ డోర్ పూర్తిగా వేయ లేదు. ఓరగా వుంది చీకట్లో తెల్లగా కింది కేదో వ్రేలాడుతున్నట్లుగా వుంది. అతను గబగబ వ్యాన్‌డోర్ తెరిచాడు అంతే!! అతను దిగ్భ్రాంతితో నిలబడిపోయాడు!!!

(ఇంకా వుంది)

# యస్.వి. రంగారావు తొలి అగ్రిమెంట్

తెలుగు చిత్రజగతిలో తన కంటూ ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకున్న అసమాన ప్రతిభా సంపన్నుడైన శ్రీ రంగారావు నటనకు ఈనాడు గీటురాయి పెట్టి వన్నె-విలువ చెప్పవలసిన పనిలేదు. తన నటనా కౌశలంతో అశేష ప్రజాహృదయాలను చూరగొన్న ఆ కళామూర్తి సినిమా ప్రవేశం, తన దృక్పథం గురించి విశ్లేషించడమే ఈవ్యాసం యొక్క ముఖ్యోద్దేశ్యం.

**1945 సం.వరకు నాటకాలేస్తూ, ఫైర్ ఆఫీసర్ ఉద్యోగం చేస్తూ గడిపిన శ్రీ రంగారావుకు తన మేనమామ ఆనందా పిక్చర్స్ అధినేతయిన బి.వి.రామానందం నుంచి లేఖ వచ్చింది.** ఆ తర్వాత టెలిగ్రామ్ కూడా వచ్చింది. ఆ లేఖలో విషయం చదివి రంగారావు విస్మయం చెందాడు. రామానందం తీయతల పెట్టిన 'వరూధిని' చిత్రంలో ప్రధాన పాత్ర ప్రవరాఖ్యునిగా రంగారావును నియమించినట్లు, వెంటనే వచ్చి అగ్రిమెంట్ రాసుకొని, పాత్రను స్టడీ చేయమని ఆ లేఖలో సారాంశం! కడలితరంగాల్లా తనలో కళాభినివేశం ఉరకలు వేయసాగింది..

## రాజీనామా

ఆఫీసర్ ఉద్యోగానికి రాజీనామా చేసి రాజమండ్రి ఆనందా పిక్చర్స్ కార్యాలయానికి చేరుకున్నాడు. నిర్మాత-దర్శకుడు రామానందంతో కుదుర్చుకున్న ఒప్పంద పత్రం, తొలి చిత్ర పారితోషికంగా అందుకున్న రు. 150-00ల అడ్వాన్స్ రశీదు ఇవిగో చూడండి!

ఆనాటి ఒప్పంద విధానం, చిత్ర నాయకునికి లభించిన పారితోషికం మొత్తం రూ. 750-00లు అంటే ఈనాటి ప్రేక్షకులకు నమ్మశక్యం కాని విషయం!

ప్రవరాఖ్యుని పాత్ర పోషణకుగాను అలసాని పెద్దనామాత్యుని కృతి, "మనుచరిత్ర" క్షుణ్ణంగా పఠించి, ప్రవరాఖ్యుని ఆచారవ్యవహారాలు, వ్యక్తిత్వాన్ని బాగా అవగాహన చేసుకున్నాడు.

> ప్రవరాఖ్యునిగా
> ఎస్.వి.ఆర్.కి
> 750 ఇచ్చారు

ఒక శుభ ముహూర్తాన సేలంలో 'మాడరన్ థియేటర్స్ స్టూడియో'లో షూటింగ్ ఆరంభమయింది. రంగారావు ప్రవరాఖ్యుని రూపంతో సెట్‌లోకి అడుగుపెట్టాడు. అందరిదృష్టి ఈ నూతన వ్యక్తి మీదే కేంద్రీకృతమైంది. "ఎందుకలా నన్నుతేరిపార చూస్తున్నారు వీరంతా" అని అనుకున్నాడు... షూటింగ్ ఆరంభమయింది... సెట్‌లో తన తొలి అనుభవాన్ని రంగారావు ఇలా చెప్పాడు-

"విశాలమయిన జీవితరంగంలో అడుగుపెట్టే ప్రతి వ్యక్తీ ఎన్నో సమస్యలను, ఎన్నో అవాంతరాలను ఎదుర్కోవలసి వస్తుంది. ఒక్కొక్కరు ఒక్కో దృక్పథంతో, ఒక్కొక్క ఆశయంతో జీవిత సమరం



To Mr B.V. Ramanandam
Mualla Street Rajahmundry

Received the amount of Rs 150/- Rupees Hundred and fifty only as advance against my agreement today with you, to act main roles in your telugu picture, which is to be taken at 'Modern Theatres' Salem

Rajahmundry
21-10-1945

S.V. Ranga Rao
21-10-45

దీ. 21-10-1945 సం. తేదీని రాజమండ్రి తాలూకా ధవ ళేశ్వరము గ్రామము సామర్ల బిల్డింగ్సులో నివశించుచున్న తెలగా కులస్థులు సామర్ల కోటేశ్వరరా వుగారి కుమారుడు వెంకటరంగా రావు, ఫిల్ము ప్రొడ్యూసర్ డైరె క్టరు అగు బి. వి. రామానందం గార్కి వ్రాయించి యిచ్చిన ఎగ్రి మెంటు.

1.మీరు మోడరన్‌థియేట ర్సుశాలెంలో తీయబోయే తెలు గుఫిల్ములో మీరు నాకు నిర్ణ యించిన రెండు పాత్రలు (కృష్ణ దేవరాయ, ప్రవరాఖ్యుడు) నేను యాక్టు చేయుటకును అందు లకు గాను, తొంబది రోజులకు రు. 750/- లు (అక్షరాల ఏడు వందల యేబది రూపాయలు) మీరు నాకు యిచ్చుటకున్ను.

2.నా పార్టులు పూర్తి అయ్యేవరకు మీ వద్ద వుండి నేను పూర్తి చేయుటకును, ఒక వేళ తొంబది రోజులలోపలనే నా పార్టులు పూర్తి అయిపోయిన యెడల నిర్ణయించిన మొత్తము యావత్తు నాకు మీరు యిచ్చు టకును, ఒకవేళ నాకు నిర్ణ యించిన పాత్రలు పూర్తిగాకపో యిన యెడల తొంబది రోజులకు పైన నేను యింకను వుండ వలసి వచ్చిన పైన నిర్ణయించిన మొత్తము నేను పైన నిర్ణయిం చిన రోజులకు పైగా పనిచేసిన దానికి ప్రోరేటా చొప్పున మీరు నాకు యిచ్చుటకును.

3.మీరు నన్ను రమ్మన్న చోటికి 1946 ఫిబ్రవరి 15వ తారీఖులోపుగా మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు నేను వచ్చు టకును రానుపోను 3వ క్లాసు రైలు ఖర్చులు భోజనము వసతి నేను వున్నంత కాలము మీరు నాకు యిచ్చుటకును.

4.అచ్చట మీరు నాకు యిచ్చు భోజనము అనగా (వుద యమున కాఫీ 12 గం. లకు కాయగూరలతో భోజనము సాయంకాలము "టీ" రాత్రి 8 గంటలకు కాయగూరలతో భోజ నము) వసతికి అంగీకరించి నేను మీ వద్ద పనిచేయునంత కాలము అచ్చటనే వుండెదను.

5.మీరు ఈ రోజున ఈ ఎగ్రిమెంటు కాలమందు యిచ్చిన రు. 150/- (అక్షరాల నూట యాభై రూపాయలు) ఎడ్వా న్సుగా యిచ్చినారు గాన ముట్టి నది. ఈ రోజు పుచ్చుకొన్న ఎడ్వాన్సు మొత్తము సొమ్ములో నుంచి పోను మిగతా రూ. 600/- (అక్షరాల ఆరువందల రూ.) మాత్రమే పుచ్చుకొ నుటకున్నూ మీరు ఎడ్వాన్సుగా యిచ్చిన సొమ్ము మొత్తము నేను అచ్చటికి చేరిన రోజు మొదలు 30 రోజులు అనంతరము నాకు నా సొమ్ములో నుండి నెల

# యస్.వి. రంగారావు తొలి అగ్రిమెంట్

1కి వచ్చు డివిడెంటు సొమ్ములో నుండి మొదటి నెలలోనే మిన హాయించుకొని మిగతా సొమ్ము మాత్రమే మీరు నాకు యిచ్చు టకును

6.ఈ ఎగ్రిమెంటు మీరు ఫిల్ము తీయబోయె వూరికి మీరు తెలియపరచిన వెంటనే అచ్చటికి చేరిన రోజు నుండి అమలులోనికి వచ్చును.

7.మీరు నిర్ణయించిన టైముకు రాత్రిగాని, పగలుగాని, మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు రిహా ర్సులుకు పాత్ర ధరించుటకు, ఫిల్ము షూటింగుకు హాజరు కాగ లవాడను

8.మీరు నిర్ణయించిన డైరె క్టరు, మ్యూజికల్ డైరెక్టరు, ప్రొడక్షను మేనేజరు గార్ల అను మతిని అనుసరించి నేను నా పాత్రను ఎట్టి విధమైన ఆటంక ములు చెప్పక యాక్టు చేయుట కును.

9.ఫిల్ము షూటింగ్‌లను అను సరించి మీకు నేను అవసరమని తోచిన యెడల ఎట్టి ప్రదేశము నకు గాని మీ స్వంత ఖర్చులపై వచ్చి మీ పని పూర్తిచేయగలవా డను.

10. వ్రాతపూర్వకమైన మీ అనుమతి లేనిదే నేను మీ వద్ద వుండునంత కాలము మరి యొక ఫిల్ములో యాక్టు చేయు టకుగాని, నాటకములు మొద లైన వాటిలో పాల్గొనుట గాని, వగైరాలు చేయు వాడనుగాను. మరియు మీ ఆర్డరు లేనిదే మీరు నాకిచ్చిన వసతి గృహము విడిచి వెళ్లువాడనుగాను.

11. నా పాత్రలు అయిన తర్వాత మీ వద్ద రిలీజు వుత్తరము పొందినగాని నా వూరు గాని మరి యే యితర ప్రదేశమునకు గాని వెళ్లువాడను గాను.

12.మీ రిలీజు వుత్తరము పొందిన తరువాత యే కారణము చొప్పననైనను నా పార్టు చెడిపో యిన నా యడ్రసుకు మీరు తెలి యపరచిన క్షణము మీ ఖర్చుల పైన మీరు రమ్మనిన ప్రదేశము నకు వెంటనే బయలుదేరి వచ్చి నా పార్టు యాక్టు చేయగలవా డను. అందులకుగాను పైన నిర్ణ యించిన మొత్తము నుండి నేను మరల యాక్టు చేసిన నెలలకు గాని, రోజులకుగాని యీ యగ్రి మెంటు 2వ క్లాజునమసరించి ప్రోరేటు ప్రకారము పుచ్చుకోగల వాడను

13.ఏ కారణము వల్లనైనను నా వల్ల గురించి మీ ఫిల్ము షూటింగు ఆగిపోయిన యెడల అట్టి రోజునకు, ఆ రోజునకు నాకు వచ్చు రెమ్యూనరేషన్ నా మొత్తము సొమ్ములో నుండి తగ్గించి పుచ్చుకొనుటయే గాక మీకు వచ్చే యావత్తు నష్టపరి హారమును నా వద్దనుండి మీరు రాబట్టుకొనుటకు మీకు అన్ని హక్కులు కలిగి యున్నవి.

14.పైన వుదహరించిన షర తులు గాని యే ఒక్క షరతునకు గాని నేను యెంత మాత్రము భిన్నముగా నడుచువాడను గాను. అటుల నడచిన మీరు చేయు యావత్తు చర్యలకు బాధ్యుడను.

15.ఈ ఎగ్రిమెంటు పూర్తిగా చదువుకొని, అర్థము చేసుకొని సమ్మతించి క్రింద సాక్షి సంతక ములు చేసిన మధ్యవర్తుల సమీప మున సంతకము చేయుటమైనది.

To

Mr B. V. Ramanandam,
Meraka Street,
Rajhamandry.

Received the amount of Rs 150/- (Rupees Hundred and Fifty only) as advance against my agreement today with you, to act main roles in your telugu picture, which is to be taken at 'Modern Theatres' Salem

S V RANGARAO

Rajhamandry,
21-10-1945.



'వరూధిని'లో రంగారావు, ...



లోకి ప్రవేశించి, ముందుకు సాగిపోవలసిన అగత్యం అగపడుతుంది....జీవితంలో ఎప్పటికైనా ఒక ఉత్తమ నటుడిగా రూపొందాలని నా ఆకాంక్ష! ఆ ఆకాంక్షతోనే నేను సినీమా రంగంలో అడుగుపెట్టాను....సినీమా రంగంలో నా తొలి నాటి అనుభవాలు నిజంగా నా హృదయంలో చిరస్థాయిగా నిలిచిపోయి, అప్పుడప్పుడు అవి నాకు ఏవేవో అనుభూతులను అందజేస్తుంటాయి...."

## అసలు కథ

"అసలు కథకు వస్తున్నా, నాకు బంధువైన రామానందం ద్వారా నేను తొలిసారిగా సినిమారంగంలోకి అడుగుపెట్టాను. నేను నటించిన మొదటి చిత్రం పేరు "వరూధిని". ప్రవరాఖ్యుని వేషంలో సెట్‌మీద పాదం మోపాను. అందరూ నావంకే పరిశీలనగా చూడ్డం గమనించాను. ఆనాడు నాతో ఎవ్వరూ మాట్లాడలేదు. నాక్కూడా ఎవరితోను మాట్లాడాలని కుతూహలం కల్గలేదు. ఏదోనాకు అర్థం కాని అనుభూతిలోనేను ఉండిపోయాను. అంతవరకు సెట్‌మీద వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. "ఎవరో లైట్స్ ఆన్"అని పెద్ద కేక పెట్టారు. నేను ఉలిక్కిపడ్డాను! సెట్ అంతా పట్టపగలులా వెలిగిపోతుంది. దర్శకుడు సెట్లోకి వచ్చి నన్ను సమీపించి, "ఆ స్తంభం దగ్గరకు వెళ్లి నిలబడు" అన్నారు. అంతే!...నాలో ఏదో జంకు బయలుదేరింది. ఆ స్తంభం వున్న దగ్గరకు ఎలా వెళ్లానో నాకు తెలియదు. జంకు క్రమంగా ఒక విధమైన భయంగా మారింది. ఇంకేముంది? గొంతు తడి ఆరడం ఆరంభించింది... నాతో నటించవలసిన అమ్మాయి (దాసరి తిలకం)ని వెళ్లి నా ప్రక్కన నిల్చోమని దర్శకుడు ఆదేశిస్తున్నారు.

ఒక గంధర్వ కన్య ఎక్కడ నుంచో వచ్చి నా చేరువన నిల్చుంది! అప్పటికినేను అస్ఖలిత బ్రహ్మచారినేమో ఆ గంధర్వాంగనకు కొంచెం దూరంగా తొలగి నిలబడ్డాను. దాంతో దర్శకుడు నన్ను ఉద్దేశించి, "అలా పరిగెడతావేమిటయ్యా! ఆవిడకు దగ్గరగా అతి చేరువుగా వెళ్లాలి" అన్నారు. ఈలోగా ఒకవ్యక్తి వచ్చి "ఏదీ చెప్పండి" అన్నాడు. అవి నాకు తెలుసులెండి అన్నాను. ఆయనకు కోపం వచ్చింది. "అయితే ఎందుకలా బెల్లంకొట్టిన రాయిలా నిలబడతారు. డైలాగ్ చెప్పండి" అన్నాడావ్యక్తి. తరవాత తెలిసింది అతను అసిస్టెంట్ డైరెక్టరని...

వాతావరణాన్ని క్షణాకాలంలో ఎల్లాగో అర్థం చేసుకొని అసిస్టెంట్ డైరెక్టర్ చెప్పినట్లు డైలాగ్స్ వల్లించడం ప్రారంభించాను. కానీ, నా ప్రక్కన పడతి ఉండడం చేత సిగ్గుపడి బుర్ర వంచుకొని డైలాగ్స్ చెప్పాను. చెప్పడం రాక కాని, తెలియక కాని అలా చెప్పలేదు. నాటక రంగం మీద నేను వాలంపెంచి పవమానసుతుడులాగా పరాక్రమం చూపెట్టిన వాణ్ణే!... కానీ నా ప్రక్కన అందరూ మగవాళ్లే ఆడవేషాలు వేసేవాళ్లు. ఇప్పటి సంగతి మరి అలాకాదుగా! అసలైన ఆడదానితో నేను ముఖాముఖి యిప్పుడు మాట్లాడవల్సి వచ్చింది. వచ్చిన యిబ్బంది అది. అంతవరకు దర్శకుడు ఓపిక పట్టాడు. ఇక ఆయన ఆగలేక పోయారు. ఎక్కడ లేని కోపం వచ్చిందాయనకు..."ఆవిడ ముఖం వేపు చూసి మాట్లాడవోయి! ఎక్కడో పాతాళ లోకం చూసి మాట్లాడతావేమి" అన్నారు. ఎలాగైతేనేం, ధైర్యం చేసి ఏదో నటించాననిపించాను.ఆ రోజు షూటింగయిపోయింది. ఆ యమయాతన తట్టుకోలేక ఆ రాత్రే బండెక్కి మా ఊరువెళ్లిపోవడానికి నిశ్చయం చేసుకున్నాను. దర్శకుడికి విషయం తెలిసి నా దగ్గరకు వచ్చి ఓదార్చి, ధైర్యం చెప్పి వెళ్లిపోయారాయన.

మొత్తం మీద నాపాత్రను శక్తివంచన లేకుండా నటించాను" రంగారావు తొలి అనుభవం తెలుసుకున్నారుగా! "వరూధిని" చిత్రం 46 సం.లో విడుదలయి వ్యాపారపరంగా పిడుగుపాటుకు గురయింది. ఎక్కడా మూడు వారాలు ప్రదర్శింపబడలేదు. అందువల్ల అందులో నటీనటులకు, దర్శకునకు ఆ చిత్రం శాపంగా పరిణమించింది....

రంగారావు ఆశాసౌధాలు నేలకొరిగాయి. ఆతర్వాత ఏ చిత్రంలోను నటించే అవకాశం రాలేదు. ఎవర్నడగడానికి ఆత్మాభిమానం అడ్డుపడేది. చేసేదిలేక జమ్‌షెడ్‌పూర్‌లో 'తాతా కంపెనీ'లో ఉద్యోగానికి కుదిరిపోయారు.

ఆ సమయంలో తన పాత మిత్రుడయిన బి.ఎ. సుబ్బారావు నుంచి ఒక లేఖ వచ్చింది. తాను తీస్తున్న 'పల్లెటూరిపిల్ల'లో 'విలన్' పాత్ర ఇవ్వనిశ్చయించినట్లు. అవకాశం వచ్చిందని ఆనందపడ్డాను. అప్పుడే తనకు జన్మనిచ్చిన తండ్రి దివంగతుడు కావడంతో కర్మకాండలన్నీ జరిగాక మద్రాసు వెళ్లాడు. రంగారావు ఆలస్యంవల్ల 'పల్లెటూరి పిల్ల'లో విలన్‌పాత్రను ఎ.వి. సుబ్బారావును నియమించుకోవడం జరిగిపోయింది. ఏదో చిన్న వేషం 'ధర్మన్న తాత'గా ఆ చిత్రంలో నటించాడు రంగారావు. అలాగే తిరుగుబాటు, మనదేశం చిత్రాల్లో చిన్న వేషాలేశాడు.

అదే కాలంలో 'విజయాసంస్థ' ఆవిర్భవించి నాల్గు చిత్రాలను వరుసగా తీయడానికి సన్నాహాలు చేస్తూ, నటీనటులను సాంకేతిక నిపుణులను నెలజీతాల మీద బుక్ చేసుకున్నారు. అందులో రంగారావు ఒకడు. నెలకు రు. 550-00 లు, జీతంపై "విజయా ఆర్టిస్టు"గా మారాడు. రంగా

## ...తొలి అగ్రిమెంట్.

రావు జీవితం మలుపు తిరిగింది. విజయా వారి షావుకారు, పాతాళభైరవి, పెళ్లిచేసి చూడు, చంద్రహారం, చిత్రాల ద్వారా ఒక పాత్రకి, మరో పాత్ర సంబంధం లేని వైవిధ్యం గల పాత్రలు పోషించి రంగారావు మంచి నటుడుగా అందరిచేత శ్లాఘించబడ్డాడు. ఆ తర్వాత ఆయన ఎన్నో మనఃప్రవృత్తుల పాత్రలు ధరించి, వాటికి జీవం పోసి అఖండ యశస్సు నార్జించాడు. అందరికీ తెల్సిందే!

రంగారావు నటుడిగా సాధించిన విజయాలవల్ల, ఆయనలో వున్న ఇతర ప్రక్రియలు, శక్తిసామర్ధ్యాలు వెనుకబడ్డాయి.

చిత్రదర్శకుడుగా, సాహిత్య, సంగీతాల్లో తన ప్రతిభను వెల్లడించుకున్నాడు. 'యువ' మొదలగు పత్రికల్లో కథలు రాశాడు. ఎన్నో కవితలు రాశాడు. విద్యార్థి దశలో శ్రావ్యంగా పాడి అందరిచేత మెప్పులు బడశాడు. ప్రత్యేకించి నండూరి సుబ్బారావుగారి ఎంకిపాటలు విశాఖ సాగర తీరంలో స్నేహితుల నడుమ మధురంగా పాడేవాడు. ఇంకా క్రికెట్, వేట, వక్తృత్వ పోటీల్లో తన ప్రతిభ వెల్లడించుకున్నాడు. అయినా ఆయనలోని నటుడు, మిగతా అన్నింటిని డామినేట్ చేశాడు. అందుకే ఆయన నటుడిగా ఉన్నత శిఖరాగ్రం చేరుకున్నాడు.

అన్నింటికి మించి మహోన్నత వ్యక్తిత్వమతనిది. తనకు చిన్నప్పటి నుంచి పరిచయమున్నవారిని సైతం వాళ్లింటికి వెళ్లి ఆప్యాయతతో పలకరించడం, వాళ్ల ఇంట్లో విందు స్వీకరించడం చెప్పుకోదగింది. మచ్చుకి రెండు సంఘటనలుదహరించి ఈ వ్యాసం ముగిస్తాను.

ఎప్పుడైనా విశాఖపట్నం వస్తే సుంకరి పార్థసారధి గారింటికి వచ్చి తన అనుభవాలను వెల్లడించి, అక్కడే భోంచేసేవాడు.

'సతీ సావిత్రి' షూటింగ్ జరుగుతున్నప్పుడు విశాఖపట్నానికి చెందిన కర్రి నర్సింగరావును సెట్‌లో చూసి రంగారావు పాదాభివందనం చేయగా, "ఎవరు నాయనా మీరు?" అని ప్రశ్నిస్తే "మీ అబ్బాయి ప్రసాద్ స్నేహితుడనండి రోజూ మీ ఇంటికి వచ్చి మీ అబ్బాయి, నేను కలసి కాలేజీకి వెళ్లేవాళ్లమండి, నా పేరు రంగారావు" అన్నాడు వినయంగా. విశాఖపట్నంలో ఒక సినీథియేటర్ ప్రారంభోత్సవానికి వచ్చి, ఆపని అయిపోయాక విశాఖ, విజయనగరంలో మిత్రులతో ఆనందంగా విందారగించి, గతం తల్చుకున్నాడు.

### గ్రంథాలయం

ఆయన గ్రంధాలయంలో తెలుగు, ఆంగ్ల గ్రంధాలు ఎన్నో నిండి వుండేవి. ఆధ్యాత్మిక గ్రంధాలంటే బహుప్రీతి. ఆయనకు వివేకానందస్వామి యందు భక్తి గౌరవాలు మెండు.

ఎంత కీర్తి, ధనం ఆర్జించినా అహంకారంలేని వినయశీలి. తేది. 3-7-1918 న జన్మించిన రంగారావు ఎదిగి, 56 సంవత్సరాలు జీవించి యావద్భారత దేశం గర్వించదగ్గ మహానటుడిగా యశస్సు నార్జించి తే 18-7-1974న తన పాంచభౌతిక దేహం వీడి అనంతవాయువుల్లో లీనమయ్యాడు.

మళ్లీ రంగారావు లాంటి నటుడు తెలుగు తెరకు రావడం కల్ల!....

(చిత్రాలు-పత్రాలు అందచేసిన రామానందంగారి కుమారులు బి.వి. రామచంద్రరావు గారికి కృతజ్ఞతలు)

-ఆరిపాక సూరిబాబు




"ఏంటండీ రాస్తున్నారు?" స్థూలకాయాన్ని మోసుకుంటూ వచ్చి అడిగింది భాగ్యలక్ష్మి భర్త కనకారావుని.

"అడిగావ్! ఇంక అఘోరించినట్టే" మొఖం చిట్లించి అడిగిన దానికి కసురుకున్నాడు కనకారావు.

అయినా నా కెందుకు లెండి! ఏం రాసుకుంటే–! పెళ్లానికి చెప్పకూడనివి ఉంటాయి.... చెప్పేవి ఉంటాయి. మగ మహారాజులు బయట ఏ రాచకార్యాలు వెలగ బెడుతున్నారో.... ఏం చేస్తున్నారో మా కెందుకు? మూతి తిప్పుకుంటూ దెప్పి పొడిచింది.

"నీ దుంపతెగ! ఇదేవన్న లవ్వు లెటర్ అనుకుంటున్నావా! కనపడ్డంలా?ప్రింటయినఆకుపచ్చ అక్షరాలున్న ఫారము"... చిర్రెత్తు కొచ్చింది కనకారావుకి.

"ఏమోనమ్మ! నల్లని వన్నీ నీళ్ళు... తెల్లని వన్నీ పాలు అనుకునే కాలం కాదిది. లవ్వు లెటర్లు కూడా ప్రింట్ చేసి అమ్ముతున్నారని నాకేం తెల్సు."

"ఒసే! ఒసే! నిన్నుకాదే! మీ అయ్యని.... నాకీ గుదిబండని అంటగట్టి నందుకు తిట్టుకోవాలి."

"అయ్యో! అయ్యో! ఆయనిప్పుడేం చేశాడని అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది. సరిపడకపోతే శ్రీరామ అన్నా బూతు మాటే! నేనిప్పుడేమన్నానని..."

దీర్ఘాలుతీస్తున్న భాగ్యలక్ష్మిని ఓదార్చడానికి చాలా సేపు పట్టింది కనకారావుకి. చివరికి చెప్పాడు.

"దీన్ని టెలిఫోన్ దరఖాస్తు ఫారం అంటారు– ఫోన్ కనెక్షన్‌కు అప్లై చేస్తున్నాను."

"ఎట్టా! మీకేమైనా మతి పోయిందా!క్రితం సంవత్సరం వస్తే వద్దని అమ్మేశారుగా" విస్తుబోయింది.

"నా కుండీ నీకు పోయింది– అసలు ఉంటేగా– మన కెందుకీ ఫోన్? మన కెవడిస్తాడు?" విసుక్కున్నాడు.

"అయ్యోరామ! మళ్లీ అదే మాట– మరి మనకు ఎందుకు ఫోన్?"

"ఓసి మొద్దా– మనకి కాదే– యిది– కనెక్షన్ రావడానికి ఒక సంవత్సరం పడుతుంది... అప్పుడు....

"ఎంచక్కా బెడ్ రూములో పెట్టుకుని– అద్దమైన వాళ్ళతో కులకచ్చు" పూర్తి చేసింది భాగ్యలక్ష్మి భర్త ప్రవర్తన మీద నమ్మకం లేక.

"చెప్పు తీసుక్కొడతా! మళ్లీ అదే మాట!"

"నా తలరాత– అలా తగలడింది."

"రాతకేం చాలా బాగుంది. ఇది సక్సెస్ అయితే నీకు ఒక నెక్లస్ చేయిస్తాను."

"ఆఁ! ఎంత మంచివారండి– ఎలా?"

"ఈ ఫోన్ కనెక్షన్ రాగానే– ఎంచగ్గా– కావాల్సిన వాళ్లకు బ్లాకులో అమ్మెద్దాం– ఓ పదివేలకు.

"ఆఁ! పదివేలే!"

"ఆఁ! మరి రాబోయే డిమాండ్ అలా ఉంది."

"ప్చ్! మీకు బుర్ర లేదండీ!"

నిట్టూర్చింది.

"ఏం? నీకేమైనా అనుమానంగా ఉందా?"

"లేకపోతే ఏంటండి? క్రితంసారి ఐదు వేలకు కాంతారావుకు మన ఫోన్ అమ్మేసి ఊరుకున్నారు. అది కూడా ఉంటే ఇరవై వేలు వచ్చేవిగా."

"నీ ఆశమాడ! అప్పుడు అలాగే నడచింది మార్కెట్! అయినా ఆ అయిదు వేలకి నీ కోసమని గాజుల జత చేయించానుగా! బంగారం ధర అంగారంలా మండిపోతూనే ఉంది" ఓదార్చాడు.

"పోస్ట్! కనకారావు గారున్నారా?" వీధిలో పోస్ట్‌మెన్ గావుకేక పెట్టాడు."

"అయ్యా! నిక్షేపంగా ఉన్నాను" ఏం ఉండడం నీ కిష్టం లేదా?" కనకారావు ధుమ ధుమ లాడుతూ బయటకు వచ్చాడు.

"అయ్య బాబోయ్! అంత మాటనకండి... నే వద్దంటే పోతారా? మీ యిల్లు- మీ భార్య మీ ఇష్టం" కంగారు బడిపోతూ చెప్పాడు.

"చాల్లాల్లే! ముందు ఆ కవరియ్యి వయ్యా!" రీ డైరక్టయి వచ్చిన రిజిష్టర్ కవరు తీసుకొని కాగితంలో సంతకం పెట్టాడు.

"ఏమండీ! అబ్బాయి నించి మీ-డీఏమైనా వచ్చిందా?" సంబరపడిపోతూ అడిగింది.

కవరు చింపి చదివి శిలాప్రతిమలా ఎలబడి పోయాడు కనకారావు.

"ఏమిటండీ అలా అయి పోయారు? దగ్గర్లో ఉన్న నీళ్ల చెంబులోని నీళ్లు తీసుకుని ముఖాన నీళ్లు కొట్టింది.

కాసేపటకి తేరుకొని- నీర్సంగా కుర్చీలో కూర్చొని కళ్లు మూసుకున్నాడు- రిజిష్టర్ లెటర్ జేబులో పెట్టుకొని.

"ఈ కాంతారావంత పుండాకోరు వెధవ వాడు వట్టి వెధవ!"

"మధ్యలో అతనేం చేశాడండి?"

"టెలిఫోన్ బిల్లులు కట్టలేదుట"- ఒకటా రెండా- ఏకంగా పాతిక వేలు ఎగవేశాడు" కోపంగా అన్నాడు.

"వేస్తే వేశాడు లెండి! దేశంలో ఎంత మంది పన్నులు కట్టకుండా ఎగ్గొట్టు తున్నారో! వాళ్లల్లో ఈయన ఒకడు!" చాలా తేలిగ్గా అంది.

"నీ బొంద! వాడు ఎగ్గొడితే మనం కట్టాల్సి వస్తుందే పాపిష్టిదానా!"

ఆ! అవాక్కు రాలై పోయింది.

"ఆ ఫోన్ మన పేరుమీద ఉంది యింకా. కేవలం అడ్రస్‌మార్చి కాంతా రావు తీసుకున్నాడు- బిల్లు సక్రమంగా చెల్లిస్తాడు మనకి పూచీ లేదనుకున్నా కాని యిలాంటి వెధవ పని చేస్తాడనుకో లేదు."

"ఏం రాసుండండి అందులో?"

"బకాయి పడిన పాతిక వేలు నెల లోపున కట్టకపోతే చట్టరీత్యా మాచే తీసుకోబడు చర్యలకు మీరు అర్హులవు తారని- రాసుంది. సర్లే! నేపోయి ముందు కాంతారావుని కల్సి వస్తాను- తలుపేసుకో"

కాంతారావు ఇల్లు తాళం వేసుంది. చుట్టు ప్రక్కల వాళ్ళని వాకబు చేశాడు బిజినెస్ నష్టం వచ్చిందని ఓ అర్ధరాత్రి ఊరు విడిచి వెళ్లి పోయాడుట, పెళ్లాం బిడ్డలని వదిలేసి. వాళ్లు వీళ్లు చేరి వాళ్లను పుట్టింటికి పంపించేశారుట.

కనకరావుకి కాళ్లు చేతులు ఆడలేదు. కాసేపటికి తన లాయరు ఫ్రండ్ షణ్ముగం గుర్తు కొచ్చాడు. రిక్షా చేసుకుని అతనింటికి బయలు దేరాడు. మిణుకు మిణుకు మంటున్న ఆశతో.

"ఏమోయ్ కనకారావు దారి తప్పి వచ్చినట్లున్నావు" షణ్ముగం ఆకు వక్క నములుతూ ఆహ్వానించాడు.

కోర్టు లేదా!

"బంద్! న్యాయానికి బంద్ యివ్వాళ" నవ్వాడు.

"నువ్వే కాపాడాలి" బిక్క మొహం



**మిథున్ నేపథ్యగానం**

హిందీ చిత్రరంగంలో స్థిరపడిపోయిన నేపథ్యగాయకులస్థానే యిటీవల నటీన టులే పాటలు పాడటం ప్రారంభిం చారు. అదేకోవలోకి చేరుతున్నాడట మిథున్ చక్రవర్తి. "రోటీకీ కీమత్" అనే చిత్రంలో మిథున్ ఒక పాట పాడా డట. మరి ఈ పాట నిర్మాతలకు నచ్చిందో ఏమో మరోపాట పాడించు కోవాలని ఉవ్విళ్లూరు తున్నారట.

# తారలు - సెంటిమెంట్లు

ప్రసిద్ధ తెలుగు- తమిళ కథానాయకి జయచిత్ర ఓ తమిళచిత్రం నిర్మిస్తోంది. ఆమె సొంత చిత్ర నిర్మాణ కార్యాలయం- మద్రాసులోని మహాలింగ పురంలో వుంది. ప్రొడక్షన్ ఆఫీసు ముందుభాగంలో "సిద్ధి వినాయకుని" చిన్న గుడివుంది. ఎన్నిసార్లు బయటకు వెళ్లినా- బయట్నుంచి లోపలికి వచ్చినా- "వినాయకునికి" సాష్టాంగప్రణామం చేసిగాని మిగతా కార్యక్రమాలకు ఉపక్రమించదామె! అది- ఆమె సెంటిమెంటట!

** ** ** **

డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావుకి పూజా- పునస్కారాలంటే- యిష్టం



వుండదు. కాని అతను నటించే చిత్రాలకు "ప్రారంభోత్సవ పూజ"నాడు- నిర్మాత- దర్శకులు పట్టుబడితే మాత్రం కొబ్బరికాయ కొడ్తారు... బూట్లు సాక్సూ విప్పకుండానే!

## జైలుకెళ్తే...

ప్రసిద్ధ తమిళ- మళయాల, కన్నడ, తెలుగు కథానాయకి గీత "బాలచంద్రుడు" చిత్రంలో ప్రధాన పాత్ర ధరిస్తోంది. ఆ చిత్ర కథారచయిత, ఆమెకు షూటింగ్‌కు ముందు కథ చెప్పబోతే- కాల్షీట్స్ కొరత కారణంగా మొదట- కథను వినడానికి అంతగా సుముఖత చూపించలేదు. "కథ విన్న తర్వాత నిర్ణయం చెప్పేదురుగాని... ముందు కథ వినండి!" అంటూ కథకుడు దాదాపు గంటన్నరసేపు- ఏకబిగిన కథ చెప్పాడు. అంతే- ఆమె ఎగిరిగంతేసి వెంటనే- కాల్షీట్స్ బంచ్‌గా యిచ్చి- "ఈ చిత్రంలో నేను నటిస్తానండి. పైగా యీ చిత్రం జూబ్లీ చిత్రం అవుతుంది!" అందామె ఎంతో హుషారుగా రచయితతో! కారణం అడిగితే- ఆమె చెప్పిన సమాధానం. "చూడండి! నేను నటించిన మళయాలం, కన్నడ, తమిళచిత్రాల్లో ఎక్కువభాగం చిత్రాలు నూర్రోజుల పండగ జరుపుకున్నాయి. ఇదీ అలాగే... సూపర్‌సక్సెస్ అవుతుంది...! ఏలాగంటారా...! పై సక్సెస్ చిత్రాలన్నింటిలోనూ- నేను జైలుకెళ్లే సన్నివేశాలున్నాయి. అలాగే- ఇందులో- 'బాలచంద్రుని' అక్కగా జైలుకి వెళ్లే సన్నివేశం హృదయ విదారకంగా వుంది. అందుకే... ఇది తప్పకుండా ఘన విజయం సాధిస్తుందంటున్నాను..." అన్నారావిడ! అంటే- గీతకు- జైలుకెళ్లడం- సెంటిమెంటన్న మాట!

## మౌనం

ప్రఖ్యాత కథకుడు, సినీ మాటల రచయిత "మహారథి"- వారానికి ఒక్కరోజు- ప్రతి మంగళవారం- మౌనవ్రతం పాటిస్తారు. విధిగా మాటాడవలసివస్తే మాత్రం అతని కలం కాగితానికి పని కల్పిస్తుందిట!

- సాధన

# బాబోయ్! టెలిఫోన్!

పెట్టుకుని చెప్పాడు.

"ఎప్పుడూ పులిలా ఉండేవాడిని... ఇప్పుడిలా పిల్లిలా... ఆశ్చర్యపోయాడు.

"ఈ నోటీస్ చూడు, కాంతారావు చేసిన యస్.టి.డీ.లు నా కొంప ముంచాయి.

చదివిన షణ్ముగం మొహంలో విపరీతంగా ఆశ్చర్యం కనిపించింది. ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆ ఫోన్ కాంతారావు అనే వాడికి అమ్మేశాను."

"మరి బిల్లు, నోటీస్ నీపేరుమీద ఉందేమిటి?

'అమ్మడమంటే బ్లాకులో అయిదు వేలు తీసుకుని యిచ్చేశాను" "అదీ డిపార్ట్‌మెంట్‌కు సరెండర్ చెయ్యకుండా.

"ఐ. సీ! అంటే షిఫ్టింగ్ ఛార్జీలు పేచేసి, అడ్రస్ మార్చి"

"ఆఁ అదేదో ఆ కాంతారావే చూసుకున్నాడు. నాకు సంబంధం లేదనుకున్నా. కానీ ఈ రోజిలా దాదాపు ఏడ్చేశాడు.

"మరి కాంతారావుచేత కట్టించక పోయావా"

"కట్టిద్దామనేపోయాను. కానీ అతను లేడు"

"ఎక్కడికి పోయాడు"

"జి. ఓ. కె"

"అంటే?"

"గాడో న్నో నోస్" దేవుడికే తెలియాలి."

అయితే నీకు తప్పదు- కాసేపటికి అన్నాడు షణ్ముగం పుస్తకాలు తిరగవేసి.

"బాబ్బాబు! నీ ఫీజు నువ్వు అడిగినంత ఇచ్చుకుంటాను. ముందు దీన్ని తప్పించు.

"ట్రై చేద్దాం! ఇటు వంటి కేసుల్లో కాలం వెళ్లబుచ్చడం తప్ప పూర్తిగా నివారించలేం"- లెటజ్ సీ! విచారంగా చెప్పాడు లాయర్.

నల్లబడిన మొహంతో రిక్షాదిగి రాగానే కనకారావు - టెలిఫోన్ కనెక్షన్ అప్లికేషన్ పరపరా చింపేస్తుంటే భాగ్యలక్ష్మి బిత్తరపోయి చూస్తూ నిల్చుంది




## కొండ నవీన్, గూడూరు

★ మానవజాతి ప్రాథమిక హక్కు- అన్వేషణ. స్త్రీ పురుషులు దీన్లో సమాన మైనప్పుడే మానత్వం గోచరించుతాది....

● ఔనా?!

★ కర్తీ వినియోగాన్ని నివారించగల శక్తి స్త్రీ కి....

● అలాగా- ఏం మీరేం భోంచేయరా?!

★ ప్రపంచ రాజకీయ మేధావులకు తెలుసు కోశాల పార్టీ చిహ్నాలు మానవ సాంకేతికాలుగా వుండాలని....

● ఈ కాలంలో మానవ సాంకేతం కానిదేదైనా వుందంటారా?!

★ నా తమ్ముడనేవాడు నేటి రాజకీయ నాయకులు- వీధిన పడ్డ పిచ్చి కుక్కలని- విశ్వసించ లేమని....




● పాపం వాటి నెందుకనుకోవడం- వాటికి తెలియదే పిచ్చి పట్టిందని!

★ ఈ దేశం ప్రజలు త్వరితగతిని అభివృద్ధి చెందాలంటే స్వయం ప్రతిపత్తిని ప్రాథమిక హక్కుగా పొందాలి.

● ఏం అప్పటికి గాని మన పొగరు అణగదనా? చూడండి. దేశ నాయకులకే లేని జాతీయతా భావం, సమైక్యతా భావం- దేశ ప్రజలకి అలవడడం ఎలా? అలా ఏ కొద్ది మందికో వున్నా వాళ్లేం చెయ్యగలరు?... పదవి- ప్రథమ సోపానంగా తయారై వారిచేత స్వర్గానికి నిచ్చెనలు వేయిస్తోంది. 'మా'వాడన్న వాడు పైపైకి పోతూంటే కానివాడు పాతాళానికి పోవడం- సహజమే- స్వయం ప్రతిపత్తికీ- మనిషి తత్వానికీ- పొంతన లేని చోటిది.

## పి.టి. రాజగోపాల్, సికింద్రాబాదు

★ ఈ మధ్య ఆంధ్రపత్రికలో ఎం. ఎల్. కుమారి గారికి మీ రిచ్చిన సలహా- చాలా సముచితంగా వుంది. జీవితంలో ఒంటరి తనానికి విరుగుడు- ఏదో కార్యకలాపాలలో తల దూర్చడమే నన్నది, కొడుకుని పెంచుకోవడం అన్నది నిరుపయోగం అన్నది- సత్యం. మీరామె చిరునామా నాకు పంపించండి.

● సారీ. వ్యక్తుల చిరునామాలు వారి అనుమతి లేకుండా నేనివ్వలేను. మీ సూచనలు, సలహాలు కేరాఫ్ ఆంధ్రపత్రికకు- రాయండి. చూద్దాం.

## ఎమ్.ఆర్. ఆర్. హైదరాబాదు

★ బాధిత భర్తల సంఘానికి మీ వారిని ప్రెసిడెంటు చేయాలని. ఎలా వుంది సూచన? కె. రా. గారూ

● చాలా చక్కగా వుంది రావుగారూ. కానివ్వండి- ముందు సభ్యత్వం దండడం ప్రారంభించండి- ఎంత మంది ముందుకు వస్తారో తెలుస్తుంది! మా పెద మామయ్య ఎప్పుడూ అంటూండే వాడు "భార్యదే ఆఖరు మాట. దానితరవాత అతగాడు నోరెత్తితే- అది కొత్త దెబ్బలాట!... పెళ్లాంతో వాదించడం అన్నంత వృధా శ్రమ లేదు. గెలిచావో చచ్చావన్న మాట?! బాగుంది కదూ? ఈయనే వుంటే మీరు పెట్టబోయే సంఘానికో పెద్ద మనిషి హాజరుగా వుండేవాడే!! ఇక మా ఆయనంటారా? లాభం లేదు. పెళ్ళంటే?చూసి, నచ్చి- జీవితంలోకి తెచ్చుకున్నాక- ఏం చేస్తాం? యు పే ఫర్ ఇట్ అనేయ కలరు.

## వి. శ్రీధరాచార్య జ్యోషి, అయిజ

★ కె. రా.గారూ జీవితాన్ని ప్రాక్టికల్‌గా తీసుకోవడం మంచిదా లేక ఎమోషనల్‌గా ఆలోచించడం మంచిదా? ఆన్సర్ క్విక్!

● ప్రాక్టికల్‌గా తీసుకోవాలని మీ మగవారికి వేరే చెప్పాలా స్వామీ? ఎమోషనల్‌గా తీసుకుని ఆడది ఊబిలో కూరుకు పోతూండడం చూడడం లేదా?!

★ అక్కయ్యగారండీ... మరేమోనండీ... తెలుగు మూవీ చూస్తూంటే నిద్ర ముంచు కొచ్చేస్తోందండీ. ఎందుకూ?

● బుడుగు అడిగినట్టు- 'మీకు బాగా మాట్లాడ్డం రాదా?! నిద్ర ముంచుకొచ్చే మూవీ చూడమని ఎవరు బ్రతిమాలుతున్నారు మిమ్మల్ని?!

## డాక్టర్ సిద్ధం కొండయ్య, సికింద్రాబాదు

★ వివాహరహిత మాతృస్వామ్య వ్యవస్థ రావాలి. రక్త సంబంధీకులైన తొలి వావివరుసల పట్టింపులు క్రమేనా సడలించుకుంటూ....

● ఈ ఉత్తరం చదివాక- మీరేం డాక్టరు? అని ఓ ప్రశ్న తలెత్తింది నాలో. డాక్టర్ల కీ మధ్య సెక్సు బాధలు తప్పించి వేరు బాధ లెందుకు కనబడడం లేదా అని అనుమానం వచ్చింది... "వెర్రి కుదిరింది. రోకలి తలకి చుట్ట"మన్న కేసు జ్ఞాపకం వచ్చింది. మీ మీ కుళ్లు వూహలు మీ మీ బుర్రల్లో వుంచుకుని వుండండి. మామూలు మనుషుల నెందుకు సంకట పెడతారు?... మీ ప్రచారానికి పత్రికలు వేరే వున్నాయి. ఫిక్షన్ రూపంలో రాస్తే ఏదైనా నెత్తి కెత్తు కుంటాయి. కానివ్వండి.

## జి. కల్పలత, ఎమ్మిగనూరు

★ స్నేహానికి మీరిచ్చే నిర్వచనం?

● విభేదిస్తూ- ఏకత్వం సాధించడం. స్నేహితులంటే వాళ్ళు వీళ్లయిపో నక్కర లేదు!

★ సంఘంలో మనిషి గుర్తింపు పొందాలంటే ఏం చేయాలి?

● సంచలనాత్మక సెక్సు నవల రాసినా వస్తుంది.... తాగి తన్నుకున్నా వస్తుంది... మీ కెలాంటి గుర్తింపు కావాలో తేల్చుకోవాలి ముందు!

★ కలం స్నేహాలపై మీ అభిప్రాయం?

● అది ఎదిగిన మనుషులకి. వంక కావాలని రాసేవారికి కాదు. మనలో చాలా మందికి వయస్సు వస్తుందే గాని- మెచూరిటీ రాదు. అందుకే యిక్కడ కలం స్నేహాలు ఒకొక్కప్పుడు ప్రాణాంతకాలుగా పరిణ మించడం చూస్తూ వుంటాం. కలం స్నేహానికి- సహృదయత, నిజమైన గౌరవం (ఎదుటి వ్యక్తి మీద) ఉండాలి. తొలి ఉత్తరం ఆదర్శాలతో గుప్పించి మలి ఉత్తరానికి- ప్రేమదాకా ఎగబాకే వాళ్ళూ, ఆడపేర్లు పెట్టుకుని ఆడపిల్లలకి ఉత్తరాలు రాసి- స్నేహితుల మధ్య కాలరెత్తుకుని ఉత్తరాలు చదివి వినిపించేవారూ... చాలా రకాల వారిని చూశాను.... అందుకే దానిపైనా కంత గౌరవం లేదు.... ○

కొత్త సీరియల్ ప్రారంభం!

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

అతను జయాటాకీస్ బాల్కనీ సీటులో కూర్చున్న మరునిముషంలోనే చెప్పకుండా వూడిపడే చుట్టంలా వర్షం మొదలైంది.

యువ హృదయంలో విజృంభిస్తూ మొదలయ్యే కోర్కెలా రావడం రావడం ఉధృతంగా ప్రారంభ మైంది వర్షం.

భూమికి ఆకాశానికి మధ్య జల స్తంభాలలా వానధారలు - మింటికీ మంటికీ మధ్య ఏర్పడ్డ వీణ ధారలా కన్పడ్డాయి.

అతనికి వేసవిలో వర్షం, చలి కాలంలో ఎండా,ఉదయాన మంచూ, సాయంత్రం ధూళీ, శరత్చంద్రుడు, వసంతఋతువు అయాచితానందాన్ని స్తాయి.

అందుకే అకాశమనే హోస్‌పైప్ నుండి నీళ్ళు చిమ్ముతున్నట్లు సినిమా హాలు రేకులమీద పడుతున్న జలధారల సవ్వడి వింటూ అప్రయత్నంగా కనులు మూసుకుని హృదయంలో మెదలాడే సున్నిత రసానంద ప్రకంపనలతో తన్మయత్వం చెందబోతున్న సమయంలో ఎందుకో కనురెప్పలు కొద్దిగా విడివడ్డాయి.

బహుశా గేటు తెరచిన చప్పుడు విన పడి కళ్ళు తెరిపిడి పడ్డాయేమో -

అంత పెద్దవాన శబ్దంలో కూడా గేటు తెరచిన సవ్వడి ఎలా వినపడిందా అని క్షణం ఆశ్చర్యం కలిగింది.

కాని కనులు మూసుకున్నప్పుడు శబ్ద గ్రహణ శక్తి ప్రబలమవుతుందన్న విషయం గుర్తొచ్చి "గుడ్డివాళ్లకు పాము చెవులుంటా యంటారు" అనుకున్నాడు.

మెరవు మెరసినకాంతికి కనులు మూసుకోబోయికూడా అప్రయత్నంగా అని మిషుడయ్యాడు!

బాల్కనీలోకి వంటరిగా వస్తున్న ఆ అమ్మాయి అందం అతన్ని అచేతనుడిని చేసింది.

ఆరడుగుల పొడుగున్న అతనికి పొడు గుపాటి అమ్మాయిలంటే యిష్టం. పొడు గుపాటి అమ్మాయిలలోను తలవంచుకు వినయంగా నడిచే అమ్మాయిలంటే మరీ యిష్టం!

మగరాయుళ్లలా హైహీల్స్ వేసుకుని కవాతు ప్రదర్శనలా నడిచే అమ్మాయిలంటే ఎలర్జీ!

ఆడపిల్లకు సిగ్గే సింగారమనీ యవ్వ నమే అందమనీ నమ్ముతాడతను!

వంచిన తల కొంచెం పైకెత్తి అరవి చ్చిన కమలాలలాటి నయనాలతో బాల్కనీ సీట్లను పరికించి అతను కూర్చున్న సీట్ల వరుసలో ఆఖరు సీటులో కూర్చుంది.

సీటులో కూర్చోబోయే ముందు ఆమె కనీనికల నుండి జాలువారిన వాలుచూ
కాంతి రేఖల్లా అతన్నభిషేకించాయి

అసంఖ్యాకంగా వంటిమీద వ
మన్మధ బాణాలలా ఆమె చూపుకొ

అతని శరీరంలోని ప్రతి అణువు
స్పృశించి పులకింతలకు లోనుచేశాయి

మొదటి బెల్ కొట్టారు. లై
చాలా భాగం ఆరిపోయాయి. క
ముందున్న లైట్‌మాత్రం వెలుగుతో
అంత వానలోనూ, పైన ఫ్యాన్ ర
మని తిరుగుతున్నా అతనికి చిరుచెమ
కమ్మసాగింది.

"బాల్కనీలోకి మరెవ్వరూ రాకుం
బాగుండు" అని అతను మనస
అనుకుంటున్న సమయంలోనే హిప్పీక్ర
వైట్‌ప్యాంట్, గుండీలు పెట్టుకోని
చారల చొక్కా, పులిగోరు లాకెట్‌వ
బంగారుచైన్, కారాకిల్లీతో గారపట్టిన
వరస మధ్య గోల్డ్ ఫ్లేక్ సిగరెట్‌తో ప
కేళ్ళ యువకుడు పాయింటెడ్ షూ
టకటక లాడిస్తూ వచ్చి బాల్కనీ సీ
తేరి పారజూచి అమ్మాయిని తదేకం
చూస్తూ 'హాయ్‌హాయ్' మని యీల
వెళ్లి పక్కసీట్లో కూర్చున్నాడు.

పవిట భుజాలచుట్టూ కప్పుకుని సీ
యువతలకు వంగి కూర్చుందా అమ్మాయి

రెండోబెల్ మ్రోగి లైట్లన్నీ ఆరి
యాయి. స్క్రీన్‌మీద ప్రకటనలు మొ
లయ్యాయి.

రివాల్వర్ నుండి వదలిన గుండు
దూసుకువచ్చి కాళ్లను తాకుతూ వెళ్లి అ
తల సీట్లో కూర్చుందా అమ్మాయి. ఉ
పడి చూసాడు. వీణ తంత్రి కంపించిన
వణికిపోతున్నదా అమ్మాయి.

ఆమెవంకే చూస్తూ భయంలేదన్న





తలూపాడు.

"తాగివున్నాడు" గొణిగినట్లు చెవిలో గుసగుసలాడింది. బంగారు కలశంలోంచి ముత్యాలొలికినట్లుందామె కంఠస్వరం.

"ఉల్లాగాడు, కోడీకలు కళ్ళకున్న కాకి-వాడు విన్నేం చేయకుండా చూచే వూచీ వాది!" గంభీరంగా పలికాడు.

కంపిస్తున్న ఆ అమ్మాయి శరీరం నుండి వస్తున్న రోజ్ లావెండర్ పరిమళం అతనిని ఓవైపు రెచ్చగొడుతూ మరోవైపు చొచ్చుగొట్టసాగింది.

వైట్ ప్యాంట్ హిప్పీక్రాఫ్ సన్నగా విజిల్ వేసాడు. పెనుగాలికి ప్రకంపించే తమలపాకు తీగలా మరింతగా వణికిపోసాగింది.

"వళ్లు తిమ్మిరెక్కిందా? దిహేవ్

యువర్ సెల్ఫ్" నెమ్మదిగానే అంటూ చొక్కా చేతుల పైకి మడిచాడు దండ కండలు కనపడేట్లు.

ఉక్కు కడ్డీలలా మెరుస్తూ ఇరవై అంగుళాల చుట్టుకొలతవున్న అతని బైసెప్స్ చూచి పిల్లిని చూచి కలుగులో దూరే ఎలుకలా కుర్చీలో ముడుచుకుపోయాడు హిప్పీ క్రాఫ్.

"డోంట్ వర్రీ బేబీ" అప్రయత్నంగా అతని ఎడమచేయి కంపిస్తున్న యువతి తొడమీద పడింది.

యువతి శరీరంలోని ప్రకంపన ఆగింది. ఆమె చేయి అతని ఎడమచేయిమీద పడింది.

సినిమా మొదలయింది! హారర్ సినిమా పదినిమిషాలకొక హత్య ఇరవై నిముషాలకొక రేప్‌సీన్ ఆ అమ్మాయి శరీరంలోని భయప్రకంపనలను తగ్గనివ్వలేదు.

"టేకిట్ యీజీ బేబీ-డోంట్ యు బి ఎఫ్రయిడ్."

"టైటిల్ చూసి మోసపోయాను!" మంద్రస్వరంలో సమాధానం చెప్పి నెమ్మదిగా లేవబోయింది.

"డబ్బిచ్చి టిక్కెట్ కొనుక్కొని మధ్యలో లేచివెళ్లటం ఎందుకు?" అతని మాటలకు మళ్లీ కూర్చుండిపోయింది.

అప్రయత్నంగా తలతిప్పి హిప్పీ క్రాఫ్ యువకునివంక చూచింది.

"డొంట్ వర్రీ ఎబౌట్ ద లోఫర్!" బిగ్గరగా అన్నాడు. చివాలున లేచిన యువ



"థాంక్స్!"

"అస్పష్టంగా గొణిగింది."

"ద ప్లెషర్ యీజ్ మైన్" ఆమె తొడను బహునెమ్మదిగా స్పృశిస్తూ అన్నాడు.

"వాడు నన్ను అక్కడే గిచ్చాడు" ...ముగా అంది.

"బ్రూట్! ఆడపిల్ల కనబడితే కీచకులవుతారీ కుర్రకారు" బహు నెమ్మదిగా ఆమె తొడ నవరిస్తూ బదులు పలికాడు.

తలతిప్పి హిప్పీక్రాఫ్‌వంక చూసి అతను తదేకంగా స్క్రీన్‌వంక చూడడం చూసి సంతృప్తిగా తలాడించాడు.



## మోహినీతాండవం

కుడు ఏమనుకున్నాడో ఏమో దడాలున కూర్చుండిపోయాడు.

"వాణ్ణి కవ్వించకండి" భయపడుతూ అంది.

"వాడేం చేస్తాడు? ఒక్క పంచ్ యిచ్చానంటే బల్లి నేలను కరచుకున్నట్లు పోయి నేలను కరచుకుంటాడు".

హిప్పీ క్రాఫ్ యువకుడు "హా" అని కోపంగా బుసపెడుతూ చివాలున లేచి వస్తున్న సమయంలో పవర్ కట్ అయి హాలు చీకటిలో మునిగింది.

క్షణం తర్వాత 'జుయ్' మన్న శబ్దం ఆ తర్వాత కొద్ది సెకన్లకు దబ్ మని మనిషి నేలమీదపడ్డ శబ్దం వినపడింది.

"హెల్ప్" అని ఆ అమ్మాయి నెమ్మదిగా అరచిన శబ్దం అప్పుడే స్టార్టయిన జెనరేటర్ రొదలో కలసింది.

హాలులో లైట్లు వెలిగాయి. చచ్చిన పాములా సీట్ల మధ్యపడివున్నాడు హిప్పీ క్రాఫ్ యువకుడు.

"చచ్చాడేమో?" భయంగా అంది.

"నాక్ అవుట్ పంచ్-అరగంటదాకా స్పృహరాదు" బదులుగా అన్నాడు.

"మీరు లేకపోతే ఈరోజు నాగతి" ఆమె మాటలు పూర్తి కాకుండానే లైట్లారిపోయాయి. అతని కుడిచేతి చూపుడు వేలు ఆమె పెదాలను తాకింది-మాట్లాడొద్దన్నట్లు.

దగ్గరైన చూపుడు వేలును నెమ్మదిగా ముద్దుపెట్టుకోసాగాయామె పెదాలు.

సినిమా మొదలయింది! కాని బాల్కనీ టికెట్ కొన్న ఆ ముగ్గురిలో ఎవరూ సినిమా చూడలేదు!

ఆమె దగ్గరనుండి వచ్చిన గ్రీన్ సిగ్నల్‌తో అతను మరింత ఉత్సాహంతో ఆమె పెదాలను బహుమృదువుగా స్పృశించసాగాడు.

"ఓ" అంటూ ఆమె తన వేపు తిరగడం గమనించి తలవక్కకు తిప్పి ఆమె పెదాలను తన నాలుక చివరతో స్పృశించాడు. తుమ్మెద పాటుకు విచ్చుకుంటున్న గులాబిరేకుల్లా ఆమె పెదాలు విచ్చుకున్నాయి.

పాము నాలుకలా అతని నాలుక ముందుకు సాగింది., పలువరుస, చిగుళ్ళు నాలుక, అంగులి బుగ్గ లోపలి భాగం తన నాలుకతో స్పృశిస్తూ ఆమె వంటినుండి వస్తున్న పరిమళాన్ని ఆస్వాదిస్తూ అనుకోకుండా లభించిన అయాచిత అదృష్టానికి తనను తాను అభినందించుకోసాగాడు.

భయంవదలిన అమ్మాయి సంతోషం కృతజ్ఞతలు నిండిన మనసుతో అతనికి అద్భుతంగా ప్రతిస్పందించ సాగింది!

ఈత, రన్నింగ్, బాక్సింగ్, ప్రాణాయామం నిత్యం ప్రాక్టీస్‌చేసే అతనికి దమ్ముయిపోయి ఆయాసం వచ్చింది! కుర్చీలో తిన్నగా కూర్చున్నాడు. ఆ క్షణాన తెరమీద 'ది ఎండ్' అక్షరాలు కనపడ్డాయి!

హిప్పీక్రాఫ్ అతని జాడలేదు. లేచి నిలబడుతూ "ఆట మధ్యలో పారిపోయుంటాడు!" అన్నాడతను.

అవునన్నట్లు తలూపిందిగాని ఆ అమ్మాయి కళ్లు బెదిరిన లేడికళ్లలా చంచలములయ్యాయి.

హాలు బయటకు నడిచారిద్దరూ. వాన కురుస్తూనేవుంది. ఆ విషయం యిద్దరూ మరిచిపోయారు అంతవరకూ!

కరెంట్ లేకపోవటంతో బజార్లు చీకటిగా వున్నాయి. అప్పటికే రిక్షాలూ ఆటోలు సినిమా చూచి వచ్చిన వాళ్లను తీసుకుని వెళ్లిపోయాయి.

ఎక్కడనుండో ఒక ఆటో అటుకేసి వస్తూండటం చూచి ఇద్దరూ ఒకేసారి చేయి ఎత్తారు.

ఆటోవచ్చి ఆగింది. ముందుగా ఆ అమ్మాయి ఎక్కి కూర్చుంది. "వాడొస్తాడేమో?" అంది భయంగా.

"భయపడకు నేనూ వస్తున్నా!" అంటూ అతను ఆటో ఎక్కి ఆమె ప్రక్కన కూర్చున్నాడు.

పడుచుదనం గుబాళిస్తున్న అమ్మాయిని నడి వయసు వ్యక్తిని మార్చి చూస్తూ "ఎక్కడికి పోనిమంటారు?" అని అడిగాడు ఆటో డ్రైవరు.

"గాంధీనగర్, ద్వారకీ ఎపార్ట్‌మెంట్స్" అడ్రస్ చెప్పింది.

చీకట్లో ఆటో రోడ్డు గతుకులమీద చిందులాడుతూ ప్రయాణించసాగింది. దగ్గరవుతున్న అమ్మాయిని మరింతగా హత్తుకుంటూ తన వొడిలో తలవాల్చిన ఆమె కురులను నిమురసాగాడతను.

ఉబుసుపోక ఇంగ్లీషు సినిమాకు వచ్చిన తనకు లభించిన అయాచిత అదృష్టానికి పొంగిపోతూ అందమైన యువతి సన్నిహిత స్పర్శ సుఖానికే ఆనందిస్తూన్న అతను ఆటోఆగే సరికి బాహ్యాచేతనలోకి వచ్చాడు.

ద్వారకి ఎపార్ట్‌మెంట్స్ నేమ్ ప్లేట్ మెరుపు వెలుగులో కనపడింది.

## టెస్ట్ ట్యూబ్ బేబీ సృష్టికర్త హిందూజా

భారతదేశంలో మొట్టమొదటి టెస్ట్ ట్యూబ్ బేబీని సృష్టించిన ఘనత డాక్టర్ ఇందిరా హిందూజాకు దక్కుతుంది. తొలి టెస్ట్ ట్యూబ్ బేబీ సృష్టికి ముందర మూడేళ్ళపాటు ఈ అంశం మీద ఆమె ఎంతో శ్రమించి పరిశోధనలు చేశారు. ఇప్పటికీ బొంబాయిలోని ఆమె ఆసుపత్రి రోజూ వచ్చే పోయే జనంతో కిటకిటలాడుతుంటుందట. దాదాపు అందరూ కృత్రిమ గర్భధారణ కోసమే వస్తుంటారు.



ఆటో దిగిన అమ్మాయి "రండి" అంది నెమ్మదిగా. హోరుగాలిలో పరుగెత్తే దూదిపింజలా అతని మనసు అఘమేఘాలమీద పరుగెత్తసాగింది!

యాభై రూపాయల నోటు ఆటో అతని చేతిలో వుంచి ముందుకు వెళ్ళాడు.

"లిఫ్ట్ పని చెయ్యదు. ఇలారండి" మెట్లవైపుగా నడుస్తూ అందా అమ్మాయి.

మెట్లెక్కి నాలుగో అంతస్తులోవున్న తన అపార్ట్‌మెంట్ డోర్ తీస్తూ "వాడెక్కడ వెంటాడుతాడో అని భయపడ్డాను" అంది.

"ఇంకా నీ భయం తీరలా?" చిన్నగా నవ్వుతూ అన్నాడు. ఆ క్షణాన కరెంట్ వచ్చి వరండాలో లైటు వెలిగింది.

అపార్ట్‌మెంట్‌లో అడుగెట్టాక గాని జుట్టుతోసహా దుస్తులు నీళ్ళు వోడుతూ వున్న విషయం గుర్తు రాలేదతనికి.

ఆ అమ్మాయి పరిస్థితీ అలాగే వుంది!

"అదుగో బాత్‌రూం-తడిసి ముద్దయ్యారు వెళ్లి తల తుడుచుకురండి-ఈలోపు గరం చా తెస్తా" లోపలకు వెళ్లింది.

సన్నగా యీలవేస్తూ బాత్‌రూం వైపుకు కదిలాడు. గదిలోని ఖరీదైన సోఫాసెట్ టీపాయ్‌మీదవున్న ఫ్లవర్‌వాజ్‌లోని గులాబీల గుత్తిని చూస్తూ

"ఇంకా పెళ్ళికాలేదు కాబోలు! అయివుంటే భర్త ఫొటో, పెళ్ళినాటి ఫొటోనో, ఇద్దరూ కలసి తీయించుకున్న ఫొటోనో గోడమీదో టీపాయ్ మీదో టి. వి. సెట్ మీదో కనపడి వుండేది" అనుకుంటూ బాత్‌రూం తలుపు వేసుకున్నాడు.

అందమైన అమ్మాయి అపార్ట్‌మెంట్‌లో వున్నానన్న ఆలోచన అతన్ని విచక్షణాజ్ఞాన శూన్యుడిని చేసిందిగాని లేకుంటే "పెళ్లికాకుంటే మాత్రం ఏం? కుటుంబ సభ్యుల ఫొటోలయినా వుండాలిగదా!" అని తర్కించుకుని వుండేవాడు!

అద్దంలో కనపడుతున్న ప్రతిరూపం చూచి విజిల్ వేసాడు. జుట్టు చెంపల దగ్గర నెరుస్తుంది. అయితేనేం! కండలు తిరిగిన దేహంలో కావల్సినంత శక్తివుంది! మూతి మీద మీసాలు వస్తున్న పదిమంది యువకులకు వొక్కడినే సమాధానం చెప్పగలను" జబ్బలు చరుచుకుంటూ అనుకున్నాడు.

నీళ్లు కారుతున్న చొక్కా ప్యాంటు విప్పి హేంగరుకు తగిలించాడు.

# యువతా కవితా

## పోయా!

గంటలో వంటయ్యిందని
సంతోషించా, కానీ
పప్పు ఉడకకుండానే ఉప్పేశానని
మరచిపోయా!

మూడు నెలల్లోనే పంట పండుతుందని
సంతోషించా, కానీ
నేను కొన్నవి కల్తీ విత్తనాలని
తెలుసుకోలేకపోయా!

నాకూ ఓటు హక్కు వచ్చిందని
సంతోషించా, కానీ
నేను ఓటు వేసింది
శుష్క వాగ్దానాల దగుల్బాజీకని
తెలిసి తెల్లబోయా!

- నవుడూరి నారా

## కళ్ళులేని న్యాయం

ఇంతకాలం
న్యాయం
నలుదిక్కులా
చూడగలదనుకున్నా!
కాని
ఇప్పుడే తెల్సింది
తన ఎదురుగా
విచ్చలవిడిగా
సంచరిస్తోన్న
అన్యాయాన్ని సైతం
సాక్ష్యం లేనిదే
ఆమె
గుర్తించలేదని!

- దాకరపు బాబూరావు

## తేడా

ఆలైనా
వెలయాలైనా
ఇద్దరూ- సుఖాన్నిచ్చేవారే!
కానీ
ఆలి సుఖం
ఆముదపు దీపం లాంటిది
వెలుగుతో పాటు
కళ్ళకు చల్లదనాన్నిస్తుంది!
వెలయాలి సుఖం
విద్యుద్దీపం లాంటిది
కాంతితో పాటు
కరెంటు షాకిస్తుంది!

- పి. ప్రశాంతి

## అపార్థం

ప్రణయ కవిత రాశాను
ప్రకటించేశాను-
అంకితం :
"నా హృదయ సామ్రాజ్యపట్టమహిషికి"
అన్నాను!
"ఆమె చేతనే వండించుకు తినం"డని
మా ఆవిడ
అలిగి పుట్టింటికి వెళ్ళింది!

- ఇమ్మానేని

## అద్వైతశాస్త్రం!

గాలి ఎటు వీస్తుందో చెప్పగలం
స్పర్శజ్ఞానం తెలుసు గనుక!
చీకటి, వెలుతురు
ఎలా వస్తుందో చెప్పగలం
ఖగోళశాస్త్రం ఉంది గనుక!
వర్షం, పెను తుఫాన్ల గురించి
ముందుగానే తెలుస్తుంది
వాతావరణ శాఖ పనిచేస్తుంది గనుక!
కాని-
మనిషి గాలి ఎటో
చీకటి వెలుగుల సంభవం
తుఫాన్ల సంఘర్షణ
ఎలా చెప్పగలం?

- వి. సూర్యారావు



# మోహినీతాండవం

తడిసిన బనియన్ తీసి కొక్కేనికి తగిలించాడు. డ్రాయరు తడువలేదు. హేంగర్‌కు వేలాడుతున్న పెద్ద టర్కీ టవల్ తీసుకుని తలవఱ్ఱు శుభ్రంగా తుడుచుకున్నాడు.

ఎడమ తొడ తుడుచుకోబోయేముందు ఇలాస్టిక్ బాండ్లతో తొడకంటుకున్న చురకత్తి పొదిని చేత్తో తడుముకున్నాడు. అప్రయత్నంగా అతని ఎడమ పిడికిలి చురకత్తిపిడిమీదకు వెళ్లింది.

అతని వేళ్లకు పట్టు దొరికేలా అరగదీసి వుందా బాకుపిడి. కత్తి ఎనిమిదంగుళాల పొడవున చివర కొనదేలి పక్కన పదును పెట్టబడివుంది.

ఛురకత్తిని పైకి తీసి లైటు వెలుతురులో తళతళ మెరుస్తుండటం గమనించాడు.

కత్తిమొనను ఎదురుగా వున్న అద్దానికి ఆనించాడు. అద్దంమీద చుక్కలా గంటు పడింది. కత్తి తళతళలు అద్దంలో ప్రతిఫలించాయి.

సంతృప్తిగా కత్తిని పొదిలోకి దోపాడు. ఆ ఛురకత్తిని ఎడమచేతితో ఇరవై అడుగుల దూరానవున్న టార్గెట్‌ను గురి తప్పకుండా కొట్టగల నన్న వాస్తవం అతనికి ఎల్లవేళలా ధైర్యాన్నిస్తుంది. దగ్గర్లోవున్న వ్యక్తిని కనుమూసి తెరిచేంతలో ఖతం చెయ్యటం అతనికి వెన్నతోపెట్టిన విద్య!

టవల్‌ను వంటికి చుట్టుకుని అద్దం ముందున్న దువ్వెన తీసుకుని చిందరవందరగా వున్న జుట్టు దువ్వుకున్నాడు. అద్దంలో కనిపిస్తున్న ప్రతిరూపం వంక సంతృప్తిగా చూచుకుని హుషారుగా యీల వేస్తూ బాత్‌రూండోర్ తెరచుకొని బయటకు వచ్చాడు.

"టీ రెడీ" లోపల గది నుండి అమ్మాయి పిలుపు వినపడి అటుకేసి నడిచాడు.

బెడ్‌రూంలో బెడ్‌మీద కూర్చుని వుంది. ఆవిర్లుగమ్మే టీ కప్పు పక్కన స్టూలుమీద వుంది.

అమ్మాయివంకే చూస్తూ బెడ్ దగ్గరకు వెళ్లసాగాడు జుట్టుకు పెట్టిన క్లిప్పుతీసి తల విదిలించిందా అమ్మాయి. నిడుపాటి కురులు కదిలే మేఘమాలికలలా ఆమె భుజాలమీదుగా కిందకు జారాయి.

మంచంమీద కూర్చుంటుంటే అతని ముఖాన చిరునవ్వు వెలసింది.

ఆ అమ్మాయి చీర జాకెట్ తీసివేసి సిల్క్ నైట్‌గౌన్ తొడుక్కుని వుంది!

నైట్‌గౌను మెడదగ్గర వున్న గుండీ విప్పింది. గౌను కిందకు జారింది. నగ్నంగా వున్న ఆమె ఛాతీ చూడగానే మోహిని అంటే మువ్వా?!" అంటూ ఎడమచేతిని కత్తి పిడిమీదకు పోనిచ్చాడు.

అతని చేయి కత్తిపిడిమీదకు వెళ్ళక ముందే ఆ అమ్మాయి కుడిచేయి మెరపు వేగంతో దిండుకింద పిస్టల్ తీసి సరిగ్గా అతని నుదిటి మధ్య భాగానికానించి ట్రిగర్ నొక్కింది.

పుర్రె ఎముకను చీల్చుకుని లోపలకు దూసుకు వెళ్లిన పిస్టల్ గుండు మెదడును ఛిన్నాభిన్నం చేసి తలవెనుకగుండా బయటకు వెళ్లిపోయింది.

"మోహినీ!" అంటూ ఆమె పాదాల ముందు కుప్పగూలిపోయాడు ప్రణవనాథ్!

నైట్‌గౌన్ గుండీ పెట్టుకోబోతూ ఛాతీవంక చూచుకుంది!

అక్కడేముంది?

(ఇంకావుంది)

# ఈవారంలో మీ యోగం

**24-8-1990 శుక్రవారం మొదలు**
**30-8-1990 గురువారం వరకు**

**మేషం :** పంపిణీదారులకు, పత్రికా రంగాన శ్రమించు వారికి, కళా సాహితీ రంగాన సదవకాశాలు ధనలబ్ధి చెప్పదగిన ముఖ్యాంశాలు. చిత్రం నిర్మించాలని చేసే యత్నాలు అనుకూలింప నున్నది. రచనా రంగాన సదవకాశాలు కొందరకు స్త్రీలకు: సభా మర్యాద, శుభ కార్య ప్రస్తావనలు, ధనలబ్ధి.

**వృషభం :** పదిమందితో కలిసి తీర్థ యాత్రార్థం బయలుదేరుట చెప్పదగిన ముఖ్యాంశం. అలా యిలా తిరుగుతూ వస్తువులు పోగొట్టు కొంటారేమో జాగ్రత్త. 'రోడ్డు' ప్రమాదం సంభవం కావచ్చు. జాగరూకత అవసరం. సాహితీ రంగాన సదవకాశాలుంటాయి. స్త్రీలకు: ధనలోపం లేదు. వ్యవహార విజయం.

**మిథునం :** ప్రసిద్ధులతో సమాగమం. రాజకీయ రంగాన అనుకూలం. రచయితలకు, నాట్య కోవిదులకు, చిత్రరంగాన చక్కని అవకాశాలు సాధించాలని యత్నించు వారికి అనుకూలం. స్త్రీలకు: కుటుంబానందం, విద్యా వంతులైన కుమార్తె కుమారులకు సదవకాశాలు, యత్న కార్యసిద్ధి ధనలబ్ధి గ్రహించగలరు.

**కర్కాటకం :** ప్రభుత్వపరంగా ఏదైనా అవకాశం చిక్కుటకు ఈ వారం మీకు ఆస్కారం. వ్యవహారం . ఏదైనా పరిష్కరింపబడవలెనంటే చక్కని అవకాశమున్నది. పాత్రికేయులకు, పంపిణీదారులకు, పత్రికారంగాన శ్రమించు వారికి అనుకూలం. స్త్రీలకు: యోగదాయక వారం. యత్నించిన కార్య సాఫల్యం.

**సింహం :** ధనలోపం రాదు. వ్యాపార మందు .చక్కని అవకాశమున్నది. బంధువుల రాక, శుభ కార్య ప్రస్తావనలుండవచ్చు. కళాసాహితీరంగాన ప్రసిద్ధులను కలసికొని లాభార్జనకు, కార్యసాధనకు అనుకూల సమయం. స్త్రీలకు: ఉద్యోగమందు 'ప్రమోషన్' కొందరకు, వస్త్ర సేకరణకు ఆస్కారం కొందరకు చెప్పనైన ముఖ్యాంశాలు.

**కన్య :** పని ఉన్నా లేకున్నా త్రిప్పట మాత్రం కొందరకు తప్పదు. దరిదాపుల కొచ్చి వ్యవహారం దూరం కావటం కొందరు గ్రహింపగలరు. వస్తు సేకరణ యందు జాప్యం తప్పదు కొందరకు. అన్ని విధాలా వ్యవహార లోపం 'శని' చతుర్థ చర్యగా గ్రహించండి. స్త్రీలకు: కుటుంబ పరిస్థితి యందు యిబ్బందులు తప్పవు. కొందరకు ఆరోగ్య భంగం తప్పదు, గ్రహించండి.

**తుల :** కొంతలో కొంత మేలు. రాశికి మూట 'శని' కొంత మేలు చేయనున్నాడు. వస్తు వాహన సేకరణకు అనుకూలుడు. కొనుగోలు చేసి అధిక లాభార్జనకు యత్నించుట జరుగుతుంది. అధిక లాభా ర్జనా యత్నం మేలు కాదు గదా! స్త్రీలకు: ధనలాభం, యత్న కార్యసిద్ధి, ఉద్యోగరీత్యా మేలు.

**వృశ్చికం :** సభా మర్యాద యున్నది. అంతో యింతో చేతికి అందుతుంది. శుభ కార్య సంభాషణలుంటాయి. దూరంగా వెళ్లాలని, విశ్రాంతి తీసికోవాలని చేసే యత్నాలు విజయవంతమవుతాయి. బంధు మిత్ర సమాగమం. స్త్రీలకు: ఆటపాటల్లో గాన కళలో, నాట్యంలో ప్రావీణ్యత గలవార్కి సదవకాశాలు.

**ధనుస్సు :** ధన లోపం ఏమాత్రం రాదు. రాబడిని మించిన ఖర్చులు, చాల కాలం క్రితం చేసిన ఒకానొక ఆస్తిని గూర్చిన వ్యవహారం విజయ వంతం కాగలదు. మిత్ర సహాయమున్నది. 'జాయింటు' వ్యాపారాన చక్కని అవ కాశాలున్నాయి. స్త్రీలకు: ఉద్యోగ యత్నం సఫలం. నగలు కొనుటకు చక్కని అవకాశం.

**మకరం :** విధీ విరామ మెరుగక శ్రమించారుగా! తిరుగ తగిన చోట్లన్నీ చూచారుగా! ఉద్యోగ యత్నాలు సాధించాలని పడ్డ పరిశ్రమ ఎంత ప్రయాసతో కూడినదో గ్రహించారు. ఫలితం శూన్యం, అంతా వ్యయ 'శని' అందు నా 'వక్రత' వారమంతా వేధింపే. స్త్రీలకు: శ్రమించి స్వల్పంగా ఆదాయం వృత్తిలో అందుకో నున్నారు.

**కుంభం :** ధన లోపం లేదు. కళా సాహితీ రంగాన పేరు తెచ్చుకొంటారు. రచయితలకు సదవకాశాలున్నాయి. ఆనందదాయకమైన వారం. అపూర్వ వస్తు సేకరణకు ఆస్కారం. సజ్జన సాంగత్యం. రాజకీయ వాదుల సహవాసం, లాభదాయకం. దర్శకులకు, నిర్మాతలకు యోగదాయకం. స్త్రీలకు: సంతాన ఉద్యోగ కార్యార్థులై చేసిన ప్రయత్నం సానుకూలం.

**మీనం :** చాల దూరం వెళ్ల **నున్నారు** కొందరు. కొందరు కుమార్తెను, కుమారుని చూడాలని విదేశ ప్రయాణం సాగింపనున్నారు. కొందరు రాజకీయ మిత్రులను కలిసికొన నున్నారు. కొందరు ఏమైనా, ఎవరికైనా ఈ వారం యోగదాయకమే. స్త్రీలకు: వృత్తిరీత్యా మేలు. ఆదాయ వృద్ధి, ఆరోగ్యమందు పెంపు చెప్పదగిన వారమే.

- విద్వాన్
కోట సత్యరంగయ్యశాస్త్రి

## ఉత్తరార్జున్

సర్వసాధారణంగా పత్రికలకు ఉత్తరాలు వ్రాసేవారి సంఖ్య తక్కువనే చెప్పాలి. అందులోనూ ఉత్తరాలు అధికంగా వ్రాసేవారి సంఖ్యకూడా తక్కువే వుండచ్చు. కాని బొంబాయికి చెందిన ఒక వ్యక్తికి పత్రికలకు అధిక సంఖ్యలో ఉత్తరాలు వ్రాసిన ఘనత దక్కుతుందట. ఆంథోనీ అనే ఆ వ్యక్తి వ్రాసిన లేఖలు 3500 పైగా పత్రికలలో ప్రచురించబడినాయుట. మరి యిన్ని లేఖలు వ్రాయాలంటే ఎంత ఓపికవుండాలి! ఆంథోనీ ఓపికకు మెచ్చుకోవాల్సిందే!

ధారా నవల

# గి.గి.ల వల

— టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి

ఆదివారం ఉదయం తొమ్మిది గంటలు దాటిపోయింది.

పేపరు నిండుగా నిండుకున్న పంజాబ్ వార్తలు పసందుగా లేకపోయినా పట్టుదలగా, ఫాస్టుగా చదివేస్తున్నారు రాజారావుగారు.



"ఏమండోయ్! ఆ పేపరు కాస్త ప్రక్కన పడవేసి లేచివచ్చి టిఫిన్ తినేదేమయినా ఉందా? లేక ఆ పేపర్నే తింటూ మధ్యాహ్నం వరకూ గడిపివెయ్యదలచుకున్నారా... ఇక్కడ కిచిడీ చప్పగా చల్లారిపోతోంది!" అంటూ వంట ఇంట్లోంచి శ్రీలక్ష్మమ్మ కేకలు పెట్టడం మొదలుపెట్టేసరికి అయిష్టంగానే చదువుతున్న పేపర్ను ప్రక్కన వున్న టీపాయ్‌మీద పడవేసి లేచారు ఆయన.

అయితే అదే సమయంలో వరండాలోంచి "సార్!" అంటూ పిలిచారు ఎవరో.

రాజారావుగారికి ఒళ్ళుమండింది. బయలుదేరనంత వరకూ ఆయనకు ఆకలి ఉండదు కానీ వంటగదికేసి ఒక్క అడుగు వేసినా ఆపై ఆకలికి తట్టుకోలేరు ఆయన.

అయితే వచ్చిన వ్యక్తిని చూసి జాలీ మొరగకపోవడం వల్ల ఆయన తన చిరాకును అణుచుకుంటూ వరండాకేసి నడిచారు.

దాదాపు నలభయి సంవత్సరాల వయసు కలిగిన ఓ వ్యక్తి బెరుకు బెరుగ్గా చూస్తూ నిలబడి కన్పించాడు ఆయనకు వరండాలో.

"ఎవరు కావాలి?" అంటూ ప్రశ్నించారు ఆయన.

"రాజారావుగారితో మాట్లాడాలండీ..." అన్నాడు అతడు అనుమానంగా, సంకోచంగా.

"ఈ ఊర్లో రాజారావుగార్ని ఎరగని మనుషులు కూడా ఉన్నారన్నమాట... కర్మ.. కాదు.. ఖర్మ.. సరే కర్మ, ఖర్మ.. రాజారావుగార్ని నేనేనయ్యాబాబూ! ఏం మాట్లాడాలి నాతో?"

రాజారావుగారు అలా అనగానే ఆ అగంతకుడు రెండు చేతులూ జోడించి సవినయంగా నమస్కారం పెడ్తూ అన్నాడు కాస్త దీనంగా.

"సార్! నేనో చిక్కులో ఉన్నాను సార్!"

"ఒట్టి బక్కమనిషిలా ఉన్నావే? ఒక్క చిక్కుకే అంతలా డీలాపడిపోతే ఈ ప్రపంచంలో ఎలా బ్రతుకుతావయ్యా? చిక్కులలో లేని మనుషులు ఈ దేశంలోనే అరుదయ్యా బాబూ. ఆఫ్టరాల్ ఓన్లీవన్ చిక్కుకే ఇలా బాధ పడిపోవడం ఏమీ బావోలేదయ్యా!" అన్నారు రాజారావుగారు.

ఆయనలా అనగానే ఆ అగంతకుడు కళ్లనీళ్ల పర్యంతం అయిపోయాడు.

అతని కన్నీరు చూసి కాస్త కరిగారు ఆయన. ఆపై నెమ్మదిగా నవ్వారు.

"ఇంతకూ నన్ను కలుసుకోవాలనే ఊహ నీకెలా వచ్చిందయ్యా?" అని ప్రశ్నించారు నవ్వుతూనే.

"మునిసిపల్ ఆఫీసులో పనిచేసే శంకరరావు మిమ్మల్ని కలిసి సలహా అడగమంటే ఇలా పరిగెత్తుకొచ్చాను సార్!"

అర్థం అయినట్లుగా తలపంకించి వరండా పిట్టగోడమీద కూర్చుంటూ అడిగారాయన.

"నీ పేరేమిటి?"

"సవరాల సుందరయ్య సార్!"

"అలాగా, సరే! యస్. సుందరయ్యా అలా వచ్చి ఆ బల్లమీద కూర్చో?" అంటూ వరండాలోని బెంచీ చూపించారాయన.

"ఇహ చెప్పు నీ సమస్య ఏమిటో!" అన్నారు ఆయనే మళ్లీ. సుందరయ్య కూర్చున్న తరువాత.

"సంవత్సరం క్రితం నేను నారపీచు నాంచారయ్య వద్ద అయిదువేల రూపాయలు అప్పుగా పుచ్చుకున్నాను సార్ నెలకు నూటికి పది రూపాయల వడ్డీరేటుతో! ప్రతి నెలాకరక్టుగా వడ్డీ ఇచ్చేస్తూనే ఉన్నాన్సార్.. నాంచారయ్య ఇప్పుడు అసలు ఇచ్చి వెయ్యాలంటున్నాడు.. ఆయన డబ్బు ఆయనకు ఇచ్చివెయ్యాల్సిందే కానీ

ప్రస్తుతం నా దగ్గర లేదు!" అన్నాడు సుందరయ్య.

రాజారావుగారు సుందరయ్యకేసి జాలిగా చూశాడు.

అయిదువేల రూపాయలు అప్పు పుచ్చుకుని సంవత్సరం రోజులలో ఆరువేల రూపాయలు వడ్డీ మాత్రమే చెల్లించిన, చెల్లిస్తున్న సుందరయ్య లాంటి దౌర్భాగ్యులు ఈ దేశంలో లక్షలాదిగా ఉండి వుంటారు ఖచ్చితంగా.

అయితే వారిలో తొంభయితొమ్మిది శాతం మందికి తాము ఎంత వడ్డీ చెల్లించారో తెలియనే తెలియదు. అంత దూరం ఆలోచించడాన్కి భయపడ్తారు... పిచ్చి పడ్తుందేమోనని!

"వడ్డీ సక్రమంగా చెల్లిస్తున్నప్పుడు అసలుకు అంత తొందర ఏమిటంట ఆ యన్. నాంచారయ్యకు?"

"అసలు వెంటనే ఇవ్వాలట సార్! అలా ఇవ్వలేని షక్షంలో నెలకు నూటికి పదిహేను రూపాయల వంతున ఇహ ప్రతి నెలా ఏడువందలా ఏభయి రూపాయలు వడ్డీ చెల్లించాలట!" అన్నాడు బేలగా సుందరయ్య.

"పచ్చికట్టెల మధ్య పెట్టి కాలీకాలకుండా వాడ్ని తగలెయ్యా.... ఎంతాశ.... ఎంతాశ....? ఎందరయ్యా వాడికి పిల్లలు?"

"నాంచారయ్యకా సార్? ఆయనకు పిల్లలు లేరుసార్!"

"అదీ కథ! అందుకే అంతాశ!!"

"సార్ రెండేళ్ల క్రితం ఉన్న ఇల్లు అమ్మి ఒక్కగానొక్క కూతురి పెళ్లి చేసేశాను సార్. ఇహ ఆస్థిపాస్తులంటూ ఏమీ



లేవు నాకు. సంవత్సరం క్రితం బిడ్డ కాన్పు కని నా (అద్దె) ఇంటికి వచ్చింది.

అప్పుడు కాన్పు చాలా కష్టం అయి పోయింది. యములోళ్లను వెనక్కి తరిమేసి పెద్దాపరేషను చేసి తల్లినీ బిడ్డనూ కాపాడారు రవివర్మ ఆస్పత్రి వాళ్లు. లెక్క మాత్రం మూడు వేల రూపాయలు అయిపోయింది. కూతురూ మనవడూ క్షేమంగా ఇల్లు చేరారు కానీ ఆ తిప్పట్లలో నేను జబ్బు పడిపోయాను. దానాదీనా తడిసి మోపెడయినట్లయింది నా పని.

అప్పు చేసేకొద్దీ దప్పికే అన్నది నిజం సార్! నా కూతురు తన ఇంటికి వెళ్లేసరికి నాంచారయ్య దగ్గర పుచ్చుకున్న మొత్తం అప్పు అయిదువేలయింది.

నెల నెలా వడ్డీ ఐదువందలు కట్టడానికే సతమతం అయిపోతూ ఉంటే పులి మీద పుట్రలా ఇప్పుడు ఈయన నన్ను ఇలా ఇరకాటంలో పెట్టేస్తున్నాడు. ఏం చేయాలో ఎలా ఒడ్డున పడాలో దిక్కుతోచడం లేదు సార్!"

"నా జీతమే పదకొండు వందలు. రికవరీలు మంచీ చెడ్డా పోనూ చేతికి వచ్చేది తొమ్మిదివందలా తొంభయి రెండు రూపాయలు మాత్రమే సార్. వడ్డీ పోను మిగిలిన దానిలో ఇంటి అద్దె చెల్లించేసి ఆపై మిగులుతో ఉండీలేకా తినీతినకా కాలం గడిపేస్తున్నాము సార్..... నేనూ నా భార్యా! ఇప్పుడు నాంచారయ్యకు ప్రతినెలా ఏడువందలా ఏభయి ఇచ్చేస్తే చాలా ఇక్కట్టుల పాలయిపోవాలి సార్!"

"నీవేం చేస్తుంటావయ్యా?"

"సమితి ఆఫీసులో అటెండర్ను సార్!"

జవాను ఉద్యోగాలు చేస్తున్న వాళ్లందరూ వడ్డీలకు డబ్బులు తిప్పుతున్న రోజులలో నాంచారయ్య లాంటి వ్యక్తి దగ్గర అప్పు చేశాడంటే సుందరయ్య చాలా మంచి వ్యక్తీ, బ్రతకడం చేతగాని వ్యక్తీ కూడా అయి ఉండాలనిపించింది రాజారావుగారికి.

పిల్లిని కూడా మెట్లెక్కనివ్వని తమ కుక్క జూలీ సుందరయ్యను చూసి మొరగనుకూడా మొరగలేదు.

"ఈనెల వడ్డీ ఇచ్చేశావా సుందరయ్యా!"

"ఇవ్వబోతే తీసుకోలేదు సార్! అసలు కావాలన్నాడు. బ్రతిమాలుకుంటే... వెళ్లి ఏడువందలా ఏభయి తెమ్మన్నాడు. కానీ నావద్ద ఉంది ఐదువందలరూపాయలే.



మళ్లీ అప్పు చెయ్యాలంటే భయంగా ఉంది!"

రాజారావుగారికి కొంత సంతోషం కలిగింది సుందరయ్య భయంచూసి. అప్పు చెయ్యడానికి భయపడడం అలవాటయిపోతే ఆ మార్పు సామాన్యుడికి చాల మేలు చేస్తుంది.

"ఇలా జరిగి ఎన్ని రోజులయింది?"

"నాలుగురోజులయింది సార్!"

"సుందరయ్యా!"

"సార్!"

"బయట ఊర్లలో ఎక్కడైనా బంధువులెవరైనా ఉన్నారా నీకు?"

"చెన్నపట్నంలో అక్కయ్య, బావ ఉన్నారు సార్, మదనపల్లెలో తమ్ముడూ, మరదలూ ఉన్నారు, పడమటి కోనలో కూతురూ అల్లుడూ ఉన్నారు!"

"వెరీ గుడ్ ఈవాళ సాయంకాలము

## హమేషా... తమాషా...

### మూడు పువ్వులు-ఆరుకాయలు

రచయిత: మూడు నవల్లూరు కథలు
పబ్లిషర్: మూడు పుస్తకాలు, ఆరెడిషన్లు
మంత్రి: మూడు నోట్లు ఆరు ఓట్లు
టీచర్: మూడు పీరియడ్లు ఆరు సెలవులు
డాక్టర్: మూడు మాత్రలు, ఆరింజీషన్లు
లాయర్: ముగ్గురు క్లయింట్లు, ఆరు కేసులు
ప్రభుత్వోద్యోగి: మూడు ప్రమోషన్లు, ఆరింక్రిమెంట్లు
డ్రైవర్: మూడు ట్రిప్పులు, ఆరాక్సిడెంట్లు
త్రాగుబోతు: మూడు పెగ్గులు, ఆరు సీసాలు

- యు. యు. యు.. ఉరుకుందు

వెళ్లి నాంచారయ్యకు ఇలా చెప్పు....."

"ఎలా చెప్పాలి సార్?"

"నాంచారయ్యగారూ ఈనెల నేను మీకు వడ్డీ ఏడువందలా ఏభయి చెల్లించలేను. వచ్చే నెలనుండీ మదనపల్లెలో ఉన్న నా తమ్ముడు సహాయం చేస్తానన్నాడు. కాబట్టి పై నెల నుండీ నెలకు ఏడువందలా యాభై ప్రకారం వడ్డీ చెల్లిస్తాను. ఇక అసలు సంగతికి వస్తే....అసలు ఇంకో సంవత్సరం వరకూ ఇవ్వలేను" అని చెప్పి రావాలి.

సుందరయ్య గుటకలు మ్రింగుతూ అన్నాడు. "సార్! ఏడువందలా ఏభయి వడ్డీ చెల్లించాలంటే నేను......"

"వెళ్లి చెప్పినట్లు చెయ్యవయ్యా! నేను చెప్పినట్లే చెప్పి ఐదువందలు ఇచ్చేసి, తనేమంటాడో వచ్చి చెప్పు. నీవు అక్కడ అతనితో దీనంగా ఫోజు పెట్టి మరీ చెప్పాలి నేను చెప్పమన్న మాటలు....అ!"

"సార్! అంతవడ్డీ....నేను...." అంటూ తడబడ్డాడు సుందరయ్య.

"వెళ్లు....వెళ్లవయ్యా.....వెళ్లి చెప్పినట్లు చెయ్యి!" అంటూ కళ్ళు పెద్దవిచేసి కోపంగా చూసారు రాజారావుగారు.

"సరే సార్....మీరు చెప్పినట్లే చేస్తాను సార్....మళ్లీ వస్తాను సార్" అంటూ చేతులు జోడించి ఆయనకు ఓ నమస్కారం పెట్టి అక్కడ్నుండీ బయల్దేరాడు సుందరయ్య కాస్త కంగారుగా.

* * * *

సాయంకాలము ఐదు గంటలు కావస్తోండగా తమ ఇంటినుండీ బయల్దేరి గాంధీ చౌక్ కేసి నడుస్తున్న సుందరయ్య బుర్ర గందరగోళంగా తయారయింది.

నిజానికతడు ఉదయం నుండీ కూడా అశాంతిగానే ఉన్నాడు.

ఏదయినా సలహా ఇచ్చి దారి చూపి కాస్త వెసులుబాటు కలిగిస్తాడనే గంపెడాశతో వెళ్తే రాజారావుగారు అదేమీ చెయ్యకుండా, "నెలకు ఏడువందలా ఏభయి పై నెలనుండీ ఇస్తానూ" అని నాంచారయ్యకు చెప్పి రమ్మంటూ గదమాయించి కొండంత బరువు నెత్తినే ఉంచి పంపి వెయ్యడం సుందరయ్యకు నిరాశ కలిగించింది.

అన్యమనస్కంగా నడుస్తున్న అతని కాళ్లు అతనికి తెలియకుండానే అతని శరీరాన్ని నాంచారయ్య ఇంటికి కాకుండా శంకర్రావు ఇంటికేసి లాక్కుపోయాయి....

శంకర్రావు ఇంటి సమీపానికి చేరు

కున్న సుందరయ్య "సరే ఎటూ ఇంత దూరం వచ్చేసాము....శంకర్రావును పలకరించి వెల్దాము" అనుకుంటూ శంకర్రావు ఇంటికేసి నడిచాడు.

ఆ సమయానికి వరండాలో చుట్ట కాల్చుకుంటున్నాడు శంకర్రావు వాళ్ల బాబాయి.

"నీవు వచ్చింది శంకర్రావు కోసమేగా? తను పైన కూర్చుని ఉన్నాడు... ఒక్కడే...వెళ్లు!" అంటూ కళ్లు అరమోడ్పు చేసుకుని ఆనందంగా చుట్టపొగ లాగడంలో లీనమయ్యాడు.

"ఎవరి పిచ్చి వారికానందం" అనుకుంటూ మెట్లెక్కి పైకి చేరుకున్నాడు సుందరయ్య.

మిద్దెమీద నీరెండలో కూర్చుని పడమటి దిక్కుకేసి చూస్తున్నాడు శంకర్రావు.

"ఎండలో కూర్చుని ఇక్కడేం చేస్తున్నావు?" అంటూ సుందరయ్య అడిగే సరికి కొద్దిగా ఉలికిపడి ఇటు తిరిగిన శంకర్రావు మొదట పరాకుగానూ, ఆపై చిరాకుగానూ చూశాడు సుందరయ్యకేసి -

"ఈ సూర్యుడు ఎప్పుడు దిగిపోతాడా? అని చూస్తున్నాను!" అన్నాడు అరనిముషం తరువాత.

అతనికి ఆమధ్యనే పెళ్ళయింది! ఉమ్మడి కుటుంబం కాబట్టి పగటిపూట సరసాలూ, సరాగాలూ నిల్.....!

సుందరయ్య తలగోక్కుంటూ నిష్క్రమించబోతున్న లోకసాక్షి కేసీ, శంకర్రావు కేసీ మార్చి మార్చి చూశాడు. తరువాత అన్నాడు.

"పెళ్లి రాజారావుగార్ని కలువు. ఆయన దివ్యమైన సలహా ఇస్తాడు... అంటూ చెప్పావు. తీరా ఉదయం నేను ఆయన దగ్గరకు వెళ్లానా? ఆయనేమో నాంచారయ్య దగ్గరకు వెళ్ళి 'వచ్చేనెల నుండీ ప్రతినెలా ఏడువందలా ఏభయి ఇచ్చుకుంటాను' అని చెప్పి రమ్మంటున్నాడు."

వచ్చేనెలనుండీ నెలకు ఏడువందలా ఏభయి నాంచారయ్యకే ఇచ్చేస్తే నేనూ, నాభార్యా ప్రతిరోజూ ఈ సూర్యుడు ఎప్పుడు దిగిపోతాడా, ఎప్పుడు చీకటి పడ్తుందా అని కాచుకుని చీకటి పడ్డాక నుసుగులు కప్పుకుని వెళ్లి చెరో వీధినా అడుక్కుని అన్నం తెచ్చుకుని తినాలి లేదా కడుపుల మీద తడిగుడ్డలు వేసుకుని పడుకోవాలి. ఆ!" అన్నాడు గద్గదంగా.

"వచ్చేనెలనుండీ నెలకు ఏడువందలా



**'డి. డి.ల వల' రచయిత**

**శ్రీ టి.ఎస్.ఎ.కృష్ణమూర్తి**

**పరిచయం**

హాస్య నవలిక డి. డి.ల వల రచయిత శ్రీ టి. ఎస్. ఎ. కృష్ణమూర్తి అసలు పేరు శ్రీ తుడిమెళ్ల కృష్ణమూర్తి. స్వస్థలం మదనపల్లె. వీరు మదనపల్లె మునిసిపాలిటీలో ఓ చిన్న ఉద్యోగం చేస్తున్నారు. ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు వీరు సుపరిచితులే. వీరి మొట్ట మొదటి పెద్ద కథ "ఐ కెనాట్ ఫర్ గెట్ హర్" 1971 సం.లో ఆంధ్రపత్రిక వీక్లీలో ప్రచురింపబడింది. నిరంతర జీవన సంగ్రామంలో విరామ మెరుగని శ్రామికుడైనా దాదాపు వంద కథలు, పది పెద్దకథలు, మూడు నవలలూ వ్రాశారు. ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఐదు పెద్ద కథలు, అరు కథలు ప్రచురింపబడ్డాయి. ఇతర పత్రికలలోను వీరి రచనలు కొన్ని ప్రచురింపబడ్డాయి.

ఏభయి ఇస్తానంటూ చెప్పి రమ్మన్నారా నాంచారయ్యకు?"

"ఆ! అక్షరాలా చెప్పమన్నారు!"

శంకర్రావు ఎగిరి గంతేసినంత పని చేశాడు.

"సుందరయ్యా!"

"అయ్యా! బాబూ!!"

"నీ పంట పండుతుందయ్యా!"

"ఎలా? సూర్యుడు దిగి పోయేదాకా కాచుకు కూర్చుని" చీకటి పడ్డాక మునుగెట్టుకుని భిక్షాటన చేస్తేనా?"

"ఛట్! ఆగవయ్యా, అగు. అడుక్కుతిన్నా కూడు పుట్టని వాళ్లు ఈ దేశంలో ఎందరో ఉన్నారు. నీకేమిటి తీవరం?" వచ్చేనెలనుండీ ఏడువందలా ఏభయి ఇస్తాను" అని చెప్పిరమ్మన్నారంటే ఏదో పెద్ద లిటిగేషనే ఉండి తీర్తుంది తప్పకుండా. ఆ తిరకాసు మన లాంటి వారికి అర్థం కాదయ్యా తండ్రీ!"

"అర్థం అయేలోపు నేను అరిపోతాను బాబూ నెలకు ఏడువందలా ఏభయి నారపీచు నాంచారయ్యకు ఇచ్చుకుంటూ!"

"సుందరయ్యా!"

"బాబూ!"

"నేను సుగాత్రిని ప్రేమించి నప్పుడు ఏం జరిగిందో తెలుసా?"

"ఏం జరిగిందో నాకు తెలియదు బాబూ!"

నీవు సుగాత్రమ్మను పెండ్లి చేసుకోవడం మాత్రమే నాకు తెలుసు. నేను మీ పెళ్లికి వచ్చి పదహారు రూపాయలు చదివించి మరీ వచ్చానుగా?... పెళ్లి పందిట్లో జనాలు మరీ ఎక్కువగా ఉంటే భోజనం చేయకుండా వచ్చేశాను కూడా!

"సరి సరిలే! నీ షష్టిపూర్తప్పుడు నేను వచ్చి ముప్పయిరెండు రూపాయలు చదివించి మరీ భోజనం చెయ్యకుండా వచ్చేస్తాను కానీ నీకిది తెలుసా చెప్పు ముందు!"

"ఏది?"

"సుగాత్రిని నేను పెళ్లి చేసుకోవడమైతే నీకు తెలుసు కానీ దానివెనుక ఎంత చరిత్ర.. ఏది హిస్టరీ ఎంత ఉందీ, ఆ హిస్టరీలో రాజారావుగారి దయ, లిటిగేషనూ, తిరకాసూ ఎంతవున్నాయో నీకేమైనా తెలుసా?"

"నాకెలా తెలుస్తుందీ? నీవు చెప్పందే?!"

"అందుకే చెవుతున్నాగా విను.. వినూ! నేను సుగాత్రిని ప్రేమించాను. తనూ నన్ను ఇష్టపడిందనే గ్రహించాను ఆమె చూపుల్ని, చిరుదరహాసాల్ని చూసి.

అయితే నేను ఫలానా వాళ్ళ అమ్మాయిని చేసుకుంటాను వెళ్ళి మాట్లాడండి అంటే మావాళ్ళు ఒక్కరయినా తలవాల్చరే.

సుగాత్రి వాళ్లు పేదవాళ్లట. మా అంతస్థుకు తగరట. ఒక్కరూ నా ప్రేమను గ్రహించరే?! ఈ బోడి కొంప మేమందరం పంచుకుంటే మనిషికి నాలుగు ఇటుకలూ, ఒక వాసమూ, పిడికెడు సున్నపుపొడీ చొప్పున తప్ప ఏమీరాదే? అన్నా వినరే? మనకి "పొలం లేదా?" అంటారు. పొలం పంచుకున్నా తలకు అరుకు రెండడుగులైనా వస్తుందా అన్నదీ అనుమానమే! పైగా సుగాత్రి వాళ్ల నాన్న బోడి వాచ్

మన్ ఉద్యోగం చేస్తున్నాట్ట. అపాటికి ఇంత చదివిన నేను బోడి అటెండరు ఉద్యోగం కాక కలెక్టరు ఉద్యోగం ఏదో చేస్తున్నట్లు బడాయి."

"మా వాళ్లను ఒప్పించలేకా సుగాత్రిని మరచిపోలేకా నేను సతమతం అయిపోతూ ఉంటే అంకనాల అప్పారావు నాకు సలహా ఇచ్చాడు!" అంటూ ఆగాడు శంకర్రావు.

"ఏమని?" కుతూహలంగా అడిగాడు సుందరయ్య. తన బాధను తాత్కాలికంగా మరిచిపోయి.

"వెళ్లి రాజారావుగార్ని కలిసి సలహా అడగమని. నేను వెళ్లి ఆయన్ను సలహా అడిగాను. అంతా విని ఆయనేమన్నారో తెలుసా?"

"ఏమన్నారూ?"

"అబ్బాయ్! నీ దగ్గర డబ్బెంత ఉంది?" అని అడిగారు.

సలహా చెప్పడానికి ఫీజు క్రింద అడుగుతున్నారేమో ననుకుని నా వద్ద ఎంత ఉన్నదీ చెప్పాను.

"చాలదు!" అన్నారు.

"ఇంకెంత కావాలి?" అని అడిగాను మనసులో "ఈయన పెద్ద ఆశపోతులా వున్నారే" అనుకుంటూ.

"ఇంకో ఐదు వందలైనా ఉండాలి కనీసం!" అన్నారు.

"అయితే ఎక్కడైనా అప్పు పుచ్చుకుని రేపు తెచ్చి ఇస్తాను మీకు!" అన్నాను.

నేనా మాట అన్నానో లేదో అంత దాకా చచ్చినట్లు అయన కాళ్లవద్ద పడివున్న కుక్కలేచి భౌభౌమంది. ఆయన కూడా కళ్లెర్ర చేశారు.

"డబ్బు నాకెందుకోయ్ వెర్రిమొహమా?!" అంటూ ఇంటిలోపలికి వెళ్లి కాగితం ఒకటి తెచ్చి నాచేతిలో ఇచ్చి "నేను చెప్పినట్లు వ్రాయి" అన్నారు.

ప్రియమైన అమ్మా నాన్నలకు,
బాబాయిలకు మరియు అన్నయ్యలకు.....

నాకు జీవితం అంటేనే విరక్తి కలుగుతోంది. నాకు జీవించాలన్న ఆశ కూడా లేదు. అందుకే వెళ్లిపోతున్నాను. కని పెంచి పెద్దచేసిన మీ ఋణం, ఎంతో ప్రేమగా చూసుకున్న బాబాయిల ఋణం, చదివించిన అన్నయ్యల ఋణం తీర్చుకోకుండానే వెళ్లిపోతున్నందుకు నన్ను మన్నించండి. నన్ను గూర్చి వెతకకండి. నేను ఇక ఎవరికీ కన్పించను. నేనేమయినా తప్పులు చేసి ఉంటే నన్ను క్షమించండి.

**డి. డి.ల వల**

మీనుండి దూరం అవుతున్న
మీ వాడు
శంకర్రావు

అని వ్రాశాను ఆయనచెప్పినట్లుగానే.

"ఇహ వెళ్లవయ్యా!" అన్నారు.

"వెళ్ళి ఏం చేయనుసార్?" అన్నాను.

"వీలయినంత డబ్బు తీసుకుని రేపు రాత్రి ఈ కాగితం మీ ఇంట్లో వదిలి వెళ్లిపో!"

"ఎక్కడికి సార్?"

"హైదరాబాద్ వెళ్లిపో!"

"ఎందుకు సార్?" అన్నాను అయోమయంగా.

ఆయనకన్నా ముందుగా ఆయన కుక్క గుర్రుమంటూ నా మీదకు వచ్చింది.

"హుస్సేన్‌సాగర్‌లో దూకి చావడానికి.. వెళ్లు అంటే వెళ్లాలి..... అంతే అర్థం కానప్పుడు అడ్డదిడ్డమైన అరవ ప్రశ్నలూ వెయ్యకూడదు!" అంటూ కేకలేశారు.

"పాపం కుర్రాడు.. ఎందుకండీ అంతలా ఝుడిపించేస్తున్నారు!" అంది ఆయన కేకలకు ఇంట్లోంచి పరిగెత్తుకు వచ్చిన ఆయన భార్య.

## మీకు తెలుసా?

* బాల కళాకారుడుగా ప్రసిద్ధి పొందిన జూనియర్ మహమూద్ ఇప్పుడు డైరక్టర్ అయ్యాడు. తన సోదరులు సయ్యద్, కాలూ నిర్మిస్తున్న చిత్రం 'పాగల్ పన్'కి దర్శకుడు అయ్యాడు.
* నిర్మాత సలీం, దర్శకుడు రాజ్‌సిప్పీల గాటోమే చిత్రంలో ముగ్గురు కొత్త హీరోలు, నలుగురు కొత్త హీరోయిన్లు రంగప్రవేశం చేస్తున్నారు.
* 'హాప్‌కా అంత్' సినిమా షూటింగ్ సమయంలో, ఒక విలన్ పాత్రధారి మహావీర్ షాహ్ అడవిలో పరిగెడ్తూ 'పాపం-కాలు' విరుచుకున్నాడట.
* వినోద్‌పాండే నిర్మించిన సంచలనాత్మక చిత్రం 'సచ్' 1990లో 'సింగపూర్ ఫిల్మోత్సవ్'లో ప్రదర్శనకి తీసుకోబడింది.

- రాఘారకమం

"భయపడకు బాబూ.. ఆయనమాట మాత్రమే ఖరినంగా వుంటుంది. మనసు కాదు!" అంది నావైపు తిరిగి మళ్లీ తనే.

అప్పుడు ఆయన కొద్దిగా శాంతించి అన్నారు "చూడు నాయనా నాకు ఓపిక తక్కువ.. చెప్పింది చెయ్యి.... బాగు పడ్తావు... హైదరాబాద్ వెళ్లు.. నీ దగ్గర డబ్బులు అయిపోయి ఇబ్బందులు ఎదురైతే నాకు వ్రాయి... అంతే!"

చేసేది లేక తల ఊపి బయల్దేరాను.

"శెలవుపెట్టి వెళ్లు.... శెలవు పెట్టిన విషయం మీ వాళ్లకు తెలియకుండా ఉండేలా చెయ్యి వీలయితే!" అన్నారాయన వెనుక నుండీ.

అప్పుడనిపించింది ఏదో తిరకాసుందని.

ఝామ్మని జండా పీకేసి హైద్రాబాద్‌కు వెళ్లిపోయాను. కొద్ది రోజుల లోనే తీసుకు వెళ్లిన డబ్బులు అయిపోవడంతో రాజారావుగారికి ఉత్తరం వ్రాయాలనుకుంటూ పోస్టాఫీసుకు వెళుతోంటే యూనివర్శిటీ స్టూడెంట్సు నలుగురు కలిసి పట్టుకున్నారు నన్ను. వదలమంటే వదలరే!

డబ్బులు లేవంటే చందాలు వేసుకుని ఈ ఊరికి రైలు టిక్కెట్టు కొని నన్ను రైల్లో కూలేశారు.

"ఏమిటి ఈ దౌర్జన్యం?" అంటే, రైలు కదిలాక కిటికీలోంచి నా మొహాన కొట్టారు ఓ పేపరు.

ఆ న్యూస్ పేపర్లో చూద్దును కదా? నా ఫోటో ఉంది. "బాబూ శంకరా! అంతా నీ యిష్టప్రకారమే జరుగుతుంది ఇంటికి దారా బుజ్జీ" అని పెద్ద పెద్ద అక్షరాలతో వేసుంది ఫోటో క్రింద.

రైలు ఈ ఊరు చేరుకునే సరికి.....

శంకరయ్య చెప్తున్నది ఆసాంతం వినకుండానే సుందరయ్య లేచి బయల్దేరాడు ఉత్సాహంగా తల ఊపుతూ.

"సుందరయ్యా! ఎక్కడికి?" అని అడిగాడు శంకర్రావు ఆశ్చర్యపడిపోతూ.

"నాంచారయ్య దగ్గరకు! ఐదు వందల రూపాయలు ఎలాగైనా ఈనెలకు అప్పు చెప్పేసి, పైనెల నుండీ నెల నెలా ఏడు వందలా ఏభయిరూపాయలు ఇస్తానని చెప్పి రావడానికి!" అన్నాడు సుందరయ్య మెట్లు దిగుతూ.

"సుందరయ్యా, నాతో ఏదయినా మాట్లాడాలనుకుంటే ఈవాళ వచ్చినట్లే కాస్త పెందలాడే రావాలి. రాత్రి ఎనిమిది తరువాత ఎప్పుడూ రాకు సుమా!"

## ది గ్రాండ్ ఓల్డ్ మాన్



మన దేశంలోని పత్రికా సంపాదకులలో వయోవృద్ధుడు తుషార్ కాంతి ఘోష్. 1928 లో అమృతబజార్ పత్రిక సంపాదకుడిగా చేరిన శ్రీ ఘోష్ 61 సంవత్సరాలపాటు ఆ పదవీ బాధ్యతలను నిర్విఘ్నంగా కొనసాగించారట. మరి ఈయన పత్రికారంగానికే భీష్ముడనదగినవాడు కదూ!

అంటూ మిద్దెమీద నుండే కేకలు పెట్టి చెప్పాడు శంకర్రావు.

నాంచారయ్య ఇంటి ఇనుపగేటు తోసుకుని కాంపౌండులోకి ప్రవేశించి అయిదారు అడుగులు వేసిన సుందరయ్య పులిని చూసిన వాడిలా వెనక్కి పరిగెత్తుకు వచ్చి ఇవతలపడిగేటు మూసివేశాడు చెలాకీగా.

సుందరయ్య అంత వేగంగా వెనక్కి వెళ్లి తలుపును అంత హఠాత్తుగా మూసివెయ్యగలడని ఏ మాత్రం ఊహించలేక వేగంగా పరిగెత్తుకు వచ్చిన తోకలేని పెద్ద కుక్క తలతో గేటుకు ఢీకొట్టుకుని మొదట కుయ్యిమని ఆపై కోపంగా సుందరయ్యకేసి పెద్ద పెద్ద కళ్లతో కోపంగా చూస్తూ భయంకరంగా మొరగడం మొదలుపెట్టింది.

ఈ తంతంతా వరండాలో కాస్త చాటుగా కుర్చీలో కూర్చుని ఉన్న నాంచారయ్య బావమరిది పక్షుల పార్వతీశం చూస్తూనే ఉన్నాడు. తమ కుక్క ఇతరుల్ని తరిమి తరిమి భయభ్రాంతులను చేస్తోంటే చాటుగా చూడడం అతనికి చాలా ఇష్టం.

అయితే అతనికి నిరాశ కలిగిస్తూ గత అనుభవాలతో హుషారుపడ్డ సుందరయ్య అనుభవఙ్నుడిలా అంత చలాకీగా గేటు అవతలకి పారిపోయి మెరుపుకన్నా వేగంగా గేటు మూసుకోవడం పైగా తమ కుక్క వెళ్లి ఆ ఇనుప తలుపును ఢీకొట్టడంతో నిరుత్సాహపడిపోయాడు.

కాస్సేపు కుక్కను మొరగనిచ్చి తరువాత అప్పుడే ఇంట్లోంచి వచ్చిన వాడిలా బయటకు వచ్చి కుక్కను తీసుకు వెళ్లి గొలుసుతో కట్టివేశాడు.

అలోగా లోపలికి చేరుకున్న సుందరయ్య "బావగారున్నారా బాబూ?" అని అడిగాడు పార్వతీశాన్ని.

"ఆ! ఇప్పుడే పూజ గదిలోకి వెళ్లారు పదినిమిషాలు ఆగు....వస్తారు!" అనేసి ఇంట్లోకి వెళ్లిపోయాడు పార్వతీశం.

గొలుసు తెంచుకుని తనమీద పడడానికి విశ్వప్రయత్నాలు చేస్తున్న కుక్కను చూస్తూ "గొలుసు ఎక్కడ తెగిపోతుందోరా దేముడా!" అనుకుంటూ సుందరయ్య పాతిక నిముషాలు నిలబడ్డాకగానీ ఇంట్లోంచీ ఊడి పడలేదు నాంచారయ్య.

"ఏమిటి, మొత్తం తెచ్చేశావా?" అన్నాడు వచ్చి రావడంతోటే.

"లేదు బాబూ!"

"అయితే ఏడువందలా ఏభయి ఇచ్చి వెళ్లు... ఇప్పటికే వారంరోజులపాటు "పై వడ్డీ" నష్టపోయాను!" అన్నాడు విసుగ్గా.

"ఏడువందలా ఏభయి లేదయ్యా! అయిదు వందలే ఉంది....ఈ నెలకిదే దయచేసి తీసుకోండయ్యా! రేపు నెల నుండీ తప్పకుండా ఏడువందలా ఏభయి చొప్పున తెచ్చిస్తానయ్యా!"

"కుదరదయ్యా! అలా కుదరదని ఆరోజే చెప్పానుగా!! ఏడువందలా ఏభయి తెచ్చి ఇవ్వు....ఇంకా ఆలస్యం చేస్తే ఈ ఏడువందలా ఏభయికి కూడా పై వడ్డీ చెల్లించాల్సి వస్తుంది నీవు!"

"కొంచెం కనికరించాలయ్యా! ఈనెల ఏడువందలా ఏభయి ఈలేను. వచ్చేనెల నుండీ ప్రతినెలా మదనపల్లెలో ఉన్న నా తమ్ముడూ, మరదలూ సహాయం పంపుతామన్నారు.... పై నెలనుండీ ఖచ్చితంగా నెలకు ఏడువందలా ఏభయి కడ్తానయ్యా!"

"నారపీచువాళ్లు వడ్డీతోసెయ్యరయ్యా..."

"ఈ నెలకు కాస్త కనికరించాలి బాబయ్యా! చచ్చి మీ కడుపున పుడ్తాను!"

సుందరయ్య అలా అనగానే నాంచారయ్య పక్కలో బాంబు పడ్డట్టు అదిరిపడ్డాడు.

"ఇదిగో సుందరయ్యా అలాంటి మాటలంటే నేను ఊరుకునేది లేదు. నీవు ఛస్తే నాకు నా డబ్బెవరు కడ్తారయ్యా? అధవా నా బాకీ తీర్చాక చచ్చినా....మరే సన్నాసోడి కడుపునో పుట్టు....అంతేకానీ నా కడుపున మాత్రం పుట్టద్దు! ఆ!! నా కడుపున పుట్టబోయేవాడు ఎంతటి పుణ్యాత్ముడు అయివుంటాడో తెలుసా? వాడి కోసం ఎన్ని పూజలు....ఎన్ని వ్రతాలు....ఏమేం చేస్తున్నామో నీకేం తెలుసు?"

"అలాగే బాబయ్యా! మీ బాకీ పూర్తి చెల్లించేంతవరకూ నేను చచ్చినా చావను. చచ్చినా మీ కడుపున మాత్రం పొరపాటున కూడా పుట్టను. ఈనెలకు మాత్రం ఈ అయిదు వందలు పుచ్చుకోండయ్యా కనికరించి!" అంటూ అయిదు వందల రూపాయల కాగితాలు అందించాడు సుందరయ్య.

నారపీచువాళ్ల వంశంలోనే కనికరం అనేది లేదు. కనికరం ఉంటే ఈ వ్యాపారం ఎలా చేస్తాము? అయినా నీ ఏడుపు చూడలేక తీసుకుంటున్నాను!" అంటూ అయిష్టంగా తీసుకున్నాడు నాంచారయ్య ఆ అయిదు వందల రూపాయలు.

"అయ్యా! ఇంకో సంవత్సరం వరకూ అసలు చెల్లించలేను, మీరు చెప్పినట్లు ప్రతి నెలా ఏడువందలా ఏభయి చొప్పున వడ్డీ మాత్రం చెల్లించగలను!" అన్నాడు సుందరయ్య రాజారావుగారి మాటల్ని మననం చేసుకుని అర్జంటుగా దీనంగా ఫోజుపెట్టి.

సంవత్సరంపాటు అతని డబ్బుమీద పదిహేను శాతం ఢోకాలేకుండా వడ్డీ రాబోతున్నందుకు మనసులో చాలా సంతోషించాడు నాంచారయ్య.

"నెలకు ఏడువందలా ఏభయి చొప్పున సంవత్సరం రోజులు మాత్రమే పుచ్చుకుంటాను. ఆపై అసలు ఇచ్చేయాలి. లేదంటే వేరే ప్రాంసరీ నోటు వ్రాసి ఇవ్వాలి..... వడ్డీ రేటుకూడా మారుతుంది...ఆ!" అన్నాడు ఖచ్చితంగా...తన సంతోషాన్ని ఏమాత్రం పైకి కన్పించనీయకుండా.

గుండెల నిండుగా గుబులు కమ్ముకున్నా మౌనంగా తలవూపి అక్క

డ్నుండీ బయల్దేరాడు సుందరయ్య కాళ్ళీ డ్చుకుంటూ.

* * *

సాయంకాలం ఏడుగంటలు దాటింది. రామాలయానికి వెళ్లిన రాజారావు గారు తిరిగి వచ్చేసరికి వరండాలో బెంచీ మీద కూర్చుని ఉండిన సుందరయ్య లేచి నిలబడి నమస్కారం చేశాడు.

"చూడు సుందరయ్యా అలా పదే పదే వందనాలు చెయ్యకు....నాకు ఇబ్బం దిగా ఉంటుంది! ఇంతకూ వెళ్లి వచ్చావా నాంచారయ్య వద్దకు?" అన్నారు రాజారా వుగారు వరండా గోడమీద కూర్చుంటూ.

"వెళ్లాను సార్! ఈనెల తాల్హాకు వడ్డీ ఐదువందలు తీసుకోలేదు మొదట. అడుక్కుని, బ్రతిమలాడి రేపు నెలనుండీ ఏడువందలా ఏభయి చొప్పున తెచ్చి ఇస్తానని చెప్పాక తీసుకున్నాడు సార్ ఆయన!"

"మదనపల్లెలో ఉన్న నీ తమ్ముడు సహాయం చేస్తాడని చెప్పావా లేదా?"

"చెప్పాను సార్! నా తమ్ముడూ, మరదలూ ఇద్దరూ సహాయం చేస్తారని చెప్పాను."

"వెరీగుడ్, రేపు నెల జీతం అందుకో గానే రా! ఏం చెయ్యాల్సిందీ చెవుతాను!"

"సార్ వడ్డీ....ఏడువందలా ఏభయి....?

"ఇవ్వాల్సిందేనయ్యా....నీవూ, నీ భార్యా తింటారో వస్తువులు వడుకుంటారో నా కనవసరం....నేను చెప్పేవరకూ, నేను చెప్పిన రీతిలో నారపీచు నాంచారయ్యకు వడ్డీ చెల్లించాల్సిందే!" అన్నారు రాజారా వుగారు.

సుందరయ్య అయోమయంగా చూశాడ ఆయన కేసి. "తిక్క కుదిరిందిగానీ రోకలి తలకుచుట్టు!" అన్నట్లుగా అన్పించింది అతనికి మళ్లీ. కానీ శంకరయ్య ప్రేమ వ్యవహారంలో రాజారావుగారి పాత్ర జ్ఞాపకం వచ్చి మళ్లీ కొంత ధైర్యం కూడా కలి గింది.

అతని ముఖంలో, మారుతున్న రంగుల్ని చూస్తున్న రాజారావుగారికి సుందరయ్య మీద చాలా జాలి కలిగింది.

"సుందరయ్యా! పది రోజులపాటు వదలకుండా ముసురు పట్టినప్పుడు ఏమ నిపిస్తుంది?" అని అడిగారు కొద్దిగా నవ్వి.

"ఈ ముసురు వదుల్తుందా? ఇహ ఎండ అనేది కన్పిస్తుందా? - అని అన్పి స్తుంది సార్!"

"ఎన్ని మబ్బులు కమ్మినా ఆ మబ్బుల వెనుక ఎక్కడో సూర్యుడు ప్రకాశిస్తూనే ఉంటాడు కదా?"

"నిజమే సార్!"

"కాబట్టి భయవడకు....ఇంటికి వెళ్లి అన్నం తిని నిశ్చింతగా నిద్రపో!" అన్నారు అనునయంగా.

అలా అంటున్న రాజారావుగారి కళ్ల లోకి చూసేసరికి పూర్తిగా ధైర్యం కలిగిన సుందరయ్య బయలుదేరాడు.

* * *

రోజులు లెక్క పెట్టుకుని ప్రతినెలా ఠంచనుగా జీతం పుచ్చుకునే ప్రతి ఉద్యోగ స్తుడూ అదృష్టవంతుడే అని అనుకోవడం సబబు కాదు. జీతం అందుకోవడా నికి భయవడే ఉద్యోగస్తులూ ఉన్నారు ఈ దేశంలో చాలామంది.

జీతం అందుకున్న సుందరయ్య ఇంటికి వెళ్ళకుండా నేరుగా రాజారావుగారి వద్దకే వెళ్లాడు.

"జీతం తెచ్చావా సుందరయ్యా?" అని నవ్వుతూ అడిగారాయన....

"తెచ్చానుసార్!"

"వెరీగుడ్! మదనపల్లెకు చార్జీ ఎంత?"

"పదకొండు రూపాయల్సార్!"

"సరే రేపు శెలవుపెట్టి మదనపల్లెకు వెళ్లి అక్కడి బ్యాంకులో...స్టేటు బ్యాంకు లోకానీ లేదా ఆంధ్రా బ్యాంకులో కానీ....



ఏదో ఒక బ్యాంకులో నీ పేరిట.... నాంచారయ్య పేరిట కాదుసుమా....నీ పేరిట ఏడువందలా ఏభయి రూపాయ లకు బ్యాంకర్స్ డి. డి. తీసుకురావాలి.

డి. డి. తీసుకుని తిరిగి వచ్చేటప్పుడు పుంగనూరు దగ్గరగా భీమగానిపల్లె అనే పల్లెటూరు ఉంది...అక్కడ దిగిపోయి ఆ ఊర్లో బాగారెడ్డి అనే కుర్రవాడుంటాడు వాడ్ని కలిసి రావాలి."

"సరే సార్! అలాగే చేస్తాను సార్!"

"వెరీగుడ్ ఒక్క నిముషం ఆగు బాగా రెడ్డికి ఓ ఉత్తరం వ్రాసి ఇస్తాను" అంటూ ఇంట్లోకి వెళ్లి పదినిముషాల తరువాత ఓ కవరు తెచ్చి ఇచ్చారు ఆయన.

కవరుమీద చిరంజీవి బాగారెడ్డికి, భీమ గానిపల్లె అని వ్రాసిఉంది.

"మదనపల్లెలో పని ముగించుకుని వచ్చేటప్పుడు తిరుగు ప్రయాణంలో భీమ గాని పల్లె స్టాపింగులో దిగు. పల్లెలోకి వెళ్లి ఈ చీటీ బాగారెడ్డికి ఇవ్వు. అతనేం చెప్తాడో తెలుసుకుని రా!" అన్నారు రాజారావుగారు.

* * *

రాకరాక వచ్చిన అన్నను చూసి ఆనం దపడిపోయాడు సుందరయ్య తమ్ముడు సప గాల సంపత్‌కుమార్ కుశలప్రశ్నలూ, మంచి చెడ్డలూ మాట్లాడు కున్నాక తన పేరిట ఏడు వందలా ఏభయి రూపాయలకు బ్యాంకర్స్ డి.డి. కావాలని చెప్పాడు సుందరయ్య.

ఆ డి.డి. ఎందుకో ఏమిటో చెప్ప కపోవడం వల్ల అయోమయంలో పడ్డాడు సంపత్. అయినా తన అన్నను అడ్డదిడ్డ మైన ప్రశ్నలూ వేసి వేధించకుండా డబ్బు పుచ్చుకుని తనే బ్యాంకుకు వెళ్లాడు డి.డి. తీసుకు రావడానికి.

తమ్ముడికి నలుగురు పిల్లలు, సి.టి.యం ప్రెస్సింగ్ మిల్లులో గుమాస్తా ఉద్యోగం. వచ్చే జీతంతో సంసారం లాక్కు వెళ్తు న్నాడు గుట్టుగా. తన బాధలన్నీ ఏకరు పెడితే తమ్ముడూ, మరదలూ కూడా తనను గురించి ఆలోచిస్తూ బుర్రలు పాడు చేసుకుంటారని తెలుసు. ప్రశాంతంగా ఉన్న వాళ్లకు అశాంతి కలిగించడం ఎందుకు అమ్మని తన సంగతులేవీ చెప్పలేదు సుంద రయ్య.

మరదలూ, పిల్లలూ కొసరి కొసరి వడ్డించిన భోజనాన్ని తృప్తిగా తిని దేముడి గదిలో చాపపరచుకుని కాస్సేపు నడుం వాల్చాడు సుందరయ్య. ఓ కునుకుతీసి లేచేసరికి తమ్ముడు డి.డి. తీసుకుని వచ్చే శాడు.

తమ్ముడు, మరదలు, పిల్లలు ఎంతగా బ్రతిమిలాడినా ఆగకుండా "ఇంకోసారి భార్యతోపాటు వస్తానంటూ" డి.డి. తీసు కుని బయల్దేరేశాడు సుందరయ్య. సాధ్య మైనంత త్వరగా భీమగానిపల్లెకు వెళ్ళి రాజా రావుగారి ఉత్తరాన్ని బాగారెడ్డికి అందచేసి అక్కడ్నుండీ వీలయినంత త్వరగా బయ టపడి తన ఊరి బస్ ఎక్కేయాలి అనే ఆలోచనలో ఉన్నాడు అతను.

ఇక చేసేది లేక అతని తమ్ముడు అతన్ని సైకిల్లో కూర్చోబెట్టుకుని సివిల్ బస్టాండ్‌కు తీసుకువచ్చి పుంగనూరు వెళ్లే ప్యాసింజరు బస్సులో కూర్చోబెట్టాడు.

* * * * * *

భీమగానిపల్లె బస్టాపులో సుందరయ్య బస్ దిగేసరికి సాయంకాలము నాలుగు గంటలు కావస్తోంది. బస్ దిగగానే రోడ్డుకు కొంత దూరంలో నిలబడి రోడ్డుమీద వెళ్తున్న వాహనాలపై రాళ్లు విసురుతున్న ఇద్దరు కుర్రవాళ్లు కన్పించారు అతనికి.

సుందరయ్య నేరుగా ఆ కుర్రవాళ్ల దగ్గరకే వెళ్లాడు.

"నాయనలారా, మీరు లారీల మీదకు రాళ్లు విసిర్తే విసిరారు కానీ... లారీల వాళ్లెవరైనా లారీలు నిలిపి వచ్చి మీకు దేహశుద్ధి చేసేలోపే నాకు కాస్త బాగారె డ్డిగారి ఇల్లు చూపిస్తారా?" అని అడిగాడు దగ్గరలోనే కన్పిస్తున్న హాడ్కో గృహాలను చూస్తూ.

సుందరయ్య మాట్లాడిందేమిటో ఆ కుర్రాళ్లకు సరిగ్గా అర్థం కాలేదు కానీ అతను బాగారెడ్డి ఇంటికి వెళ్లాలని సూత్రం గ్రహించారు.



“బాగారెడ్డెన్న వాళ్ల ఇల్లు పాత ఊళ్లో... ఇక్కడకాదు. ఇట్లే నేరుగా పోతే ఆ చింతచెట్ల ఎనుక పాతూరు వస్తుంది. గుడిముందర కోనేటి దగ్గరకు పోయి ఎవు ర్నడిగినా సూపిత్తారు!” అన్నాడు ఒక కుర్రవాడు.

సుందరయ్య తల ఊపి మట్టిరోడ్డు మీద అడుగులు వెయ్యడం మొదలు పెట్టాడు. పల్లెలోని శివాలయం వద్దకు చేరు కునేశాడు.

శివాలయం ముందున్న కోనేటిలో దాహం తీర్చుకుని కోనేటి గట్టున మండ వంలో కూర్చున్న వాళ్ళనడిగి బాగారెడ్డి ఇల్లు తెలుసుకుని ఆ ఇంటికి వెళ్లి బాగారె డ్డిని కలిసి రాజారావుగారిచ్చిన కవరు అతనికి అందించాడు సుందరయ్య.

బాగారెడ్డి పాతికేళ్ల యువకుడు.

“ఒద్దుమొర్రో” అన్నా వినకుండా సుందరయ్యకు భోజనం పెట్టించాడు. అన్నం తిన్న తరువాత అరగంట అయినా కాకముందే చిక్కటి కాఫీ తెచ్చి ఇచ్చింది అతని తల్లి మల్లి.

“వడ్లు తీసుకు వెళ్తారా? లేక ఆడించి బియ్యం చేసి తీసుకువెళ్తారా?” అని అడి గాడు బాగారెడ్డి కాఫీ త్రాగుతున్న సుంద రయ్యను.

అతడు అడుగుతున్న దేమిటో అర్థం కాక కాఫీ పొలమారింది సుందరయ్యకు.

“వడ్లేమిటి? బియ్యమేమిటి?” అని అడిగాడు అర్థంకాక.

“అయితే మా గురువుగారు మీకేమీ చెప్పలేదన్నమాట. నాకు వ్రాసిన ఉత్త రంలో మీకు ఆరుబస్తాల ఒడ్లు ఇచ్చి పంప మనీ ఓ సంవత్సరం తరువాత ఆ ఒడ్ల

# డి. డి.ల వల

తాలూకు డబ్బు ఆరు దఫాలుగా చెల్లిస్తా రనీ వ్రాశారు. మీరు ఆరుబస్తాల ఒడ్లు తీసుకువెళ్లడం శ్రమతో కూడుకున్న పని కదా? బస్టాపు ప్రక్కనే మిషను ఉంది. ఆడించి బియ్యం ఇస్తాము తీసుకువెళ్లండి. మీకు కాస్త ఇబ్బంది తగ్గుతుంది. తవుడు మా పశువులకు పెట్టడానికి పనికివస్తుంది!” అన్నాడు బాగారెడ్డి.

“ఆపద్బాంధవా, అనాథరక్షకా!” అను కున్నాడు మనసులో సుందరయ్య.

“మీ యిష్టం.... మీ యిష్టం!” అన్నాడు ఉక్కిరిబిక్కిరి అయిపోతూ బాగా రెడ్డితో!

* * * * * * *

“సార్, మీరు దేముల్లు సార్!” అన్నాడు సుందరయ్య చేతులు జోడించి.

“నేనింకా బ్రతికే ఉన్నానయ్యా... అప్పుడే నన్ను దేముడ్ని చేసేస్తున్నావు. అలా చేతులెత్తి ఊరకే మొక్కకు... నాకు దురద పెట్టినట్లవుతుంది” అన్నారు రాజారావుగారు విసుగ్గా.

“సరేసార్! చచ్చినా దండాలు పెట్టను ఇకపై!” అంటూ జోడించిన చేతులు విడదీసి వెనక్కి కట్టుకున్నాడు సుందరయ్య.

“డి.డి. తెచ్చావా?”

“తెచ్చాను సార్!”

“భీమగానిపల్లెలో నా శిష్యుడ్ని కలి శావా?”

“కలిశాను సార్! కడుపు నిండా చక్కటి భోజనం పెట్టించారు. కళ్లారా ఆ ఊరి భీమేశ్వరాలయంలోని భీమేశ్వ రుడ్నీ, అమ్మవార్నీ చూపించి నాపేరిట అర్చన కూడా చేయించారు.

ఆయన మనుషులే ఎడ్లబండిలో ఆరు పెద్దబస్తాల పాత నంబరు ఒడ్లు వేసుకు వచ్చి మెయిన్‌రోడ్డులోని మరలో ఆడించి బియ్యం బస్తాలనూ, నన్నూ ఈ ఊరిమీ దుగా మెడ్రాసు వెళ్లే లారీ ఆపి దానిమీదకు ఎక్కించి పంపించారు సార్!” అన్నాడు ఉత్సాహంగా సుందరయ్య.

“ఇంకా?”

“ఆరుమూటల వడ్లూ పండ్రెండు వందల రూపాయలట సార్ నాకిప్పబడ్డ రేటు. ఒక సంవత్సరం రోజులు గడిచి పోయాక నెలకు వందరూపాయల చొప్పున పండ్రెడు నెలలుగా యం.ఓ. ద్వారా పంపినా చాలన్నారు సార్ బాగారెడ్డి. లారీ లగేజి కూడా వాళ్ల మనుషులే ఇచ్చారు సార్!”

“బాగారెడ్డి చాలా మంచివాడు! వచ్చే సంవత్సరం తను చెప్పినట్లే నెలకి వంద రూపాయల చొప్పున అతనికి పంపుదువు కానీ, డి.డి. ఏదీ?”

రాజారావుగారు అలా అడగగానే జేబు లోంచి డి.డి. తీసి అందించాడు సుంద రయ్య. దాన్ని పరిశీలించి సంతృప్తిగా తల ఆడించారు రాజారావుగారు.

“ఇప్పుడు నేను చెప్పేది జాగ్రత్తగా విను సుందరయ్యా! ఈ డి.డి. వెనుక నువ్వు సంతకం చెయ్యి. తరువాత తీసుకువెళ్లి నాంచారయ్యకు ఇవ్వు. “అయ్యా, నా తమ్ముడు డి.డి. పంపించాడు మదనపల్లె నుండీ నేను బ్యాంకుకు వెళ్లి డబ్బు అడి గితే అక్కవుంటు లేనిదే డబ్బు ఇవ్వము” అన్నారు. నాకు ఎక్కడా బ్యాంకు అక్క వుంటు లేదు. ఈ డి.డి.ని మీ అక్కవుం టుకే జమ చేసుకోండి అని చెప్పి అతనికి ఈ డి.డి. ఇచ్చేసి వచ్చెయ్యి.

ఇది బ్యాంకర్సు డి.డి. కాబట్టి అత నికి అతని అక్కవుంటులో డ్రా చెయ్యడం కష్టం. అతడు మళ్ళీ నిన్ను పిలిపిస్తాడు. లేదా తనే వస్తాడు. అప్పుడు ఈ డి.డి.ని నీవే తీసుకుని నీ పేరిట ఏదో ఒక బ్యాంకులో అక్కవుంట్ ఓపెన్‌చేసి అందులో దీన్ని వెయ్యి. కానీ డబ్బు మాత్రం డ్రా చెయ్యకు. తరువాత సంగతి నేను చెపుతాను.. అర్థం అయిందా?” అన్నారు ఆయన.

అర్థం అయింది అన్నట్లుగా తల ఊపాడు కానీ నిజానికి సుందరయ్యకు సుదీ



ర్థంగా రాజారావుగారు చెప్పినది ఏ మాత్రం విశదంగా అర్థం కాలేదు.

"మీ సహాయాన్ని జన్మజన్మలకూ మరచిపోలేను సార్!" అంటూ సెలవు తీసుకున్నాడు సుందరయ్య.

* * * * * *

ఆ మరునాటి ఉదయాన్నే సుందరయ్య డి.డి.ని తీసుకు వెళ్లి నాంచారయ్యకు ఇవ్వడమూ, సాయంకాలము నాంచారయ్య బావమరిది పి. పార్వతీశం డి.డి.ని తీసుకువచ్చి సుందరయ్యకు వాపసు ఇవ్వడమూ జరిగిపోయాయి.

ఆ తరువాతిరోజు సమితి ఆఫీసులో జూనియర్ అసిస్టెంట్‌గా పనిచేసే కప్పల కరుణాకరన్ ఇంట్రడ్యూస్ చెయ్యడంతో సుందరయ్య పేరిట ఖాతా ఓపెన్ అయింది స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో.

తన ఖాతాలో డి.డి.ని జమచేసిన తరువాత బ్యాంకు వాళ్లిచ్చిన సరికొత్త పాస్‌బుక్కును అపురూపంగా జేబులో ఉంచుకుని ఆఫీసుకేసి నడిచాడు సుందరయ్య విమానం ఎక్కిన వాడిలా ఆనందపడిపోతూ.

*** *** ***

నాలుగు రోజులు గడిచాక ఓ సాయంకాలము చాలా ఎక్సయిటెడ్‌గా పరిగెత్తుకు వచ్చాడు సుందరయ్య. నల్లబడ్డ అతని ముఖమూ, అతని హడావిడీ చూసి రాజారావుగారూ, శ్రీలక్ష్మమ్మగారూ, జాలీ కూడా కంగారు పడిపోయారు!

"సార్ నాంచారయ్య నానా మాటలూ అంటున్నాడుసార్! నా పేరిట బ్యాంకు అక్కౌంట్లో వేసిన డి.డి. డబ్బు డ్రాచేసి ఏడువందలా ఏభయి ఆయనకు ఇచ్చేస్తాను సార్ రేపు!" అన్నాడు ఆవేశంగా.

"ఆత్రపడకు సుందరయ్యా! 'నిదానమే ప్రధానము' అన్నారు పెద్దలు. నీవు డబ్బు డ్రాచేసి డబ్బురూపంలో వడ్డీ చెల్లించి వేస్తే ఏమవుతుందో తెలుసా?" అన్నారు రాజారావుగారు.

"ఏమవుతుంది సార్?"

"తీరా వెన్నపడేటప్పుడు బాన పగిలి పోయినట్లవుంది.. కాబట్టి ఆత్రపడకు!"

"ఆత్రపడకపోతే ఎలాసార్, నాంచారయ్య ఓ వైపు, పార్వతీశం ఒకవైపు నన్ను ఊపిరి తీసుకోనీయడం లేదు. 'నిదానమే ప్రధానం' అన్న పెద్దలే 'ఆలస్యం అమృతం విషం' అని కూడా అన్నారు సార్!" అన్నాడు సుందరయ్య ఆక్రోశంగా.

## వ్యోమగమనంలో బాలలకు శిక్షణ



మాస్కోలోని కాస్మో సెంటర్‌లో పిల్లలకు వ్యోమగమనంలో శిక్షణ నిస్తారట. రోదసిలో ఎలా ప్రయాణించాలి, ఇబ్బందులు ఎదురైతే ఎలా తట్టుకోవాలి అన్న విషయాలపై ఈ సంస్థలో శిక్షణ యిస్తారు. పిల్లలకు యిటువంటి వాటిలో శిక్షణనివ్వటం ఎంతైనా మెచ్చుకోదగినదే!

రాజారావుగారు నవ్వారు సుందరయ్య బాధ చూసి.

"ఆ పెద్దలే మళ్లీ 'నిదానించిన గొడ్డు తేటనీరు త్రాగుతుంద'ని కూడా అన్నారు లేవయ్యా! వడ్డీ సకాలంలో అందుకోలేని వడ్డీ వ్యాపారి ఆకలితో ఉన్న చిరుతపులిలా ఉంటాడని నాకు తెలుసు సుందరయ్యా! అయితే ఒక విషయం చెప్పనా? ఇనుము బాగా వేడెక్కి ఎర్రబడ్డప్పుడే మనకు అనుకూలంగా వంచుకోవాలి. దానికి తగిన సమయం ఇప్పుడు ఆసన్నమయింది.

నీవు వెంటనే నేరుగా నాంచారయ్య దగ్గరకు వెళ్లు.. వెళ్లి " అయ్యా! ఈ డి.డి.లూ గొడవలూ నేనెప్పుడూ చూసిన వాణ్నికాను. మా తమ్ముడ్ని బాగా చీవాట్లు పెడ్తూ ఉత్తరం వ్రాశాను మొన్ననే. వాడు ఇప్పుడే ఊరినుండి వచ్చాడు. డి.డి. మారలేదంటే మీ పేరు, మీ బ్యాంకు అక్కౌంటు నెంబరూ వ్రాయించుకుని రమ్మన్నాడు. రేపే నేరుగా మీ అక్కౌంట్ లోనే డబ్బు జమ అయ్యేలా అదేదో బ్యాంకు ట్రాన్స్‌ఫర్ చేయించి ఇస్తానన్నాడు. మీ అక్కౌంట్ నంబరు వ్రాసి ఇవ్వండయ్యా... రేపే మీ డబ్బు మీ ఖాతాలో చేరిపోయేలా చేస్తాడట నా తమ్ముడు అని చెప్పు. నాంచారయ్య ఏమంటాడో చూద్దాం!" అన్నారు రాజారావుగారు.

అయోమయంగా తల ఊపిన సుందరయ్య వాలకం చూసి తను చెప్పినది ఒక్కముక్క కూడా అతనికి అర్థం కాలేదని గ్రహించిన ఆయన తను చెప్పిందే మరో రెండు మార్లు రిపీట్ చేశారు.

రాజారావుగారు చెప్పింది బుర్రకెక్కించుకుని తల ఊపి వెళ్లిన సుందరయ్య పాతిక నిముషాలలోనే తిరిగి వచ్చాడు చేతిలో ఓ కాగితం ముక్కపట్టుకుని.

అతడు తెచ్చిన కాగితం మీద నారపేచు నాంచారయ్య, సేవింగ్స్ బ్యాంక్ అక్కౌంట్ నంబరు వెయ్యిన్నీ నాలుగు వందలా ముప్పయి ఏడు, స్టేటు బ్యాంకు ఆఫ్ ఇండియా అని వ్రాయబడి ఉంది.

"ఏమన్నాడు నాంచారయ్య?"

"ఏదో ఒకటి తగలెట్టు. రేపు నాకు డబ్బయినా రావాలి లేదా నా అక్కౌంట్‌లో అయినా జమపడాలి. లేదా బావుండదు వ్యవహారం" అని గొణుగుతూ నెంబరు వ్రాసి ఇచ్చాడు సార్!"

యుద్ధంలో మొదటి శత్రువును చంపిన వ్యక్తిలా నవ్వారు రాజారావుగారు కాస్త ఆనందంగా.

"నీవు చాలా అదృష్టవంతుడివి సుందరయ్యా, నాంచారయ్య బ్యాంకు ఖాతా నెంబరు ఇంత తేలికగా మనకు లభిస్తుందని అనుకోలేదు నేను."

రేపు నీ పేరిట ఉన్న ఏడువందలా ఏభయి రూపాయలు డ్రా చేసి నాంచారయ్య పేరిట బ్యాంక్ ఖాతా నెంబరుతో సహా బ్యాంకర్స్ డి.డి. తీసి తీసుకు వెళ్లి అతనికి ఇవ్వు. డి. డి. అప్లికేషన్ కౌంటర్ ఫాయిల్ మీద బ్యాంకర్స్ డి.డి. నెంబరు మరచిపోకుండా వ్రాసుకోవాలి సుమా!

కౌంటర్ ఫాయిల్ భద్రంగా దాచుకుని రేపు సాయంకాలము ఇటువేపు వచ్చినప్పుడు నాకు చూపించాలి!

తలగోక్కుంటున్న సుందరయ్యను చూసి కాస్త విసుక్కున్నా తను చెప్పిందే మరోసారి చెప్పారు మళ్లీ రాజారావుగారు ఓపికగా.

***

తమ ఇంటివైపే వస్తున్న సుందర

## రామాయణ-భారతాలు

సుప్రసిద్ధ రచయితలు పరుచూరి బ్రదర్స్‌లో ఒకరైన పరుచూరి గోపాలకృష్ణ ఆగస్టు 1వ తేదీన మద్రాసు నుండి విమానంలో హైద్రాబాద్ వెళ్లడం కోసం తెల్లవారు ఝామ 4-30 గంటలకు తమ సొంత ఫ్లాట్ నుండి మీనంబాక్కం ఏర్‌పోర్టుకు బయలుదేరారు. అప్పుడు రెండే రెండు నిముషాలు ఇంటర్వ్యూ చేయడానికి వీలేర్పడింది. "ఈ మధ్య మా అన్నదమ్ముల గురించి- కొన్ని పత్రికల్లో తప్పుగా వివరణ యివ్వడం జరిగింది అంటూ-"నిజజీవితంలో మేము రామలక్ష్మణుల్లాంటి అన్నదమ్ములం. సినీ జీవితంలో మాత్రం అన్నయ్య ధర్మరాజు అయితే-నేను భీమసేనుడ్ని' అన్నారు- శ్రీ గోపాలకృష్ణ! రెండు నిముషాలు గడిచింది. ఇంటర్వ్యూ ముగిసింది. కారు ఏర్‌పోర్టుకు బయల్దేరింది.

య్యను దూరం నుండే చూసేశాడు పక్షుల పార్వతీశం.

"వడ్డీ తెచ్చావా?" అని గాండ్రించినట్లుగా అడుగుతూ ముందుకు దూసుకుపోయాడు.

"తెచ్చానయ్యా!" అంటూ జేబులోంచి డి.డి. తీసి అందించాడు సుందరయ్య.

"మళ్లీ డి.డి.నే తెచ్చావా?" అన్నాడు కోపంగా.

"అవునయ్యా! నా పేరిట వచ్చిన డి.డి.ని మీ బావగారి పేరిట మార్పించి ఇచ్చాడు మా తమ్ముడు" అన్నాడు సుందరయ్య తడుముకోకుండా.

డి.డి.ని పరిశీలించిన పార్వతీశం డి.డి. తన బావగారిపేరిట బ్యాంకు అక్కవుంట్ నంబరుతో సహా ఉండడంతో ఏమనాలో తోచక మౌనంగా ఉండిపోయాడు.

***

ఆ రోజు సాయంకాలము సుందరయ్య డి.డి. అప్లికేషన్ కౌంటర్ ఫాయిల్ తెచ్చి చూపించగానే సంతృప్తి పడ్డారు రాజారావుగారు.

"డి.డి. ఇచ్చేశావా?" అని అడిగారు.

"నాంచారయ్య లేరుసార్! ఆయన బావమరిది పార్వతీశం దగ్గర ఇచ్చి వచ్చాను ఉదయమే.. అంటే డి.డి. తీసుకోగానే!"

"మళ్లీ వాళ్లెవరూ నీ దగ్గరకు రాలేదు కదా?"

"రాలేద్సార్!"

"వెరీగుడ్... వెరీ గుడ్, ఒక్క అడుగు ముందుకు వచ్చాము మనం. అలా కూర్చో.. ఇప్పుడు కొన్ని వివరాలు కావాలి. కూర్చో!" అంటూ సుందరయ్యను బెంచీమీద కూర్చోబెట్టి హాలు గుమ్మం వద్దకు నడచి "లక్ష్మీ! రెండుక

## డి. డి.ల వల

ప్పుల వేడి కాఫీ పట్రా... ఆ బంగారు చేత్తోటే కాస్త కాగితం కలం కూడా పట్రా!" అని కేకవేశారు హుషారుగా.

జూలీ కూడా ఓసారి తల విదిల్చి సుందరయ్య దగ్గరగా వచ్చి తోక ఊపి తన సంతోషాన్ని ప్రకటించి వెళ్లిపోయింది మళ్లీ తను మామూలుగా పడుకునే ప్రదేశంలోకి.

శ్రీలక్ష్మమ్మగారు కాఫీలు తెచ్చియిచ్చి వెళ్లాక అడిగారు రాజారావుగారు.

"నీవు అయిదువేలు తీసుకున్నప్పుడు నాంచారయ్యకు ప్రాంసరీనోటు ఎంతకు వ్రాసి ఇచ్చావు?"

"మొదట మూడు వేల రూపాయల వరకే తీసుకున్నాను సార్. అప్పుడు మూడువేల రూపాయలకేప్రాంసరీనోటు వ్రాసిఇచ్చాను. తరువాత మళ్లీ డబ్బు తీసుకున్నప్పుడు పాత కాగితం చింపివేసి ఐదువేల రూపాయలకు క్రొత్త బాండు వ్రాయించుకున్నారు."

"గుడ్! ఆ ప్రాంసరీ నోటులో నూటికి నెలకు వడ్డీ ఎంత చెల్లించేట్లుగా వ్రాశావో నీకు గుర్తుందా?"

"ఎందుకు గుర్తులేదు సార్! నెలకు వందకు రెండు రూపాయల చొప్పున వడ్డీ చెల్లించేలా వ్రాశానుసార్, వాళ్లు అలాగే. వ్రాయమన్నారు."

"వెరీగుడ్!" అంటూ రాజారావుగారు కాగితం కలం అందుకొని కాగితం మీద లెక్కవేయసాగారు.

రుచిగా వున్న వేడి కాఫీని త్రాగేసి సుందరయ్య కప్పు కిందపెడుతోండగా రాజారావుగారి కంఠస్వరం మందంగా వినిపించింది.

"సుందరయ్యా! ఇంకో తొమ్మిది నెలలు ప్రతినెలా ఏడువందల ఏభయి రూపాయలకు నాంచారయ్య అకవుంట్ నెంబరుతో పాటు బ్యాంకర్స్ డి. డి. తీసి నాంచారయ్యకు ఇవ్వాలయ్యా! మధ్యలో ఇంకో పనీ, చివర్న మరో పనీ కూడా చెయ్యాలి. అవి ఏమిటో తర్వాత చెపుతాను!"

"తొమ్మిది నెలలు నెలకు ఏడు వందలా యాభై రూపాయలు డి. డి. చొప్పున వరుసగా పంపితే తరువాత వడ్డీ తగ్గే మార్గమేదయినా ఉందా సార్?" ఆశగా గొణిగాడు సుందరయ్య.

"వడ్డీ తగ్గటం కాదు సుందరయ్యా! నీ తలమీద బరువుకూడా చాలా తగ్గిపోతుంది. ఆ రాజకీయం అంతా తరువాత తెలుసుకుందువు కానీ, నీవు ప్రతినెలా జాగ్రత్తగా డి. డి. పంపిస్తూ కౌంటర్‌ఫాయిల్స్ మీద డి. డి. నంబరు నోటుచేసుకొని కౌంటర్‌ఫాయిల్స్ అన్నీ ఓ నోట్‌బుక్‌లో వరుసగా జాగ్రత్తగా అతికిస్తూ రావాలి!" అన్నారు ఆయన.

"తప్పకుండా అలాగే చేస్తాను సార్! ప్రతినెలా డి. డి. నాంచారయ్యకు ఇచ్చేసి అప్లికేషన్ కౌంటర్‌ఫాయిల్ తెచ్చి మీకు చూపించి ఓ నోట్‌బుక్‌లో వరుసగా పేజీకి ఒకటి చొప్పున శుభ్రంగా అతికిస్తాను సార్!" అన్నాడు సుందరయ్య ఉత్సాహంగా.

రెండవ పర్యాయం మళ్లీ డి. డి. తీసుకుని వెళ్లి ఇచ్చినప్పుడు నాంచారయ్య నవ్వుతూ అడిగాడు.

"ఈ డి.డి.ల కన్నా శుభ్రంగా డబ్బే పంపవచ్చుకదా మీ తమ్ముడు!"

"డబ్బు మనియార్డరు చెయ్యాలంటే బోలెడంత ఖర్చవుతుందటయ్యా. డి. డి.కి అయితే చాలా తక్కువ ఖర్చట. అందుకే డి. డి. రూపంలో పంపుతున్నాడు. పైగా ఇక్కడి బ్యాంకులో నా పేరుమీద నుండి మీ పేరుమీదకు సునాయాసంగా మారిపోతున్నాయి!" అన్నాడు సుందరయ్య కాస్త తెలివి ఉపయోగించి.

నాంచారయ్యకు ఎలాంటి అనుమానమూ రాలేదు.

అసలు కథ ఎక్కడనుండి ఎక్కడికి వెళ్లబోతోందో కనీసం సుందరయ్యకైనా తెలియదు నిజానికి.

"అసలు సుందరయ్యతమ్ముడు డి. డి. లను సుందరయ్య పేరిట ఎందుకు

పంపించాలి? వాటిని సుందరయ్య ఇక్కడి బ్యాంకులో నా పేరిట మళ్లీ మార్పు చేయటం ఎందుకు? సుందరయ్య తమ్ముడు డి. డి. లను ఏకంగా నాపేరుమీదే బ్యాంకు ఖాతా నెంబరుతోపాటు తీసి పంపవచ్చు కదా? అలా ఎందుకు చెయ్యడంలేదు?" అని నాంచారయ్య ఏ కాస్త తెలివిగా ఆలోచించి ఉండినా ఈ కథ మరో రకంగా సాగి ఉండేది. సుందరయ్య అదృష్టవంతుడవటం వల్ల నాంచారయ్యకుగానీ, పార్వతీశానికి గానీ అలాంటి ఆలోచలేవీ రాలేదు.

* * * *

నాలుగు నెలలు గడిచాయి. డి. డి. అప్లికేషన్ కౌంటర్ ఫాయిల్ తీసుకు వచ్చి చూపించిన సుందరయ్యతో అన్నారు రాజారావుగారు.

"వచ్చేనెల జీతం అందుకోవడానికి ఒకటి రెండురోజులు ముందే నీవు సెలవు పెట్టాలయ్యా కొద్దిరోజులపాటు."

"ఎందుకుసార్?"

"సెలవు పెట్టి మదనపల్లెలో వున్న నీ తమ్ముడి ఇంటికి వెళ్లాలి!"

"వెళ్లి ?"

"వెళ్లి ఏమయినా చెయ్యి... కాని వెళ్లేముందు మాత్రం నాంచారయ్యను కలిసి "తమ్ముడి ఊరు వెళ్తున్నాను. డి. డి. పోస్టులో పంపిస్తాను. డి. డి. సకాలంలో అందకుండా జాప్యం ఏదయినా జరిగితే నాకు ఉత్తరం వ్రాయండి" అని చెప్పి నీ తమ్ముడి అడ్రసు నాంచారయ్యకు ఇచ్చి వెళ్లాలి. అయితే అక్కడ్నుండి నాంచారయ్యకు డి. డి. తీసి పంపించాల్సిన పనిలేదు. అతని ఉత్తరం నీకు అందగానే బయల్దేరి వచ్చేయాలి నీవు."

"ఇదంతా ఎందుకుచెయ్యాలిసార్?"

రాజారావుగారు ఏమీ మాట్లాడక మునుపే జూలీ తల పైకెత్తి సుందరయ్యకేసి చూసింది పెద్ద పెద్ద కళ్లతో.

"సరే సార్... సరే... మీరు చెప్పినట్లే చేస్తాను! ఇక వెళ్తాను సార్, వెళ్లొస్తాను" అంటూ బయల్దేరాడు సుందరయ్య.

* * * *

ముప్పయవ తేదీనాడు సెలవు పెట్టేసి, నేరుగా నాంచారయ్య దగ్గరకు వెళ్లి తను తమ్ముడి ఊరు వెళ్తున్న వైనం అతనికి తెలిపి, ఇంటికి వెళ్లి బట్టలు వగైరా సర్దుకొని భార్యా సమేతంగా మదనపల్లెకు వెళ్లిపోయిన సుందరయ్య తమ్ముడి ఇంట్లో హాయిగా వారం రోజులు గడిపి ఏడవ తేదీ నాడు బయల్దేరి తిరిగి వచ్చాడు.

ఇల్లు చేరుకున్న తరువాత అరగంట కంతా బయల్దేరి వెళ్లి రాజారావుగార్ని కలిసి నాంచారయ్య తనకు మదనపల్లెకు వ్రాసిన పోస్టుకార్డు అందించాడు.

అందులో ఇలా ఉంది.

రాజశ్రీ సుందరయ్యకు,

నారపేచు నాంచారయ్య వ్రాయు ఉత్తరం - ఈ నెల మాకు అందాల్సిన డి. డి. ఇంకా అందలేదు. కాబట్టి ఈ ఉత్తరం అందిన వెంటనే డి. డి. పంపించవలసిందిగా కోరుచున్నాను.

ఇట్లు.
ఎన్. నాంచారయ్య

"సుందరయ్యా ! ఈ ఉత్తరం నాంచారయ్యే వ్రాశాడంటావా?" అని అడిగారాయన.

"తెలీదుసార్! ఆయన వ్రాశారో, లేక పార్వతీశం చేత వ్రాయించాడో నాకెలా తెలుస్తుంది?"

"పోనీ ఈ సంతకం అయినా నాంచారయ్యదే అయివుంటుందా?"

"అదికూడా తెలీదు సార్ నాకు!"

"ఇక నీకేం తెలుసయ్యా?" అన్నారు రాజారావుగారు కాస్త విసుగ్గా.

సుందరయ్య కాస్త బెదిరాడు. గుటకలు మింగుతూ ఆయనకేసీ, ఆయన దగ్గరగా పడుకున్న జూలీకేసీ చూశాడు.

జూలీ ఏ కళనుందో తనమానాన తను ముందుకాళ్లమీద తల వుంచుకొని నిద్రపోతోంది కళ్లు మూసుకుని.

"ఒకపని చెయ్యవయ్యా, ఎలాగైనా రేపు సాయంకాలం లోపుగా ఈ సంతకం నాంచారయ్యదో కాదో తెలుసుకొని వచ్చి నాకు చెప్పాలి. ఈ విషయం కాస్త గోప్యంగా... అంటే నాంచారయ్యకు తెలియకుండా తెలుసుకురావాలి వెళ్లు!" అన్నారు.

"ఇదెలాగున చెయ్యాలిరా దేవుడా!" అనుకుంటూ వెళ్తున్న సుందరయ్యతో అన్నారు ఆయనే మళ్లీ "రేపు నాంచారయ్యకు డి. డి. కూడా తీసి ఇచ్చేసి దాని తాలూకు కౌంటర్ ఫాయిల్ కూడా పట్టుకు రావాలి!"

* * * *

ఆఫీసుకు వెళ్లి డ్యూటీలో జాయిన్ అయిపోయి జీతం పుచ్చుకుని సాయంకాలం దాకా ఆలోచిస్తూ ఆఫీసులోనే గడిపాడు సుందరయ్య.

ఓ గంట పర్మిషన్ బ్రతిమాలి పుచ్చుకుని వెళ్లి మరునాడు డి. డి. అయితే తీసుకువెళ్లి నాంచారయ్యకు ఇవ్వడం తేలికే గాని, నాంచారయ్యకు తెలియకుండా తన వద్దవున్న పోస్టుకార్డులోని సంతకం అతనిదో కాదో తెలుసుకోవటం ఎలాగో అతనికి అర్థం కాలేదు ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా.

ఆఫీసు పని అయిపోయాక ఇంటికి చేరుకొన్న సుందరయ్యకు చికాకు పరుస్తున్న ఆలోచనల మధ్య హఠాత్తుగా శంకరరావు జ్ఞాపకానికి వచ్చాడు.

ఇహ ఆపై ఆలస్యం చెయ్యకుండా, ముఖం అయినా కడుక్కోకుండా శంకర్రావు ఇంటికేసి నడిచాడు సుందరయ్య ఉత్సాహంగా.

శంకర్రావు ఇంటి సమీపానికి చేరుకోగానే "ఈ పాటికి శంకరరావు మిద్దె



మీద కూర్చుని ఉంటాడు!" అన్పించ డంతో ఇంట్లోవారెవర్నీ ఏమీ ప్రశ్నించకుం డానే నేరుగా మెట్లెక్కి మిద్దెమీదకు వెళ్లిపోయాడు సుందరయ్య.

అయితే అతడు ఊహించినట్లుగా అక్కడ శంకర్రావు లేడు.

నీరెండలో కళ్లు అరమోడ్పులు చేసు కొని మరీ ఆనందిస్తూ చుట్ట తగలేస్తున్న శంకర్రావు వాళ్ల బాబాయి తన ఆనందా నికి అంతరాయం కలిగినందుకు కోపంగా



చుట్టకొన కాస్త కొరికి ఉమ్మేసి "వాడు క్రింద ఇంట్లోనే అఘోరించాడయ్యా... ఇక్కడికెందుకు వచ్చావు? వెళ్లు వెళ్లు. క్రిందికి వెళ్లు" అంటూ కసిరేసి తన పనిలో తాను లీనమైపోయాడు మళ్లీ.

ఉసూరుమంటూ సుందరయ్య మెట్లు దిగి క్రిందికి వచ్చేసరికి శంకర్రావు వరం డాలో నిలబడి వున్నాడు.

"నీవు మెట్లెక్కేటప్పుడే చూశాను ఇట్లోంచి నిన్ను. ఎటూ పైన బాబాయి ఉన్నాడుగా క్రిందికి నిన్ను తోలేస్తాడులే అనుకుంటూ తల దువ్వుకునే పని పూర్తి కానిచ్చి వచ్చి కాచుకున్నాను!" అన్నాడు నవ్వుతూ.

"హూ!" అంటూ నిట్టూర్చిన సుంద రయ్య "నీవు పైనే కూర్చుని సూర్యుడు ఎప్పుడు దిగిపోతాడా? అని చూస్తూ ఉంటావనుకున్నాను" అన్నాడు.

"నీవు గొప్ప భోలానాథ్‌వయ్యా! కాక పోతే ఆషాఢమాసంలో నేను మిద్దెమీద సూర్యుడ్ని చూస్తూ కూర్చుని ఉంటానని ఎలా అనుకుంటావు? అది సరే కానీ ఏమిటిలా పరిగెత్తుకు వచ్చావు?"

"నీవు రాత్రి ఎనిమిది తరువాత ఎప్పుడూ రాకూడదని చెప్పావుగా, అందుకే ఆతృతగా వచ్చాను!"

"ఆషాఢమాసం పూర్తయే వరకూ మాత్రం నీవెప్పుడైనా రా, ఎంత రాత్ర యినా వచ్చి నిద్రలేవు! నేనేమీ అనుకోను...అది సరే ఇంతకూ ఏమిటి విశేషం?"

సుందరయ్య సంగతంతా విన్పించి పోస్టు కార్డు చూపించాడు.

"ఈ కాస్త పనికే ఇంతలా బెంబేలు పడి పోతావేమయ్యా? ఈ కార్డు నావద్దనే ఉండనీ, రేపు మధ్యాహ్నంలోగా కనుక్కొని చెవుతాను దీనిమీది సంతకం నాంచారయ్య దయినదీ, కానిదీ! రేపు మధ్యాహ్నం ఆఫీ సుకు వెళ్లేముందు మా ఆఫీసు దగ్గరకు వచ్చివెళ్లు!" అన్నాడు శంకర్రావు.

"ఆ సహాయం చెయ్యి బాబూ, చచ్చి నీ కడుపున పుడతాను!" అన్నాడు సుంద రయ్య.

మరుసటి రోజు మధ్యాహ్నం మునిసి పల్ ఆఫీసుకు వెళ్లి శంకర్రావును కలిశాడు సుందరయ్య.

"సుందరయ్యా! పది రూపాయలు ఖర్చయింది.. ఇలా ఇవ్వు!" అన్నాడు శంకర్రావు.

"డబ్బుతో పెద్ద ఇబ్బందిగా ఉందయ్యా! ఆ మహానుభావుడు బియ్యం ఇప్పించ కుండా ఉండివుంటే ఏమయిపోయేవాడ్నో" అని గొణుక్కుంటూ మనసులోనే లెక్కలు వేసుకుంటూ జేబులోంచి పది రూపాయలు తీసి ఇచ్చాడు సుందరయ్య.

"నాంచారయ్య వాళ్ల బీటు పోస్టుమె న్‌కు ఐదు రూపాయలు ఇచ్చాను. ఇకపోతే నాకు ఈ వెధవ ఆషాఢంలో ఒక్కోరోజు గడవడం ఒక్కో యుగంగా ఉంది కాబట్టి నీ పేరు చెప్పి మిగిలిన ఐదు రూపాయలతో ఈ రోజు రాత్రి సెకండ్ షో చూసేస్తాను! ఇదం ఈ కార్డు తీసుకువెళ్లి రాజారావు సార్‌కు ఇచ్చి ఈ సంతకం నాంచార య్యదేనని చెప్పు!" అంటూ పోస్టు కార్డు అందించాడు శంకర్రావు.

"ఎంత తెలివి? ఎంత తెలివి?? ఆ పోస్టుమెన్‌కు నాంచారయ్య సంతకం తెలియకుండా ఉండి ఉంటే ఏం చేసేవా డివి?" అని అడిగాడు ఆనందాశ్చర్యాలతో తబ్బిబ్బయిపోతూ సుందరయ్య.

"నాంచారయ్య లాంటి వ్యక్తి సంతకం పోస్టుమెన్‌కు తెలియకుండా ఉండడాన్కి వీలు లేదు. ఎన్నో రిజిష్టరు లెటర్లు మని ఆర్డరులు వస్తుంటాయి కదా? ఒకవేళ పోస్ట్‌మెన్‌కు తెలియక పోయినా మనం తెలుసుకోవడం పెద్ద కష్టం కాదు."

"ఎలా?"

"అతని ఖాతా ఉన్న ఏ బ్యాంకులో అయినా మనకు తెలిసిన క్లర్కునో, ఆఫీ సర్నో రెక్వెస్టు చేసుకుంటే నిముషంలో తేల్చి చెప్పవచ్చు" అన్నాడు శంకరయ్య చిన్నగా నవ్వి.

* * * *

డి.డి. అప్లికేషన్ కౌంటర్ ఫాయిల్, పోస్టు కార్డు రెండూ రాజారావుగారి చేతికి అందిస్తూ అన్నాడు సుందరయ్య.

"సార్ ఈ కార్డుమీది సంతకం నాంచారయ్యదే సార్!"

"గుడ్.. దట్స్‌గుడ్.. వెరీగుడ్ ఈ కౌంటర్ ఫాయిల్సు అతికిస్తున్న పుస్తకం లోనే ఈ కార్డు కూడా జాగ్రత్తగా పిన్ చేసి పెట్టు" అన్నారాయన వాటిని తిరిగి ఇచ్చేస్తూ.

* * * *

నాంచారయ్యకు పదవ డి.డి. అందించి దాని తాలూకు కౌంటర్ ఫాయిల్ తెచ్చి చూపించిన రోజు అన్నారు రాజారావు గారు.

"సుందరయ్యా! నాంచారయ్యకు ఇక నీవు ఎర్ర ఏగానీ పంపించాల్సిన పని లేదయ్యా. రేపు ఉదయాన్నే శంకర్రావును పిలుచుకుని రా. అతని చేత ఓ ఉత్తరం వ్రాయించాలి నాంచారయ్యకు.. నీకు బాగా వ్రాయడం చేతకాదు కాబట్టి!"

సుందరయ్య నిర్ఘాంతపోయాడు

"ఏమిటి సార్ మీరు చెప్తున్నది? నాకేం అర్థం కావడం లేదు!" అన్నాడు తేరుకున్న తరువాత.

"నాంచారయ్యకు నీవు ఇవ్వాల్సిన అయిదు వేల రూపాయలూ, దాని వడ్డీ మొత్తం తీరిపోయిందయ్యా! ఇకనీవు అతనికి ఒక్క పైసా కూడా చెల్లించాల్సిన పని లేదు. ఇంటికి వెళ్లి నిశ్చింతగా నిద్రపో. శంకర్రావును రేపు ఉదయాన్నే పిలుచుకురా!"

రెండు నిముషాలపాటు మౌనంగా శిలా విగ్రహంగా నిలబడిపోయాడు సుందరయ్య. తరువాత అన్నాడు "మీరు చెప్తున్నది ధర్మం కాదు సార్! మనం నాంచారయ్యకు వడ్డీ మాత్రమే చెల్లించాము. అసలు చెల్లించి తీరాల్సిందే అతనికి. అసలు కూడా ఎగగొట్టడం ధర్మం కాదు. మీరు వడ్డీ తగ్గించే మార్గం చూపుతారని అనుకున్నాను కానీ ఇలా ఏకంగా మొత్తం ఎగగొట్టే దారి చూపుతారనుకోలేదు!"

జూలీ కోపంగా చూడలేదు సుందరయ్య కేసి, తలపైకెత్తి జాలిగా చూస్తోంది.

రాజారావు గారు విసుక్కోలేదు, కోపమూ తెచ్చుకోలేదు, జాలిగానూ చూడలేదు. భావరాహిత్యంగా చూస్తూ భగవద్గీతలోని ఓ శ్లోకం చెప్పారు.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః!"

"సార్!"

"లెక్కాచారముగా చెయ్యబడ్డ పరధర్మము కంటే అవివేకముగా చెయ్యబడినదైనా తన ధర్మమే చాల ఉత్తమమైనది. ఎందుకనగా తన ధర్మము తప్పక నడచుచూ మరణించడం అయినా మేలైనదే! పరధర్మము అతి భయంకరమైనది" అని శ్రీక్రిష్ణభగవానుడే చెప్పాడు సుందరయ్యా! వెళ్లు...ఇంటికి వెళ్లి ఈ కౌంటర్ ఫాయిల్ కూడా ఆ పుస్తకంలో అతికించి పుస్తకాన్ని పొయ్యిలో పడవెయ్యి.

వచ్చే నెల నుండి నాంచారయ్యకు

# డి. డి.ల వల

డి.డి. రూపంగా వడ్డీ తీసుకువెళ్లనవసరం లేదు. డబ్బుగానే తీసుకువెళ్లి ఇవ్వు. ఇంకో రెండు నెలలు గడచిన తరువాత నాంచారయ్య క్రొత్త ప్రోనోటు వ్రాయించుకుని నెలకు వెయ్యి రూపాయలు వడ్డీ ఇవ్వాల్సిందే అన్నా అదే ప్రకారం చెల్లించు. అదే ధర్మం!

వడ్డీ చెల్లించివేసి తినీ తినకా, ఉండీ లేకా రోగాలపాలయి ఆ రోగాలను నయం చేయిచుకోవడానికి డబ్బుకోసం మళ్లీ ఆ నాంచారయ్య వద్దకే వెళ్లు..నీ ధర్మము తప్పకుండా నీవు నడుస్తూ నీ రక్తంలోని ఆఖరి జీవకణం ఖర్చయి పోయేవరకూ వడ్డీ చెల్లిస్తూ జీవించు! వెళ్లు!!

"సార్!"

"పేదవాడైనా నీ హృదయంలోని నిజాయితీకి నేను శిరసువంచి నమస్కారం చేస్తున్నాను సుందరయ్యా! నా ఈ దేశంలోని బడుగు వర్గాలమధ్య ఇంకా మిగిలివున్న మంచితనాన్ని చూసి గర్వపడుతున్నాను, ఆనందిస్తున్నాను.. వెళ్లు సుందరయ్యా, వెళ్లు!!" అన్నారు ఆయన.

వంచిన తల పైకెత్తకుండా నిలబడిపోయిన సుందరయ్యను చూస్తే జాలి కలిగింది ఆయనకు.

"ధర్మో రక్షతి రక్షితః" అన్నారాయన మళ్లీ.

"సార్!"



"ఆ భగవంతుడే చెప్పాడు సుందరయ్యా.. "ధర్మాన్ని నీవు రక్షించు. ఆ ధర్మం నిన్ను వరి రక్షిస్తుంది" అని. అయితే ఏది ధర్మం అనేది చక్కగా గ్రహించగలగాలి మనిషి!" అన్నారు.

వంచిన తల పైకెత్తకుండా అక్కడ్నుండీ కదిలాడు సుందరయ్య ఆలోచనల బరువుతో కృంగిపోయి.

*   *   *   *

పూర్తిగా తెల్లవారక మునుపే కాలింగ్ బెల్ మ్రోగేసరికి పూజ గదిలోకి వెళ్లబోతున్న రాజారావుగారు ఆగి వెళ్లి తలుపు తెరచి చూశారు.

వరండాలో సుందరయ్య, శంకర్రావులు నిలబడి వున్నారు.

*   *   *   *

మూడు రోజుల తరువాత నాంచారయ్యకు ఓ ఉత్తరం అందింది రిజిస్టరు పోస్టులో.

అందులో ఇలా వుంది.

గౌరవనీయులు, పూజ్యులు నారపీచు నాంచారయ్యగారికి-

సమితి ఆఫీసులో అటెండరుగా పని చేయు సవరాల సుందరయ్య నమస్కరించి వ్రాయించుకున్న మనవి.

అయ్యా!,

సరిగ్గా రెండు సంవత్సరాల క్రితం నేను మీవద్ద ఐదు వేల రూపాయలు అప్పుగా తీసుకున్నాను. గత పది నెలలుగా ప్రతినెలా నెలకు ఏడువందలా ఏభయి రూపాయల చొప్పున డి.డి.ల రూపంలో బ్యాంకులోని తమరిఖాతాయందు జమవదునట్లుగా చెల్లించినాను. సదరు డి.డి.ల

# డి. డి.ల వల

ద్వారా చెల్లింపబడిన మొత్తం ఏడువేలా అయిదు వందల రూపాయలు అయినది. తమకు వ్రాసి ఇచ్చిన ప్రాంసరీ నోటు యందు కన్పరచిన వడ్డీ రేటు ప్రకారం అనగా నెలకు వంద రూపాయలకు రెండ్రూపాయల చొప్పున ఐదువేలకు నెలకు వంద రూపాయల ప్రకారం ఇరవయినాలుగు నెలలకు రెండువేలా నాలుగు వందలు వడ్డీ మరియూ ఐదువేల రూపాయలు అసలు కలసి వెరసి ఏడువేలా నాలుగువందల రూపాయలు అయినది. నేను చెల్లించిన మొత్తం ఏడువేలా ఐదువందల రూపాయలు అయినందున నాకు మీరు తిరిగి చెల్లించాల్సిన వందరూపాయలూ, బాకీ తీరిపోయినందున నాకు ఇవ్వాల్సిన ప్రాంసరీనోటు పంపించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

ఇందువెంట ఏయే తేదీలలో ఏయే నంబర్లు కలిగిన డి. డి. లను నేను తమకు అందజేసినదీ వివరింపబడిన కాగితాన్ని జత పరచడమైనది.

చిత్తగించగలరు!

ఇట్లు తమవిధేయుడు,
సవరాల సుందరయ్య.

ఉత్తరంతోపాటు ఉన్న మరో కాగితం మీద బ్యాంకర్సు డి. డి. నెంబర్లూ అవి తీసుకొనబడిన తేదీలూ, నాంచారయ్యకు ఇవ్వబడిన తేదీలూ వ్రాయబడి వున్నాయి వరుసగా.

ఆ ఉత్తరం బాంబులా పేలింది.

ఉత్తరం చదివిన నాంచారయ్య తోక త్రొక్కబడిన త్రాచులా లేచాడు సోఫాలోంచీ. కుప్పిగంతులు పెట్టాడు.

అతని జీవితంలో అదే అతనికి తగిలిన మొట్టమొదటి ఘాటయిన పెద్ద ఎదురు దెబ్బ.

బావగారి అరువులూ, పెడబొబ్బలూ మంచంమీద యూఫోం బెడ్డులో ఫ్యానుగాలి క్రింద హాయిగా నిద్రపోతున్న పార్వతీశానికి నిద్రాభంగం కలిగించాయి. నిద్రచెడితే నిజానికి తిక్కరేగుతుంది అతనికి.

సంగతి విని "వాడి సంగతి నేను తేల్చుకుని వస్తా" అంటూ బట్టలు తొడుక్కొని పెద్దపెద్ద అంగలేసుకుంటూ ఇంట్లోంచీ వెలుపలికి వచ్చి రోడ్డుమీద ఎదురైన ఆటో ఎక్కి "సమితి ఆఫీసుకు పోనీ" అన్నాడు.

* * * * * *

వెళ్లడం వెళ్లడం పార్వతీశం వెళ్లి ఆఫీసులో డ్యూటీలో ఉన్న సుందరయ్య కాలరు పట్టుకున్నాడు.

బావగారి సొత్తు తేరగా కూర్చుని తినడమే తెలుసు తప్ప అతనికి లోకజ్ఞానం తెలిసింది చాల తక్కువ. అందుకే ఆఫీసులో సుందరయ్య కాలరు పుచ్చుకొని బండబూతులు తిట్టడం మొదలు పెట్టాడు పెద్ద స్వరంతో.

ఆ కార్యాలయపు మేనేజర్లు ఒక గొప్ప భార్యా బాధితుడు. ప్రతిరోజూ భార్య చేత బాధింపబడి ఆఫీసుకువచ్చి తన ఉక్రోషాన్నంతా ఆఫీసులో సుందరయ్యమీద చూపిస్తుంటాడు... సుందరయ్య కన్నా మరెవరూ ఓపికైన వాళ్లు లేకపోవడం వల్ల!

ఆరోజే...ఆయనను భార్య ఏకళనుందో ఆయనను ఏమాత్రం పీడించకుండా తృప్తిగా భోజనం చేయనిచ్చి ప్రశాంతంగా సాగనంపింది ఆఫీసుకు. అందుకే ఆయన ఒక్కమాటైనా సుందరయ్యను అనకుండా శాంతంగా కూర్చుని "భార్యా బాధితుల సంఘం" పెట్టే విషయం పునరాలోచించుకుంటూంటే... శనిలా పార్వతీశం వచ్చి సుందరయ్యను పట్టుకుని నానా మాటలూ అంటూంటే తన బలిపశువు సుందరయ్య మీద ఆయన మనసంతా జాలితో నిండిపోవడమే గాక పెద్దపెద్ద మీసాలు పెట్టుకున్న పార్వతీశం 'మీద ఒళ్లు మండిపోయింది.

ఆయన రిసీవర్ తీసుకోవడమూ, పోలీసు స్టేషన్ నెంబరు తిప్పడమూ



కనక్షన్ రాగానే స్వచ్ఛమైన ఇంగ్లీషులో తనెవరో చెప్పి తమ ఆఫీసుకు ఎవరో గూండా వచ్చి దౌర్జన్యం చేస్తున్నందున వెంటనే రావాలని తెల్పడమూ సుందరయ్యను తిడ్తున్న పార్వతీశానికి ఏమాత్రం తెలియదు. ఆలోగా అతని చేతుల్లో గుంజుకుంటున్న సుందరయ్య చొక్కా మరీ పాతదైన బనీను కూడా పూర్తిగా చినిగి పేలికలయిపోయాయి.

తతిమ్మా అటెండర్లూ, ఒకరిద్దరు గుమాస్తాలూ కలుగచేసుకొని పార్వతీశం చేతులనుండీ సుందరయ్యను విడిపించి ఇద్దర్నీ మేనేజరు దగ్గరకు తీసుకుపోయారు.

"ఎవరయ్యా నువ్వు? ఇది ఆఫీసను కున్నావా? లేక చేపల బజారనుకున్నావా? మా జవాను మీద మా ఆఫీసులోనే చెయ్యి చేసుకుంటున్నావు!" చాలా ఆగ్రహంగా అడిగాడు మేనేజరు.

"నేను నారపేచు నాంచారయ్య బావమరిదిని!" గొప్పగా చెప్పాడు పార్వతీశం పొగరుగా.

"వాడెవడయ్యా బొచ్చు మిరాయిలాగా? నీకు పేరూ, ఊరూ, అడ్రసూ లేదా?"

"మా బావగారిని వాడూ, వీడూ అనకండి! నాపేరు పక్షుల పార్వతీశం!" అన్నాడు పార్వతీశం పొగరుగానే.

"ఏం మీబావ ఏమయినా గవర్నర్‌కు వేలు విడిచిన మేనత్తకొడుకా? మా అటెండర్ని ఎందుకు పట్టుకున్నావు? ఎందుకు తిడ్తున్నావు? " చాల తీవ్ర స్వరంతో అడిగాడాయన.

"వీడు మాకు అయిదువేల రూపాయలు ఇవ్వాలి!" అన్నాడు పార్వతీశం.

"సార్ ఇందాకట్నించీ సూత్తున్నాను ఈడి బడాయి సానా జోరుగుంది ఈపాలి ఈడు సుందరయ్యను ఈడు అడు అన్నాడంటే ఈడి బొచ్చు మిరాయి బావగా నింటికి ఈడు ఎల్లడు... ఈడి సెవమెల్తుంది.! అంతే!!"

అన్నాడు ఫోర్తు క్లాస్ ఎంప్లాయీస్ యూనియన్ లీడరైన కుర్ర అటెండరు మస్తానయ్యకు ఒళ్లు మండి.

"కాస్త ఆగండయ్యా! కాస్త ఆగండి!!" అంటూ అతన్ని శాంతపరిచి సుందరయ్య వైపు తిరిగాడు మేనేజరు.

"ఏం సంగతి సుందరయ్యా?"

"సార్ వీళ్లవద్ద నేను తీసుకున్న అసలూ, వడ్డీ మొత్తం అంతా నెలకు ఏడువందలా ఏభయి రూపాయల ప్రకారం చెల్లించేశాను సార్.. వీళ్లు ఇంత భయంకరమైన మోసగాళ్లని తెలుసుకునే డి. డి. ల రూపంలో వీళ్ల బ్యాంకు ఖాతా నెంబరుమీదనే చెల్లించి రికార్డంతా భద్రంగా నాపద్ద పెట్టుకున్నాను. వీళ్లు నా ప్రోనోటు వాపను ఇవ్వకుండా నాటకం ఆడ్తున్నారు. ఇంకా వీళ్లే నాకు నూరు రూపాయలు ఇవ్వాలి"అన్నాడు సుందరయ్య గుక్క త్రిప్పకోకుండా.

"ఒరేయ్ నీ ప్రేగులు తెంచి మెడలో వేసుకుంటానురా, నీ నాలుక తెగకోసి నీ ఎముకలు విరిచి నిన్ను మూగవాడ్ని అవిటివాడ్ని చేసేస్తానురా" అంటూ ఆవేశంగా సుందరయ్య మీదకు దూకాడు పార్వతీశం.

అప్పుడే జీపు దిగి రంగప్రవేశం చేస్తున్న పోలీసులను గమనించేసి మస్తానయ్య మౌనంగా ఉండిపోవడంతో రెచ్చిపోయాడు పార్వతీశం. అదే అతడు చేసిన ఘోరమైన పొరపాటు. అతని దౌర్జన్యాన్నీ, అరుపులనూ కేకలనూ మొత్తం సంగతంతా కళ్లారా చూశారు హెడ్ కానిస్టేబులూ,



## పరమార్థ స్వార్థం

నాది - నాదంటే
జగమంతా నాదే ననుకో!
అందరు నా వాళ్ళనుకో!
నీదే అంతా తెలుసుకో

అంతా నీవై వెలిగిపో!
నీదీ - నాదను భేదమెందుకు?
మనది—! మనమను మాట మరువకు
దీపం ఎవరిదైనా
తేజం అందరిదీ!
సమ సమాజ మందరిదీ!

లేదు భేదం ఎంతకు
వా..కు చలిక ్రో పకు
భేదం చెట్టు..
...కు తేనెపట్టు..!
కుసుమం ఎక్క..డున్నా
సుమగంధం అందరిదీ!
అనుబంధం అందరిదే!
ఇన్ని రూపాల కొకే ఆత్మని
వేద నాదాల తత్వార్థం
ఆ ఒక్కటిని గుర్తించటమే
మానవ జీవిత పరమార్థం!
సుప్రభాతమై కనిపించు!
సుప్రజాహితం వినిపించు!!

— ... తిరుమల

పోలీసులూ.

మేనేజరు చెపుతోంటే షార్టు హ్యాండ్ తెలిసిన టైపిస్టు షార్టుహ్యాండులో వ్రాసుకొని ఐదు నిముషాలలో నాలుగు కాపీలు టైపు చేసి తెచ్చి ఇచ్చేసింది డిటెయిల్డు పోలీసు రిపోర్టు.

సుందరయ్య వద్ద నాలుగు కాపీలలో సంతకాలు చేయించి, తనూ సంతకాలు చేసి మరో ఇద్దరి వద్ద సాక్షి సంతకాలు చేయించి ఆఫీసు సీలు వేసి ఒక కాపీని హెడ్‌కానిస్టేబులుకు అందించాడు మేనేజరు.

రిపోర్టు అందుకుని పార్వతీశాన్ని జీపులో వేసుకుని వెళ్లిపోయారు పోలీసులు.

* * * * * *

"కాగల కార్యం గంధర్వులు తీర్చారు! సుందరయ్యా, నిశ్చింతగా ఉండు!" అన్నారు రాజారావుగారు అంతా విని.

* * * * * *

పార్వతీశాన్ని ఇంటికి తీసుకువెళ్లడానికీ అతనిమీదున్న పోలీసు కంప్లైయింటు విత్‌డ్రా చేయించడానికీ చాలా మొత్తం ఖర్చు పెట్టాల్సివచ్చింది నాంచారయ్యకు.

"నీవు ఎన్ని కోర్టులు తిరిగినా గెలుపు సుందరయ్యదే అవుతుంది. అనవసరంగా లాయర్లకు ఎందుకు డబ్బులు తగలేస్తావు?" అన్నారు సంగతి గ్రహించిన నాంచారయ్య హితులు.

అయినా ఆశ చావని నాంచారయ్య భయపెట్టి చూస్తే ప్రయోజనం ఏమయినా ఉంటుందేమో అనుకుంటూ ఓ రోజు సాయంకాలము ఆరు గంటలకు ఇద్దరు రౌడీలను వెంటేసుకుని సుందరయ్య ఇంటి దగ్గరికి చేరుకున్నాడు.

ఆ సమయానికి అప్పుడే ఆఫీసు నుండీ ఇంటికి వచ్చిన నాంచారయ్య వరండాలాంటి తమ ఇంటి వీధి అరుగు మీద కూర్చుని నిశ్చింతగా కాఫీ త్రాగుతున్నాడు.

"నీవు వంటరి వాడివైనా నీవెనుక వెయ్యిమంది ఉన్నంత నిబ్బరంగా నిలబడాలి. నీ జేబులో పైసా లేకపోయినా నీవు చిటిక వేసి వేలూ, లక్షలూ తెప్పించుకోగలిగినంతటి వాడుగా డాబుగా ఫోజు పెట్టాలి. లేదా ఈ సమాజం నిన్ను బ్రతకనివ్వదు!" అంటూ రాజారావుగారు చేసిన ఆఖరి హితబోధ చెవులలో మెదులుతూ ఉండగా ప్రశాంతంగా అన్నాడు సుందరయ్య.

"రండయ్యా, రండి! నేను మీ రాక

### డి.డి.ల వల

కోసమే ఎదురుచూస్తున్నాను...రండి!"

"నీ నక్కవినయాలు చాలురా గాడిదా, ముందు నా డబ్బు ఐదువేలు అక్కడపెట్టు!" అన్నాడు. చాలా కోపంగా నాంచారయ్య.

"చూడండి నాంచారయ్యగారూ, మీరు నన్ను గాడిదా, కుక్కా అంటూ సంబోధించారంటే తిరిగి నేను మిమ్మల్ని ఏమీ అనను. కానీ మీ దగ్గర అప్పుపుచ్చుకున్న ప్రతి గాడిద వద్దకూ వెళ్లి మీకు ఇవ్వాల్సిన వడ్డీని ప్రతినెలా మీకు మనిఆర్డరు రూపంగా పంపించేస్తూ వస్తే లభ్యమయ్యే లాభాలను గూర్చి చెప్పేస్తాను. అంతే!" అన్నాడు తాపీగా.

"ఒరి నీచుడా!"అన్నాడు అవాక్కయిపోతూ నాంచారయ్య.

"వీడి నడుములు, సడుగులు విరగ్గొట్టమంటారాయ్యా?!" అని నాంచారయ్యను అడిగాడు అతని వెంటవచ్చిన రౌడీలలో ఒకడు.

"నాంచారయ్య గారు నీలాంటి గాడిద వెధవలను వెంట తెచ్చుకుంటాడనే నేనూ నా జాగ్రత్తలోనే ఉన్నాను. పోలీసు స్టేషన్‌లో రక్షణ కోరుతూ నేనిచ్చిన అర్జీ ఉండనే ఉంది. మీరు వచ్చేది దూరం నుండే చూసి ప్రక్క ఇంటి కుర్రవాడ్ని స్టేషన్‌కు పంపించివేశాను కూడా. ఇప్పుడో మరో అయిదు నిముషాలకో ఇక్కడికి పోలీసులు వస్తారు. నా నడుములు విరుగుతాయో లాకప్పులో మీ మెడలు విరుగుతాయో వేచి చూద్దాం!" అన్నాడు సుందరయ్య.

రౌడీలు ఇద్దరూ కాస్త ఖంగుతిని చప్పిడి ముఖాలతో నాంచారయ్య కేసి చూశారు.

"ఒరేయ్ రండిరా వెళ్దాం. వీడి సంగతి ఇప్పుడు కాదు కొంతకాలం గడిచాక చూద్దాం. సాక్ష్యం లేకుండా కీళ్లు విరికేద్దురు గానీ!" అంటూ వెనుతిరిగాడు నాంచారయ్య.

"నాంచారయ్యగారూ! మాట!! మరో విషయం చెప్పడం మరచాను. మా అల్లుడు మొన్న వచ్చినప్పుడే మిమ్మల్ని గూర్చి పూర్తివివరాలు తీసుకుపోయాడు. అతనికి హైదరాబాదులో అవినీతి నిరోధక శాఖ వాళ్లెవరో తెలుసట. ఏనాడైనా సరే



## మరో 'త్రిదేవ్'

'త్రిదేవ్' చిత్రం మాదిరే మరో భారీచిత్రాన్ని నిర్మించాలని తలపెట్టాడట ఒక నిర్మాత. ఆ క్రొత్త చిత్రంలో నసీరుద్దీన్‌షా, సన్నీడియోల్, చుంకీపాండేలు నటిస్తున్నారు. మీనాక్షిశేషాద్రితో పాటు మరో క్రొత్త హీరోయిన్ ఈ చిత్రంలో కనబడుతోంది. అనుపమ్‌ఖేర్ క్రొత్తతరహా పాత్రలో ప్రేక్షకులకు కనువిందు చేస్తాడట.

నామీద ఈగ వాలినట్లు తనకు తెలిసినా ఆ మరునాడే మీ ఇంటిమీద ఎ. సి. బి. వాళ్లు వచ్చి వాలిపోగల ప్రమాదమూ ఉంది!" అన్నాడు నిశ్చలంగా చూస్తూ సుందరయ్య.

పెద్దపెద్ద అడుగులేసుకుంటూ వెళ్లిపోతున్న నాంచారయ్యనూ, అతని అనుచరులనూ, ప్రశాంతంగా కూర్చున్న సుందరయ్యనూ, చూస్తూ అనుకున్నాడు ప్రక్కయింటి పానకాల పాపన్న. 'ఒడలు బండ్లగును!' అని.

* * * * * * *

తన కాళ్లమీద పడినంత పనిచేస్తున్న సుందరయ్యను వారించి బెంచీమీద కూర్చోమని చెప్పి అతడు కూర్చున్న తరువాత అడిగారు రాజారావుగారు.

"ఏమంటాడు నాంచారయ్య?"

"వందరూపాయలూ, నా ప్రాంశరీ నోటూ తనే స్వయంగా మా ఆఫీసుకే తెచ్చి ఇచ్చాడు సార్! వడ్డీ మని ఆర్డరు చేసే విషయం ఎవరికీ చెప్పవద్దనీ, నా అల్లుడి ద్వారా తన విషయం ఎ. సి. బి. వాళ్ల వరకూ వెళ్లనివ్వవద్దనీ చెప్పి చేతులు జోడించి దండంపెట్టాడు ప్రక్కకు పిలచి!" అన్నాడు సుందరయ్య.

"మంచి పనే జరిగిందే!"

"ఏమోసార్, నాకు మాత్రం మనసులో బాధగానే ఉందిసార్- అతన్ని నేను మోసం చేశానేమోనని".

"నిజానికి ఇందులో మోసం ఏమీ లేదు సుందరయ్యా! అత్యాశకు పోకుండా నాంచారయ్య నీ వద్ద నెలకి పదిశాతం వడ్డీనే తీసుకుంటూ వెళ్లివుంటే ఇంతకథ జరిగేదే కాదు. నీ బాధ నీవు పడుతూ నెలా నెలా ఐదువందలు ఇస్తూనే ఉండేవాడివి. నీవు రిటైరు అయిపోయేలోపు ఏభయి వేల రూపాయల వరకూ వడ్డీనే కట్టి వుండేవాడివి.

నాంచారయ్య మరీ దురాశకుపోయాడు. అదిమోసం కాదా? మోసానికి మోసమే కదా మందు? తను నీవద్ద అసలు లేదని తెలిసి బ్లాక్ మెయిల్ చేసి ఎక్కువ వడ్డీ గుంజాలని ప్రయత్నించడం క్షమింపరాని నేరం నిజానికి.

కాబట్టి నీవు బాధ పడాల్సిన అవసరమే లేదు!

"అంతేనంటారా సార్!"

"అక్షరాలా అంతే! ఒక విషయం చెప్పనా? నీవు నా వద్దకు వచ్చిన మొట్టమొదటి రోజే నీకు ఐదు వేల రూపాయలు ఇచ్చి నాంచారయ్య మొహాన కొట్టించి నెలకు ఐదువందల చొప్పున పదినెలల్లో నీవద్ద తిరిగి తీసుకొనవచ్చుకదా నేను? అలా ఎందుకు చెయ్యలేదు? ఇంత తతంగం ఎందుకు నడిపాను???"

"తెలియదు సార్!"

"ఆకలితో ఉన్న వాడికి వండిన చేపలు ఇవ్వకూడదట. చేపలు పట్టడం నేర్వాలట! అర్థం అయిందా?"

"అర్థం అర్థం అయింది సార్!"

"మిగతా సగం కూడా త్వరగా నేర్చుకో!"

"అలాగే సార్! అన్నట్లు మీ ఋణం ఎలా తీర్చుకోను సార్?"

"నాకు ఋణం ఏమీ లేదుకానీ భీమగానిపల్లె బాగారెడ్డికి నెలకు వందరూపాయలు చొప్పున పన్రెండు నెలలు మనిఆర్డరు చేసి ఆ తిండిగింజల ఋణం తీర్చుకో!"

"పన్రెండు నెలలెందుకు సార్? ఈనెల ఆరువందలు, వచ్చేనెల ఆరువందలు ప్రక్కన పెట్టి నేనే వెళ్లి బాగారెడ్డిగారికి ఇచ్చి వస్తాను సార్. అలాంటి అన్నదాతలు, మీలాంటి మహారాజులు చల్లగా ఉండాలి పదికాలాలపాటు!"

"శుభం!" అన్నారు రాజారావుగారు నవ్వి.

[అయిపోయింది.]

# సౌదామిని

## దేవరకొండ వెంకటలక్ష్మి

అది ఒక భయంకర కాళ రాత్రి. ఆ అర్థరాత్రి పన్నెండు గంటల వేళ ప్రకృతి అంతా చీకటి ఒడిలో సేద తీరుతోంది.

అది నవంబరు నెల కావటంతో ఆ అర్థరాత్రి సమయంలో ఎముకలు కొరికే చలి పరిసరాలు అంతటా వ్యాపించి ఉంది.

అదే సమయంలో స్మశానంలో అడుగు పెట్టాడు దేవేంద్ర. అప్పటి వరకు గోలగా అరుస్తున్న నక్కలు, కీచురాళ్లు అతను స్మశానంలో అడుగు పెట్టగానే ఒక్కసారిగా అరవటం మానేసి నోరు మూసుకున్నాయి.

ఒక్క నిముషం ఆగి చుట్టూ చూశాడు దేవేంద్ర.

స్మశానం అంతా నిశబ్దంగా ఉంది. ఒకసారి నెమ్మదిగా కుడి భుజం మీద బరువు ఎడమ భుజం మీదికి మార్చుకున్నాడు. దూరంగా శవం కాలుతున్న వాసనతో పాటు దాని తాలూకు మంట కూడా కనిపిస్తోంది.

మళ్లీ ముందుకి అడుగు వేశాడు దేవేంద్ర.

'దూరంగా కాలుతున్న శవం దగ్గరకు చేరుకుని ఆ చితి మంట ఆరక ముందే తన పని పూర్తి చేసుకోవాలి' అన్న నిశ్చయం అతనిది.

వడివడిగా అడుగులు వేసి మంటని సమీపించేసరికి చితిలో కాలుతున్న శవం తాలూకు కపాలం "ఫట్"మని పెద్ద శబ్దం చేస్తూ ప్రేలింది. ఆ విసురుకి ఒక నిప్పు రవ్వ ఎగిరి దేవేంద్ర కాలు మీద పడింది. బాధని పళ్ల బిగువనే భరించి కాలు విదిలించి, భుజం మీద బరువు క్రిందకు దింపాడు.

చకచకా గొయ్యి తవ్వటం మొదలు పెట్టి సరిగ్గా అరగంటలో తన పని పూర్తి చేసుకుని, పార, గునపం అక్కడే పడేసి అలసటగా వెనక్కు తిరిగాడు.

అప్పుడే వెలుగుతున్న చితిమంట ఎవరో ఆర్పినట్లుగా 'టప్'మని ఆరిపోయింది. స్మశానం అంతా కన్ను పొడుచుకున్నా కనిపించనంత కటిక చీకటి.

సరిగ్గా పదడుగులు వేసి ఒక బ్రహ్మాండమయిన ఊడల మర్రి వృక్షం క్రిందకు వచ్చాడు దేవేంద్ర.

అనుకోకుండానే ఎందుకో వెనక్కి తిరిగి ఆరిన చితి వైపు చూచాడు. మంట ఆరిపోయినా చితిలో నిప్పులు ఇంకా ఎర్రగా మెరుస్తున్నాయి.

కర్‌ఛీఫ్ తీసి అంత చలిలోను ముఖానికి పట్టిన చమట అలసటగా తుడుచుకుని రెండడుగులు ముందుకు

వేశాడు. చెట్ల మీద గుడ్లగూబ భీకరంగా అరవటం మొదలుపెట్టింది.

దేవేంద్ర మూడో అడుగు ఆగిపోయింది. సరిగ్గా అప్పుడే పడింది అతని భుజం మీద అతి బరువైన మంచు హస్తం ఒకటి.

ఉలిక్కిపడ్డాడు దేవేంద్ర. అప్పటి వరకు మౌనంగా ఉన్న నక్కలు, కీచురాళ్లు మరల ఒక్కసారిగా గోలగా అరవటం మొదలుపెట్టాయి.

దేవేంద్ర ఒళ్లు జలదరించింది. ఓరగా వెనక్కి చూసి "కెవ్వ్"న అరిచాడు. వెనక ఉన్న ఆకారం కిచ కిచా నవ్వింది. అది నవ్వినప్పుడు నోట్లో పళ్లు కిర్రు కిర్రుమన్నాయి.

సందేహంలేదు. ఆ ఆకారం తన భార్య కాదామినియే. ఆమెను పాతి పెట్టి ఇంకా పది నిముషాలు కూడా కాలేదు. ఆమె ఒంటి మీద తను కప్పిన మట్టి ఇంకా అక్కడక్కడ తడి తడిగా అంటుకుని ఉంది. ఆమె కళ్లు చింత నిప్పుల్లా మెరుస్తున్నాయి. ఆమె నోట్లోంచి రెండు కోరలు బయటకు తొంగి చూస్తున్నాయి. తను పూడ్చిన గొయ్యి ఇప్పుడు ఖాళీగా ఉంది.

దేవేంద్ర భుజం మీద చెయ్యి నెమ్మదిగా అతని కంఠం వరకు పాకి కంఠం ముడి మీద బలంగా బిగుసుకుంటోంది. గోళ్లు బలంగా గొంతులో దిగబడుతున్నాయి.

పళ్ల బిగువున బాధ భరిస్తున్న దేవేంద్ర చివరిసారిగా హృదయవిదారకంగా ఆర్తనాదం వేశాడు.

"దేవేంద్రా...! దేవేంద్రా...! ఏమిటిరా... అలా అరుస్తున్నావు! ఏమయిందిరా... నీకు!" మిత్రుడు దినేష్ తట్టి లేపటంతో గాబరాగా లేచాడు దేవేంద్ర.

లేస్తూనే భయం భయంగా చుట్టూ చూశాడు. తను చూసింది కల అని నిర్ధారణ అయ్యాక కాస్త స్థిమితపడ్డాడు.

"ఒరేయ్! ఏమయిందిరా అసలు నీకు! ఎందుకలా భయపడుతున్నావ్!" మళ్లీ అడిగాడు దినేష్.

"దినేష్! నా బాధ ఎలా చెప్పనురా! ఇప్పటికి మూడు వారాల నుండి అనుభవిస్తున్నాను చిత్రవధ. మెలకువగా ఉంటే ఒక బాధ. నిద్ర పోదామంటే భయంకరమయిన పీడ కలల బాధ. ఈ భయంకర పరిస్థితి తట్టుకోలేకే నిన్ను రమ్మని టెలిగ్రాం ఇచ్చాను". దేవేంద్ర చెప్పుతుండగానే గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

దేవేంద్ర నిలువెల్లా కంపించి పోయాడు.

దూరం నుండి దగ్గరవుతున్నట్టు కాలి మువ్వల చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. ఆ చప్పుడు దేవేంద్ర బెడ్ రూమ్ బయటి వరకు వచ్చి ఆగిపోయింది. దినేష్ కూడా ఆ చప్పుడు విన్నాడు.

తలుపు మీద చిన్నగా, అతి చిన్నగా ముని వేళ్లతో 'టక్ టక్'మని శబ్దం.

దినేష్ లేచాడు. ఎవరో వచ్చారు తలుపు తియ్యటానికని.

"ఆగు... దినేష్. ఎక్కడికి?" కంపిస్తున్న స్వరంతో అడిగాడు దేవేంద్ర.

"ఎవరో తలుపు తడుతున్నారు కదా! తలుపు తియ్యటానికి".

"ఒద్దు. ఆ పని మాత్రం చెయ్యకు. ఇది రోజూ జరిగే విషయమే. తలుపు తీశావంటే రక్తం కక్కుకుని చస్తావ్!" అరచినట్టుగా చెప్పాడు దేవేంద్ర.

మువ్వల చప్పుడు కిటికీ దగ్గరకు వచ్చింది. దినేష్ అటు చూశాడు. మేలి ముసుగులో ఒక నీడ కీ నీడలోకి తప్పుకుంది. కిలకిలమని నవ్వు, ఆ వెనకే కిర్రు కిర్రుమని పళ్లు కొరికిన చప్పుడు.

దేవేంద్ర తల ఒంచుకుని కూర్చున్నాడు. అతని శరీరం సన్నగా ఒణుకుతోంది.

"ప్రియా! నీకు తోడుగా నీ మిత్రుణ్ణి రప్పించుకున్నావు. పాపం! అతనికీ నీతో పాటే చావుకి ముహూర్తం నిర్ణయించాను. నేను రేపు రాను. రేపు ఒక్క రోజు విశ్రాంతిగా ఉండు" అన్న మాటలు. ఆ వెనకే కిలకిల నవ్వు, కిచకిచ

**ఈ వారం దెయ్యం కథ**




శబ్దం

దినేష్ మళ్లీ తలుపుల వైపు కదలబోయాడు. దేవేంద్ర చప్పున అతని చెయ్యి పట్టుకుని ఆపాడు.

"దినేష్! నేను బ్రతికి ఉండటం నీకు ఇష్టం లేదా!" పూడుకు పోతున్న గొంతుతో అడిగాడు.

"దేవేంద్రా! ఏమిటిరా.... ఇదంతా! అసలు చెపుతావా! చెప్పవా!" కోపంగా అడిగాడు దినేష్. దేవేంద్ర దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఆమె ఎవ్వరా!" మళ్లీ అడిగాడు దినేష్.

"ఆమె నా భార్య సౌదామిని," ఒణుకుతున్న స్వరంతో చెప్పాడు దేవేంద్ర. దేవేంద్ర చెప్పింది వింటే అతనికి పిచ్చి ఎక్కిందేమో అనిపించింది దినేష్‌కి.

"ఏమిటిరా! నీకు మతి కాని చలించలేదు కదా! నీ భార్య చనిపోయిందని నెల రోజుల క్రితం నాకు ఉత్తరం వ్రాసావు కదురా!"

"అవును. ఇప్పుడు మాత్రం ఆమె బ్రతికి ఉందని నేను చెప్పటం లేదు కదా! సరిగ్గా నెల రోజుల క్రితం నా చేతులతో నేనే ఆమెను పాతిపెట్టాను. అప్పుడే మొదలయ్యాయి నా జీవితానికి చివరి ఘడియలు." దేవేంద్ర మాటలు నూతిలో నుండి వచ్చినట్టుగా వచ్చాయి.

దినేష్ జాలిగా చూశాడు దేవేంద్రని.

"దేవేంద్రా! ఏం జరిగిందో చెప్పురా! కొండంత బాధ పిడికెడు గుండెల్లో ఇముడ్చుకుని నువ్వు బాధపడుతుంటే నాకు చాలా బాధగా ఉంది. చెప్పు. నీ కష్టాన్నీ, బాధనీ నేను కూడా పంచుకుంటాను". దినేష్ జాలిగా అలా అడుగుతుంటే కళ్లల్లో నీళ్లు తిరిగాయి దేవేంద్రకి.

'చెపుతానురా.... దినేష్! కాని నేను చెప్పేది వినే ముందు నువ్వు నాకో మాట ఇవ్వాలి".

"ఏమిటిరా అది?"

"ఒరేయ్ దినేష్! నేను రెండు రోజులలో

## సౌదామిని

చనిపోవటం ఎలాగు ఖాయం. కాని నా దురదృష్టం నిన్ను కూడా కబళించకూడదు. నేను ఎలా చనిపోయినా నా ప్రాణమిత్రుడి ఒడిలో చనిపోదామన్న ఆశతో నిన్ను రప్పించుకున్నాను. కాని ఇందాక సౌదామిని నిన్ను కూడా చంపుతానని చెప్పి వెళ్లింది. ఆ మాటే నేను భరించలేకుండా ఉన్నాను. కనుక రేపు తెల్లవారుతూనే నువ్వు వెళ్లిపో". నిస్సహాయంగా దేవేంద్ర అలా అంటుంటే దినేష్ విస్తుపోయాడు.

"యూ షటప్! నాన్‌సెన్స్‌గా మాట్లాడకు! నేను మూఢ నమ్మకాల్ని నమ్మేవాడిని కానని నీకు తెలియదా! చావో, బ్రతుకో నాకు ఇక్కడే తేలిపోవాలి. నువ్వు వెళ్లమన్నా వెళ్లేది లేదు దీని అంతు చూసే వరకు". మొండిగా అన్నాడు దినేష్.

దేవేంద్ర మాట్లాడలేదు. "అసలు జరిగిందేమిటో చెప్పు". మళ్లీ దినేషే అడిగాడు. దేవేంద్ర ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి చెప్పటం మొదలుపెట్టాడు.

* * * * *

"సౌదామినికి నాకు పెళ్లయిం తరువాత ఆమె కుటుంబ విషయాలు ఒక్కొక్కటే నాకు తెలిసాయి.

నేను పేదవాడినైనా సౌదామిని ఏరికోరి నన్ను పెళ్లి చేసుకుంది. సౌదామినికి ఒక అన్నయ్య ఉన్నాడట. అంటే సౌదామిని తండ్రికి పెద్ద భార్య కొడుకు. పేరు నాగరాజు. అతడు ఎన్నో వ్యసనాలకు లోనయ్యి ఆస్తి నాశనం చేస్తుంటే సౌదామిని తండ్రి ఆస్తి అంతటిని సౌదామినికి, ఆమెకు కాబోయే భర్తకి చెందేలా వీలునామా రాసి పెట్టాడట.

మా పెళ్లయ్యాక ఒక ఏడాది వరకు ఆయన బ్రతికి ఉన్నాడు. ఆయన చని పోయే రోజున వీలునామా సంగతి అందరి సమక్షంలో మాకు చెప్పి చనిపోయాడు.

తరువాత రోజు నాగరాజుకి మాకు చాలా గొడవయ్యింది. తరువాత ఏడాది వరకు నాగరాజు మాకు కనిపించ లేదు. ఒక రోజు ఉన్నట్టుండి నాగరాజు మా ఇంటికి ఊడిపడ్డాడు.

అన్నాచెల్లెళ్లు సాయంత్రం వరకు ఏం మాట్లాడుకున్నారో తెలియదు. నాగరాజు వెళ్లిపోయిన తరువాత సౌదామిని నాతో చాలా ముభావంగా ఉంది.

ఆ రాత్రి నేను అర్ధ రాత్రి వరకు కూర్చుని కథ రాసుకుంటున్నాను. సౌదామిని అలిగి పడుకుంది, ఆమెను సముదాయించి అసలు విషయం అడిగి తెలుసుకుందామని రాస్తున్న పేపర్లు ప్రక్కన పడేసి బెడ్ రూమ్ సమీపించాను.

తలుపులు ఓరగా వేసి ఉన్నాయి. లోపల లైటు వేసి లేదు. తలుపు నెమ్మదిగా తీసి లైటు వేశాను. అంతే కొయ్యబారి పోయి చూస్తూ ఉండిపోయాను.

సీలింగు ఫ్యానుకి వ్రేలాడుతోంది సౌదామిని.

ప్రక్కన డ్రస్సింగు టేబులు మీద ఒక కాగితం మడతలు పెట్టి ఉంది. ఒణుకుతున్న చేతులతో ఆ కాగితం విప్పి చదివాను.

ఇంకేముంది? తన చావుకి కారణం నేనేనని, తనకు న్యాయం చేకూర్చమని వ్రాసింది సౌదామిని. ఉత్తరం చదివాక ఏం చెయ్యాలో తోచలేదు. వెంటనే ఆ కాగితం ఉండలా చుట్టి నమిలి మింగేశాను.

ఒకసారి తల ఎత్తి సౌదామినిని చూశాను. నా ఒళ్లు జలదరించింది. ఆమె

నాలుక జానెడు పొడవున బయటకు వ్రేలాడుతోంది. కళ్ళు భయంకరంగా బయటకు పొడుచుకు వచ్చాయి. నోటిలో నుండి కారుతున్న రక్తం ఒక్కొక్క చుక్కే గచ్చు మీద పడుతోంది. అలా ఆమెను చూస్తూ ఎంత సేపు ఉన్నానో నాకే తెలియదు.

ఎక్కడో తొలి కోడి కూసేసరికి ఉలిక్కిపడ్డాను. తెల్లవారితే ఏం జరుగుతుందో తలచుకొనేసరికి తల తిరిగినంత పనయ్యింది. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాను.

సౌదామినిని క్రిందకు దింపి, భుజం మీద వేసుకుని మా పెరటిలోకి తీసుకు పోయి అక్కడ పాతి పెట్టి వచ్చి ఒక నిద్ర మాత్ర వేసుకుని పడుకున్నాను. కాని నిద్ర పట్టలేదు. అప్పటికప్పుడు సూట్‌కేస్ సర్దుకుని మా బంధువుల ఇంటికి వెళ్ళిపోయాను. సరిగ్గా వారం రోజులు ఉండి వచ్చాను. వస్తూనే ఒకసారి పెరటిలోకి వెళ్ళి చూసి వద్దామని వెళ్ళి చూస్తే ఇంకేముంది?

నేను పూడ్చిన గొయ్యి ఖాళీగా ఉంది. అందులో సౌదామిని శవం లేదు. నా గుండె గుభేలుమంది.

ఆ రాత్రి మతి చెదరి నిద్ర పట్టక మంచం మీద అటు ఇటు దొర్లుతున్నాను.

గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టింది. అప్పుడు వినిపించింది సౌదామిని నవ్వు సరిగ్గా ఈ కిటికీ దగ్గరే. నేను ఉలిక్కిపడ్డాను.

'అవును. అది సౌదామిని నవ్వే'. అనుకుంటూ నేను అటు చూశాను. కిటికీ దగ్గర మేలి ముసుగులో సౌదామిని. నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. చనిపోయినప్పుడు సౌదామిని ఏ చీరతో ఉందో అదే చీరలో ఉంది అప్పుడూను.

తననే తదేకంగా చూస్తున్న నన్ను "ప్రియా!" అని నోరారా పిలిచింది. సౌదామిని బ్రతికి ఉన్న రోజులలో కూడా అలాగే పిలిచేది. ఇంకా అనుమానంగా చూస్తున్న నాకు తన మేలి ముసుగు తీసి చూపించింది.

అంతే. ఒక్కసారిగా ఎవరో కొరడాతో వీపు మీద చరిచినట్టుగా అదిరిపడ్డాను.

కళ్ళు పొడుచుకువచ్చి, నాలుక జానెడు వ్రేలాడుతు ఉంది. ముక్కు ఉండవలసిన స్థానంలో ఎముకలు కనిపిస్తున్నాయి. ముఖం మీద చాలా భాగం చదపురుగులు తినేసిన కారణంగా చర్మం లేక వికృతంగా కనిపిస్తోంది.

సౌదామిని నవ్వింది. ఆమె నవ్వితే కోరలు భయంకరంగా కనబడుతున్నాయి. సౌదామిని మాట్లాడుతోంది.

"ప్రియా! నన్ను పాతి పెట్టి వెళ్ళిపోయావు. ఆరు రోజులు నీ కోసం ఎదురు చూశాను. కాని నువ్వు రాలేదని గోతిలోంచి నేనే లేచి వచ్చేశాను. ప్రియా! నువ్వు కూడా నా దగ్గరకు వచ్చెయ్యి. నిన్ను కూడా నాతో తీసుకు పోవటానికే నేను మళ్ళీ లేచి వచ్చాను" అని చెప్పింది. ఆమె మాట్లాడుతుంటే నోట్లో పళ్ళు కిర్రు కిర్రు మన్నాయి. నా ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. భయంతో నా ఒళ్ళు జలదరించింది. ఏదో మైకం ఆవరించి నట్టయ్యి అలాగే మంచం మీద వెనక్కి పడిపోయాను.

మరునాడు సరిగ్గా అదే సమయానికి అదే చోట ప్రత్యక్షమయ్యింది సౌదామిని.

ఈ సారి ఆమె కళ్ళు అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయి. నన్ను చూసి భయంకరంగా నవ్వింది. కోపంతో బుసలు కొట్టింది.

"మిస్టర్ దేవేంద్ర! నిన్ను నమ్మి నీతో ఏడడుగులు నడిచినందుకు నాకు ఇంత ద్రోహం చేస్తావా! చూడు. సరిగ్గా మూడు వారాలు తిరక్కుండా నిన్ను అతి ఘోరంగా చంపుతాను. నీ రక్తం తనివితీరా తాగుతాను" అని ఆమె మాయమయ్యింది. నాకు ఇక ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు.

తెల్లవారుతూనే ఇక ఈ ప్రాంతంలో ఉండకూడదనుకుంటు ప్రయాణానికి సిద్ధమవుతున్నాను. ఉన్నట్టుండి వీధి తలుపు 'భళ్ళు'న తెరచుకుంది. ఆదిరిపడి అటు చూశాను. ఎవ్వరు కనిపించలేదు. ఒక కాగితం ఉండలా చుట్టి గుమ్మంలో పడి ఉంది. భయం భయంగా ఆ కాగితం అందుకున్నాను. అందులో ఇలా ఉంది.

"మిస్టర్ దేవేంద్రా! నన్ను తప్పించుకు పోవాలని చూస్తే ఈ ఊరి పొలిమేర దాటకుండానే నువ్వు నెత్తురు క్రక్కుకుని చస్తావ్. కావాలంటే నువ్వు పడుకునే మంచం క్రిందకు చూసుకో. తల పెట్టుకునేవైపు ఎముకలు కనిపిస్తాయి. అవి నీ గదిలోకి ఎలా వచ్చాయి అని ఆలోచించకు. అవి నా మహిమ అనుకో.

నువ్వు నాకు బలి కాబోయేరోజు రాత్రికి నీ మంచంకింద పుర్రె కనిపిస్తుంది.



## జితేంద్ర డ్యాన్స్

డ్యాన్స్ ఏవిధంగా చెయ్యాలో నేర్చుకుంటున్నాడట జితేంద్ర. 'తాండవ్' అనే చిత్రానికిగాను జితేంద్ర ఈ ప్రాక్టీసు మొదలెట్టాడు. ఈ చిత్రంలో జయప్రద హీరోయిన్‌గా నటిస్తోంది. ఇద్దరూ కలసి డ్యాన్సు చెయ్యాలి కాబోలు. జయప్రదకు డ్యాన్స్‌లో అనుభవం వున్నప్పటికీ పరీక్షలో నెగ్గాల్సిందేగా! మరి జయప్రదతో జితేంద్ర ఏ విధంగా డ్యాన్సుచేస్తాడో చూసి తీరాల్సిందే!

అది కనిపించిన గంటకి నువ్వు చస్తావన్నమాట. గుర్తు ఉంచుకో" అని వ్రాసి ఉంది. నాకు నిజంగా ఏడుపు వచ్చింది. ఏం చెయ్యాలో తోచలేదు.

నా మనస్సుకి ఎక్కడో ఏర్పడింది బలహీనత. ఆ బలహీనతే నన్ను పిరికివాడిని చేసింది.

ఇంకో విషయం. సౌదామిని ఈ మూడు వారాలుగా రోజూ నా కిటికీ దగ్గరకు వచ్చి తలుపు తియ్యమని గోల చేసేది. అంటే ఆమె తలుపులు మూసిఉండగా లోపలికి రాలేదన్న విషయం నాకు అర్థమయ్యింది. అందుకే తలుపులు మూసుకునే కూర్చునేవాడిని. రోజులు దగ్గరపడేకొద్దీ నాలో ధైర్యం సన్నగిల్లింది.

ఈ సమస్యని నేను ఒక్కడినే ఎదుర్కొంటానన్న నమ్మకం నాకు కలగలేదు. అందుకే నిన్ను రప్పించుకున్నాను.

సౌదామిని పెట్టిన గడువు ఇంకో రెండు రోజులలో పూర్తవుతుంది, దేవేంద్ర చెప్పింది వింటూ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు దినేష్.

"చనిపోయిన మనిషి నిజంగా దయ్యమవుతుందా! ఇది ఎంతవరకు నిజం! అన్న మీ మాంస ఇప్పుడు అనవసరం. రెండు రోజులలో మృత్యువు దేవేంద్రుని కబళించటానికి పొంచి ఉన్నమాట నిజం. ఆ మృత్యువుతో తను పోరాడాలి.

## సౌదామిని

అంత ధైర్యవంతుడు, మొండివాడు అయిన దేవేంద్ర పరిస్థితులకు లొంగిపోయి బెంగతో, భయంతో చిక్కి శల్యమయి పోయాడంటే ఈ మూడు వారాలుగా అతడు ఎంత మానసిక సంఘర్షణకి గురి అయ్యాడో అర్థమవుతోంది.

ఈ విషయంలో రేపటినుండే తను రంగంలోకి దిగాలి. సౌదామిని అంతు చూడాలి. ఈ ప్రయత్నంలో తన ప్రాణం పోయినా ఫరవాలేదు" ఇలా ఒక నిర్ణయానికి వచ్చాక నిశ్చింతగా నిద్రపోయాడు దినేష్.

ఆ మరునాడు సౌదామిని రాని రోజు కనుక దేవేంద్ర హాయిగా గడిపాడు. మూడోనాడు సాయంత్రం వరకు బాగానే జరిగింది. ఆ రోజే సౌదామిని పెట్టిన గడువుకి ఆఖరురోజు.

రాత్రి పది గంటలకి దినేష్ బయటికి వెళ్ళాడు. అప్పటివరకు మంచం క్రింద చూడని దేవేంద్ర ఎందుకో మంచం క్రిందకి తొంగిచూశాడు. అతని గుండె ఆగినంత పనయ్యింది. తన తల దగ్గర రెండు మనిషి పుర్రెలు కనిపించాయి. అవి ఉన్నంత మేరకు రక్తం గడ్డ కట్టి ఉంది.

అవి ఎప్పుడు అక్కడ పెట్టబడ్డాయో దేవేంద్ర ఆలోచించటంలేదు. అప్పుడే పదకొండు గంటలు కొట్టింది గోడ గడియారం. దేవేంద్ర నిలువునా కంపించిపోయాడు. దినేష్ వెళ్ళాక తను పది నిమిషాలేగా కళ్ళు మూసుకున్నాడు. ఈలోగా ఎవరు లోపలికి వచ్చారు! ఇంకో గంటలో మిత్రుడితోపాటు తను దారుణంగా చంపబడటం ఖాయం.' ఇలా ఆలోచిస్తూ ఉండగానే దినేష్ వచ్చాడు.

ఒణుకుతున్న చేతులతో మంచం క్రిందకి చూపించాడు దేవేంద్ర. దినేష్ మనిషి పుర్రెలు చూసి గంభీరంగా ఉండిపోయాడు.

గోడ గడియారం అరగంట కొట్టింది. దినేష్ లేచాడు. దేవేంద్ర ఉన్న గదికి రెండు వైపుల ద్వారాలున్నాయి. ఒకవైపు ద్వారం తలుపులు మూసి లోపల గడియ వేశాడు. దేవేంద్రని పడుకోమని అతనికి ఇన్‌స్ట్రక్షన్ చేశాడు. దేవేంద్ర కళ్ళు మూసుకున్నాక రెండవ వైపు తలుపులు మూసి బయట గొళ్ళెంపెట్టి తాళం వేశాడు.

మృత్యువు ఇప్పుడు దేవేంద్రని ఎలా కబళించగలదో చూడాలి. 'డియర్ ఫ్రెండ్! నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు" మనస్సులో అనుకుంటు చీకటిలో కలసిపోయాడు దినేష్.

గోడ గడియారం పన్నెండు గంటలు కొట్టేసరికి కిటికీ దగ్గర నిలబడిఉంది సౌదామిని.

"ప్రియా! ప్రియా!" అంటు తన



# హల్లో! డాక్టర్ నేనేం చెయ్యాలి?



డా. కొత్త రవీంద్రబాబు

**ఎన్.ఎస్.బి. నెల్లూరు.**

ప్ర: పై వరసలో 32 కింద వరుసలో రెండు దంతాలు పొడవుగా వున్నాయి.

జ: సహజంగానే కోరపళ్లు మిగిలిన వాటికన్నా పొడవుగా వుంటాయి. ఏ పంటినైనా అరగదీసి లేదా కొంత భాగం తీసి పైన క్లిప్ పెట్టే వీలుంది. దంత వైద్యులను సంప్రదించండి.

**వి. సీతీష్, మాచవరం.**

ప్ర: శాడిజం పోవాలి.

జ: శాడిజం అందరిలోనూవుం టుంది. ఇతరులను హింసించేవారు కొందరు తమను తాము హింసించు కుంటూ తద్వారా ఇతరులను బాధించే వారు కొందరు.

హద్దుమీరిన శాడిజం వలన ఇతరులు బాధపడ్తారు. శాడిజం ఎక్కువ పాళ్లున్న రచనలు త్వరలో పాఠకామోదం పొందటం సహజం! సినిమాలూ అంతే!

అయితే శాడిజం ప్రభావం తాటాకు మంటలా భగ్గున కాలి ఆరిపోతుంది!

మనిషి రక్తం రుచి చూచిన పులిలా శాడిస్ట్ నిరంతరం యితరులను బాధిం చాలని చూస్తాడు. వచ్చిన చిక్కేమిటంటే శాడిస్ట్‌ను ప్రోత్సహించే వాళ్లెక్కువ, నిగ్ర హించేవాళ్లు తక్కువ.

పక్క మనిషిని బజారులో పడేసి బాదుతుంటే అందరూ నిలబడి చూస్తుం టారు- కొందరే అడ్డువస్తారు.

ఇతరులకు గాని తనకుగాని హానికల్గిం చేదైనా నీచప్రవృత్తే!

ఉదాత్తభావాలను మనసులో నింపు కుని ఇతరులకు సాయపడడంలో ఆనందం పొందండి.

తీరికలేని వ్యాపకాలలో నిమగ్నులయి మనసుకు 'శరీరానికి అలుపు తెప్పించు కుంటుంటే శాడిజం నుండి బయటపడే వీలుంటుందేమో?

పాశవిక ప్రవృత్తి రేకెత్తించే నవలకు సినిమాలకు దూరంగా వుండండి. ఉదాత్త భావనలు పెంపొందించే కవితలు చదవండి మనుష్యులకు దూరంగా ప్రకృతి సౌంద ర్యాన్ని ఆస్వాదిస్తూ కాలం గడపటానికి ప్రయత్నించండి.

**మంగతాయారు, పెనుగొండ.**

ప్ర: అజీర్తి, జిగటనొప్పి సన్నగా ఉంటాను. మావారికి రతిసుఖం యివ్వ లేను.

జ: మెట్రోక్సీన్ బిళ్లలు రోజుకు మూడు చొప్పున వారం రోజులు వాడండి. పాంజినార్మ్ బిళ్లలు రోజు మూడు చొప్పున అయిదారు నెలలు వాడండి. డెపోడయాజ్ బిళ్ల రాత్రి పడుకోబోయే ముందు నెలరో జుల పాటు వాడండి.

రతి విషయంలో డిఫీటిస్ట్‌లాగా నెగె టివ్‌గా ఆలోచించక సంతోషంగా ఉత్సా హంగా వుండి మీ వారిని ప్రోత్సహించండి.

జైలోకెయిన్ ఆయింట్‌మెంట్ రతి సమయానికి ముందు యోనిలోపల బయట రాసుకుంటే నొప్పి వుండకపోవచ్చు! భర్తను సుఖపెట్టాలన్న కోర్కె వుందన్నారు. ఆ కోర్కెను మీ మనసులోని భయాలను పోగొట్టే ఆయుధంలా వాడుకోండి.

o

మెదడు పై కమాండ్‌చేసే పిలుపు వినిపించేసరికి దినేష్ ఇచ్చిన మత్తు ఇన్జక్షన్ దేవేంద్ర మెదడుమీద పని చెయ్యడం మానేసింది.

ఒక్కసారిగా కళ్లు తెరిచాడు దేవేంద్ర. చురుగ్గాలేచి నిలబడ్డాడు.

"కుడి వైపు తలుపులు తెరు" సౌదామిని కంఠం కమాండ్ చేస్తోంది. దేవేంద్ర రెండడుగులు వేశాడు.

సరిగ్గా అదే సమయంలో కిటికీ దగ్గర "కెవ్" మన్న అరుపు. అది సౌదామిని కంఠం కాదు. ఒక మగ గొంతు.

సౌదామిని గొంతు వినిపించక పోయేసరికి దేవేంద్ర వేసే మూడో అడుగు బంధం వేసినట్టు ఆగిపోయింది. అప్పుడు పని చేసింది మత్తుమందు దేవేంద్ర మెదడుమీద. వెంటనే ప్రక్కకు నేలమీద జారిపోయాడు.

* * * * *

"హల్లో... దినేష్' కూర్చో... కూర్చో! ఇదేనా రావటం. ట్రైన్ లేటయ్యిందా ఏమిటి ఈవేళప్పుడు వచ్చావు!"

"అవును. ఎలా ఉంది నీ ఆరోగ్యం?" చలాకీగా ఉన్న దేవేంద్రని చూసి నవ్వుకుంటూ అడిగాడు దినేష్.

"సో... ఫైన్!" ఏడాదిక్రితం ఆ సంఘటనలు తలచుకుంటే ఇప్పటికీ ఒళ్ళు గగుర్పొడుస్తుంది. నిజంగా ఆస్థికోసం నాగరాజు అంత దారుణానికి పూనుకుంటాడని కలలో కూడా నేను ఊహించలేదు.

చనిపోయిన సౌదామినియే బ్రతికి వచ్చిందా అన్నట్టు ఆ మిమిక్రీ ఆర్టిస్టు భలే యాక్షన్ చేశాడు సుమా! నేను నిజంగానే నమ్మేశాను.

అతనికి డబ్బు ఆశ చూపి సౌదామినిలా వేషం వేయించి ఆమెలా మాట్లాడించి నన్ను భలే భయపెట్టాడు నాగరాజు.

సౌదామినికి ఒక ఫోటో చూపించి, ఆ ఫోటోలో నాతో పాటు ఇంకెవరో అమ్మాయి ఉండేలా సృష్టించి దానికి చిలవలు పలవలువేసి కథలల్లి సౌదామినికి చెప్పి, ఆమె తండ్రికి కూడా నేనే విషం పెట్టి చంపానని చెప్పి, ఆమె బాధగా ఏమరుపాటుగా ఉండటంచూసి ఆమెను గొంతు నులిమి హత్యచేసి, ఆ హత్యను ఆత్మహత్యగా పరిగణించేలా చేసి తెర వెనక్కి తప్పుకుని ఇంత నాటకం ఆడతాడని నేనెలా ఊహించగలను!

ఇవన్నీ తెలియని నేను భలే మోసపోయాను. ఆనాడు నువ్వు ఈ విషయాలన్నీ తెలుసుకుని నన్ను సమయానికి రక్షించి ఉండకపోతే ఈసరికి ఈ దేవేంద్ర చనిపోయి ఏడాది అయి ఉండేది. అలా చెపుతున్నప్పుడు దేవేంద్ర ముఖంలో చూచాయగా కనిపించే భయం చూసి చిన్నగా నవ్వుకున్నాడు దినేష్.

o

సీరియల్

# హాట్ ట్విన్స్



## జి.వి.అమరేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

ఆది కాలేషా జీప్.

ఇగ్నిషన్ కీస్ జీప్‌లోనే ఉన్నాయి.

నల్లముత్తు దూకడం దూకడం జీప్ స్టార్ట్ చేశాడు. పొగ మేఘాలు కక్కుతూ కింగ్‌కోటీ వైపు దూసుకు పోయింది విల్లీస్ జీప్.

తను వేటాడవలసిన మనిషి జీప్‌లో పారిపోవడం గమనించాడు శివాజీ. వెంటనే బయటకు పరుగుతీశాడు. సరీగ్గా ఆ సమయంలో ఎమ్యూజ్‌మెంట్ పార్క్‌లో ఓ మూల పెద్ద మంట నాల్కలు చాస్తూ పైకి లేచింది.

ఎమ్యూజ్‌మెంట్ పార్క్‌కు వచ్చిన కష్టమర్లు ఓ మూలగా ఉన్న పెట్రోల్ డ్రమ్ములు పగలకొట్టి నిప్పు ముట్టించారు. చూస్తుండగానే నాల్కలు చాస్తున్న మంట నింగికి అంటే ఎత్తు పెరిగి పెద్దదయ్యింది.

జరిగిన సంఘటనకు కాలేషా పిచ్చిగా అరుస్తూ జుట్టు పీక్కోసాగాడు.

కింగ్‌కోటీలో శంకర్‌దాదా ఆధ్వర్యంలో నడుస్తోంది మట్కా వ్యాపారం.

ఆ రోజు ఉదయం ఓపెనింగ్ సిక్స్ క్లోజింగ్ నైన్ మీద వంద రూపాయలు పందెం కాశాడు నల్లముత్తు.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు శంకర్‌దాదా బడ్డీ కొట్టుకు వేలాడదీసిన పలక మీద ఓపెనింగ్ సిక్స్ వచ్చింది. ఆ లెక్క ప్రకారం నల్లముత్తుకు ఒకటికి తొమ్మిది రెట్ల చొప్పున తొమ్మిది వందల రూపాయలు రావాలి.

క్లోజింగ్ నెంబర్ తొమ్మిది కనక వస్తే మరో తొమ్మిది వందలు నల్లముత్తుకు దక్కుతై.

నల్లముత్తు జీప్ రాంబాణంలా దూసుకు పోతోంది. అతడి జీప్‌కు అర్ధ కిలో మీటరు దూరంలో వస్తోంది వ్యాన్‌గార్డ్. నల్లముత్తు జీప్‌ను కొంత దూరం ముందుకు పోనిచ్చి షాలిమార్ థియేటర్ దగ్గిర టర్న్ తీసుకునే సమయంలో స్లో చేసి రోడ్డు ప్రక్కనే పో ఉన్న ఇసుక కుప్ప మీదికి దూకేశాడు.

నేరుగా అదే వేగంలో ప్రయాణించి జీప్ రోడ్డు ప్రక్కన ఉన్న ఎలక్ట్రి ట్రాన్స్‌ఫారంలోకి దూసుకు పోయింది మరుక్షణం అక్కడ అతి పెద్ద విస్ఫోట జరిగింది. బాంబులా పేలిన జీ మంటలు కక్కుతూ కాలిపోసాగింది.

ఇసుక కుప్ప మీదికి దూకిన నల్లముత్తుకు ఎక్కువ దెబ్బలు తగల్లేదు. అతడు శంకర్‌దాదా మట్కా సెంటర్ వయిపు వేగంగా దౌడుతీశాడు.

నల్లముత్తు జీప్‌ను అనుసరిస్తూ వచ్చిన శివాజీ వ్యాన్‌గార్డ్‌ను సడన్ బ్రేకుతో ఆపాడు. ఎలక్ట్రిక్ ట్రాన్స్‌ఫార్మర్ ధ్వంసం అవడం వల్ల కరెంట్ ఫెయిలై అకస్మాత్తుగా ఆ ప్రాంతంలో చీకటి ఆవరించింది.

మంటల్లో భస్మీపటలం అవుతున్న జీప్ వంక శివాజీ నిశితంగా చూశాడు.

అతడికి నల్లముత్తు శరీరం కనపడలేదు. పైగా మనిషి శరీరం కాలుతున్నప్పుడు వెలువడే కమురు కంపు కూడా లేదు.

నల్లముత్తు పాదరసంలా జారుకున్నాడనే విషయం గ్రహించాడు శివాజీ. వెంటనే డ్రయివింగ్ సీట్‌లోకి దూకి వ్యాన్‌గార్డ్‌ను ముందుకు దూకించాడు.

"ఇందాక నల్లముత్తు గురించి వాడి పక్కింటి మనిషి ఏం చెప్పాడు?" రజనిని అడిగాడు.

"ఉంటే ఎమ్యూజ్‌మెంట్ పార్క్‌లో ఉంటాడు. లేకపోతే శంకర్‌దాదా మట్కా సెంటర్‌లో ఉంటాడని చెప్పాడు.

**ఇంతవరకూ సాగిన కథ-14:** మారుపేర్లతో మోసాలకు అలవాటుపడి వచ్చిన దాంట్లో సమంగా పంచుకుంటూ కాలం గడుపుతుంటారు శివాజీ-రజని. మోహిని మోజులో పడిన కాశీప్రసాద్ తన భార్య పార్వతిని కురియన్, నల్లముత్తు, ఎర్రతేలుల ద్వారా హత్య చేయిస్తాడు. ఆ హత్యను కళ్లారా చూసిన శివాజీ తల్లిదండ్రులను, చెల్లిని కురియన్ బృందం చంపేస్తారు. ఇది తెలిసిన శివాజీ కురియన్‌ను, ఎర్రతేలును పథకం ప్రకారం చంపేస్తాడు. ఇక మూడవ వ్యక్తి నల్లముత్తును చంపే యత్నంలో వుంటాడు శివాజీ.

"మనం ఇప్పుడు శంకర్‌దాదా మట్కా సెంటర్‌కి వెడుతున్నా" అంటూ మరింత వేగంగా మట్కా సెంటర్ వైపు కారు టర్న్ చేశాడు.

ఇసుక కుప్ప మీదినుంచి లేచి శంకర్‌దాదా మట్కా సెంటర్ వయిపు పరుగు తీసిన నల్లముత్తు అయిదు నిముషాల్లో తన గమ్యస్థానం చేరుకున్నాడు.

శంకర్‌దాదా బడ్డీకొట్టు బయట వేలాడుతున్న పలకమీద క్లోజింగ్ నెంబర్ తొమ్మిది వేసి ఉంది. నల్లముత్తు రెట్టించిన ఉత్సాహంతో జేబునుండి చిన్న కాగితం ముక్క బయటకు తీశాడు. దానిమీద శంకర్‌దాదా సంతకం. సంతకం క్రిందుగా వంద రూపాయల ఎమౌంట్ వేసి ఉంది. ఆ చీటీని శంకర్‌దాదా అనుచరుడు భిల్లూదాదా చేతికి అందించాడు నల్లముత్తు.

వెంటనే భిల్లూదాదా పద్దెనిమిది వంద రూపాయల నోట్లు నల్లముత్తు చేతిలో పెట్టాడు.

వీధిలైట్ల కాంతిలో ఆ నోట్లు లెక్క పెట్టుకో సాగాడు నల్లముత్తు.

సరీగ్గా ఆ సమయంలో పడింది అతడి మెడమీద బలమయిన ముష్టిఘాతం.

ఆ దెబ్బకు నల్లముత్తు మూడు గజాల దూరం వెళ్ళి పడ్డాడు. అతడి చేతిలోని వంద రూపాయల నోట్లు చెల్లా చెదురుగా పడిపోయాయి.



నల్లముత్తు పైకి లేచే ప్రయత్నం చేశాడు. ఈసారి అతడి గుండెలమీద తన్నాడు శివాజీ. ఆ తన్నుకు నల్లముత్తు గుండె రెండు క్షణాలు ఆగి మళ్ళీ కొట్టుకోవడం ప్రారంభించింది.

శివాజీ నడుముకున్న లెదర్ బెల్ట్ తీసి గాలిలో ఝుళిపించి దాన్ని నల్లముత్తు మీద ప్రయోగించాడు. బెల్టు తగిలిన చోట ముఖంమీద నిలువుగా వాత పడింది. క్రింది పెదవి రెండుగా తెగి రక్తం కారసాగింది.

నల్లముత్తు బాధగా అరిచాడు. అరుస్తూనే మెరుపులా పేష్కప్ పైకి తీశాడు. ఒక ప్రక్కన రంపంలా ఉండి, మరొక ప్రక్కన పదునైన బ్లేడు ఉంది.




రాంబో సినిమాలో హీరో చేతుల్లో ఉండే పేష్కప్‌ను గుర్తుకు తెచ్చే విధంగా ఉందది.

చేతిలోకి ఆయుధం రావడంతో నల్లముత్తుకు ధైర్యం వచ్చింది. అతడు పెద్దగా ఘీంకారంచేసి శివాజీ వయిపు దూసుకు పోయాడు.

శివాజీ చేతిలోని లెదర్ బెల్ట్ మరొకసారి గాల్లోకి లేచింది. అది నాగాస్త్రంలా నల్లముత్తు మెడకు చుట్టుకుంది. శివాజీ బెల్ట్ బలంగా లాగడంతో నల్లముత్తు బోర్లాపడి పోయాడు. అతడి నుదురు నేలకు తగిలింది. ముక్కు నుంచి రక్తం కారసాగింది. నల్లముత్తు తేరుకునేలోపే పేష్కప్ పట్టుకున్న అతడి చేతిమీద బూటు కాలితో బలంగా అదిమాడు శివాజీ.

నల్లముత్తు మధ్య వేలు పుటుక్కున విరిగింది. అతడు పెద్దగా ఆర్తనాదం చేశాడు. అతడి చేతిలోని పేష్కప్ జారిపోయింది. శివాజీ దాన్ని అందుకున్నాడు.

తన ఆయుధం ప్రత్యర్థి చేతుల్లోకి వెళ్ళగానే నల్లముత్తు బిక్కచచ్చి పోయాడు. అతడి ముఖం పాలి పోయింది.

శివాజీ పేష్కప్ నల్లముత్తు కంఠం మీద పైకి ఉబికిన రక్తనాళానికి ఆన్చాడు.

అతడు కనక పేష్కప్‌ను ఏమాత్రం ప్రెస్ చేసినా రక్తనాళం తెగి నల్లముత్తు అరగంటసేపు నానా బాధా అనుభవించి చావడం ఖాయం.

"నేను తల్చుకుంటే నిన్ను ఇపుడు చంపిపారేయగలను... కాని నేను ఆ పని చేయను.. మనం ఇపుడు ఒక పబ్లిక్ టెలిఫోన్ బూత్‌కు వెళ్ళాలి. అక్కడి నుంచి నీ బాస్ కాశీప్రసాద్‌తో నేను చెప్పిన విషయం మాట్లాడాలి."

నల్లముత్తు సరేనంటూ తల ఊపాడు.

ఆ పక్కనే ఉంది పబ్లిక్ టెలిఫోన్ బూత్. శివాజీ నల్లముత్తును టెలిఫోన్ బూత్ వయిపు నడిపించుకుంటూ వెళ్ళాడు.

శివాజీ నల్లముత్తును చావ చితక తంతున్నపుడు మట్కా ఆడడానికి వచ్చిన ఒక్కమనిషి కూడా అడ్డుపోలేదు. ఆ ప్రదేశంలో దొమ్మీలు, హత్యలు సర్వసాధారణం. ప్రాణాలతో బ్రతికి ఉండాలంటే అలాంటివి జరుగుతున్నపుడు అడ్డుపోకుండా ఉండడం మంచిదని అక్కడి జనాలకు తెలుసు.

శివాజీ టైము చూసుకున్నాడు.

తొమ్మిదిన్నర.

ఆ సమయంలో కాశీప్రసాద్ ఉండవచ్చు. శివాజీ నల్లముత్తుకు కాశీప్రసాద్‌తో ఏం మాట్లాడాలో వివరించాడు. తరువాత స్వయంగా కాశీప్రసాద్ ఫోన్ రింగ్ చేసి అవతల్నించి రెస్పాన్స్ వచ్చిన తర్వాత రిసీవర్ నల్లముత్తుకు ఇచ్చాడు. కాశీప్రసాద్ 'హలో' అనగానే నల్లముత్తు బదులు చెప్పాడు.

"నేనే బాస్. నల్లముత్తుని. ఊర్నించి ఎపుడు వచ్చారు బాస్"

"పొద్దునే వచ్చాన్రా. ఇంతవరకూ ఎర్రతేలూ, కురియన్ ఎక్కడ చచ్చారు. అసలు మీరు చచ్చారా? బతికే ఉన్నారా?"

"చచ్చాం... సారీ.. బ్రతికే ఉన్నాం బాస్.. ఇంతకూ మీ భార్య పార్వతిని చంపితే యాభై వేలు ఇస్తానన్నారు కదా బాస్. ఆ డబ్బులు ఎపుడు ఇస్తారు బాస్.. వాటి కోసం ఇపుడే రమ్మంటారా బాస్"

"ఒరే బద్మాష్ నాయాల.. నేనేం చెప్పాను... పార్వతిని కనక మీ స్వంత తెలివితేటల్తో ప్లాన్ వేసి చంపితే యాభై వేలు ఇస్తా అన్నాను. కానీ మీరేం చేశారు. కురియన్ గాడు వేసిన షాడిలియర్ ప్లాన్, ఎర్రతేలుగాడి కారు బ్రేకులు తీసేసే ప్లాన్, నువ్వు చెప్పిన గ్యాస్ స్టవ్ ప్లాన్ మూడు ప్లాన్లూ తుస్సుమన్న తర్వాతే గదా నేను మాస్టర్ ప్లాన్ వేసింది. కాకపోతే అదేరోజు పార్వతిని ఆ శివాజీ, రజని అనేవాళ్ళు కిడ్నాప్ చేయడంతో వాళ్ళ ఇంట్లోనే మీరు గ్లవ్‌జస్ తొడుక్కుని వాళ్ళు ఉపయోగించిన

కూరగాయల కత్తుల్తో చంపేశారు. అంతకు మించి ఏం చేశారు! ప్లాన్ నాది... పని మీది కనక మీకు ఒక్కొక్కళ్ళకి యాభై వేలు ఈయడం కుదర్దు. పాతిక వేలకు ఒక్క పైసా కూడా ఎక్కువ ఇవ్వను. అందుకు ఇష్టం అయితే రేపొద్దున్న మీరు ముగ్గురూ రండి. క్యాష్ పట్టుకు పొండి. అసలు నువ్వు కనక రెండు నిమిషాలు ఆలస్యంగా ఫోన్ చేసి ఉంటే మోహిని ఇంటికి వెళ్ళిపోయి ఉండేవాడిని. అన్నట్టు డబ్బు కోసం రేపొద్దున ఇక్కడికి రావద్దు. మోహిని ఇంటికి రండి..''

"అలాగే బాస్"

కాశీప్రసాద్ ఫోన్ క్రెడిల్ చేసిన శబ్దం వినపడింది.

వెంటనే శివాజీ రిసీవర్ హుక్ మీద ఉంచాడు. నల్లముత్తు నడిగి కాశీప్రసాద్ ఫోన్‌లో ఏం మాట్లాడాడో తెలుసుకున్నాడు.

"ఇక నన్ను వదిలేస్తావా?" ఆశగా అడిగాడు నల్లముత్తు.

"అపుడే కాదు ఇంకా నీతో పని పూర్తి కాలేదు" అంటూ అతడిని నడిపించుకుంటూ వ్యాన్ గార్డ్ వైపు నడిచాడు శివాజీ.

"ఎక్కడికి నన్ను ఎక్కడికి తీసుకుపోతున్నావ్"

కీచుగా అరిచాడు నల్లముత్తు.

బదులుగా శివాజీ అతడి మూతి మీద బలంగా ఒక్క గుద్దు గుద్దాడు.

నల్లముత్తు పన్ను ఒకటి ఊడింది. రక్తం బొట బొట కారింది.

"ఇలాంటి చచ్చు ప్రశ్నలు వేశావంటే నీ పళ్ళు మొత్తం ఊడిపోతై జాగ్రత్త"

శివాజీ నల్లముత్తును హెచ్చరించాడు.

దాంతో నల్లముత్తు ఠక్కున నోరు మూసుకున్నాడు.

కొంత దూరం వెళ్ళిన తర్వాత శివాజీ ఒక జనరల్ స్టోర్స్ ముందు కారు ఆపి ఒక మైనపు వత్తి కొన్నాడు. ఇక మార్గమధ్యంలో అతడు ఎక్కడా ఆపలేదు.

నేరుగా కాశీప్రసాద్ ఫిల్లింగ్ స్టేషన్ వెనకభాగంలో కారు ఆపాడు.

నగరంలో కాశీప్రసాద్‌కు అరడజను పెట్రోల్ బంకులున్నాయి. వాటిల్లో కాశీప్రసాద్ ఫిల్లింగ్ స్టేషన్ కూడా ఒకటి.

ఆ అరడజను పెట్రోల్ బంకుల్లోనూ కల్తీ జోరుగా జరుగుతుంది. పెట్రోల్‌లో కిరోసిన్ కలిపి అమ్మడం వల్ల కాశీప్రసాద్‌కు ప్రతిరోజూ ఆరు బంకుల మీదా పాతిక వేల రూపాయలు అదనపు ఆదాయం వస్తుంది.

పెట్రోల్ బంక్ ఆపాటికే క్లోజ్ అయిపోయింది.

శివాజీ నల్లముత్తును బంక్ వెనకాల ఉన్న గోడౌను వైపు నడిపించుకు వెళ్ళాడు. రజని వాళ్ళను అనుసరించింది. గోడౌను షట్టర్‌కున్న తాళాన్ని తీయడానికి అయిదు నిమిషాలు పట్టింది. తర్వాత లోపల ఓ మూలగా పడిఉన్న కుర్చీ వైపు చేయి చూపిస్తూ నల్లముత్తును కూర్చోమంటూ సైగ చేశాడు.

నల్లముత్తు మాట్లాడకుండా శివాజీ చెప్పిన పని చేశాడు. అలా చేయకపోతే ఈసారి మరొక పన్ను ఊడిపోతుందని అతడికి తెలుసు.

"చెప్పిన మాట వింటే నిన్ను నా చేతుల్తో చంపను అర్థం అయ్యిందా"

శివాజీ హెచ్చరించాడు.

నల్లముత్తు తల ఊపాడు.



"రజనీ కార్లో ఉన్న నైలాన్ తాడు పట్రా"

రజని తల ఊపి బయటకు వెళ్ళి నైలాన్ తాడుతో తిరిగి వచ్చింది.

"వీడిని కదలకుండా కట్టెయ్"

శివాజీ చెప్పిన పని చేయడానికి రజనికి పది నిమిషాల సమయం తీసుకుంది.

"ఇపుడు ఆ మూల పడి ఉన్న పాతగుడ్డలు తెచ్చి అరవకుండా వాడి నోట్లో కుక్కు.."

రజని ఓ మూలన పడి ఉన్న పాత గుడ్డముక్కలు తెచ్చింది. అవి ఆయిల్ మరకలతో నిండి ఉన్నాయి. వాటిని ఉండగా చుట్టి నల్లముత్తు నోట్లో కుక్కింది.

శివాజీ జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు. టెన్షన్ తగ్గించుకోవడానికి రెండు దమ్ములు లాగాడు.

తర్వాత ఒక ఖాళీ ఆయిల్ డబ్బా తీసుకువచ్చి నల్లముత్తు ముందు పెట్టాడు.

జేబులోంచి కొవ్వొత్తి తీసి దాన్ని సిగర్ లైటర్‌తో వెలిగించి ఆయిల్ డబ్బా మీద పెట్టాడు.

నల్లముత్తుకు శివాజీ ఏం చేయబోతున్నాడో అర్థం కాలేదు.

రజని పరిస్థితి కూడా అదేవిధంగా ఉంది.

శివాజీ కిటికీలో పడి ఉన్న 'ఓపెనర్' అందుకున్నాడు. అది పీపాలకు బిగించిన మూతలు తెరవడానికి ఉపకరిస్తుంది.

శివాజీ ఒక పెట్రోల్ డ్రమ్ముకున్న మూత తెరవబోతూ ఆగాడు. అతడి దృష్టి తన వేళ్ళ మధ్య కాలుతున్న సిగరెట్ మీద పడింది. అది ఉండడం ప్రమాదకరం.

దాన్ని కిటికీలోంచి బయటకు విసిరాడు. తర్వాత పెట్రోల్ డ్రమ్ముకున్న మూత ఊడదీశాడు. పెట్రోల్ ధారగా కారసాగింది. అక్కడ మొత్తం పది డ్రమ్ములున్నాయి. శివాజీ చకచకా వాటి మూతలన్నీ ఓపెన్ చూశాడు.

ఆ గదిలో పెట్రోల్ మడుగు కట్ట సాగింది.

క్షణక్షణానికీ పెట్రోల్ మట్టం పెరగ సాగింది.

## బృహన్నల విగ్!

బి.ఆర్. చోప్రా అండ్ కంపెనీ ప్రోడక్ట్ మహాభారతంలో అర్జున్ పాత్రధారి ఫిరోజ్ ఖాన్- ఆ మధ్య బృహన్నల వేషాన్ని ప్రజలు మెచ్చుకోవటంతో తెగ సంబరపడిపోయా డు. ఆ వేషంకి రూపాగంగూలీ విగ్‌ని ధరించాడట ఆయన. అంటే రూపా వెంట్రుకల్ని నెత్తిన ధరించి, బృహన్నల వేషాన్ని వేసి మెప్పించాడన్నమాట... ఈ విజయాన్ని రూపా విగ్‌కి ఇవ్వాలా- లేక ఫిరోజ్ ఖాన్ నిజంగానే ఈ వేషానికి తగినవాడా... ప్రేక్షకులే నిర్ణయించాల్సిన సంగతిది!

- రాభారకసుం



శివాజీ నల్లముత్తు ముఖంలో ముఖంపెట్టి చెప్పాడు.

"చూడు ముత్తూ! కొవ్వొత్తి కరుగుతూ క్రిందికి దిగుతోంది. పెట్రోల్ మట్టం క్రమక్రమంగా పైకి పెరుగుతోంది. ఆ రెండు కలిసిన మరుక్షణం నువ్వు సజీవ దహనం అయ్యి మరీ ఛస్తావ్. అమాయకులైన నా తల్లిని, తండ్రిని, చెల్లెల్ని, నీ బాస్ భార్యనూ చంపిన నీకు ఇది చాలా చిన్న శిక్ష."

శివాజీ బయటకు వెళ్ళబోయే ముందు గదిలో వెలుగుతున్న స్విచ్ ఆఫ్ చేశాడు.

బయటకు వెళ్ళి షట్టర్ క్రిందికి దించి వ్యాన్ గార్డ్ వైపు నడిచాడు.

అతడున్న ప్రదేశం నుండి గోడౌన్ కిటికీ, కిటికీ గుండా వెలుగుతున్న కొవ్వొత్తి కనపడుతున్నాయి.

పది నిమిషాలు గడిచాయి.

కొవ్వొత్తి క్రమక్రమంగా కరగసాగింది.

పెట్రోల్ అంతకంటే వెయ్యి రెట్ల వేగంతో పైకి రాసాగింది.

ఇపుడు రెండింటి మధ్య ఒక్క మిల్లీ మీటరు తేడాకు మించి ఉండదు.

సరిగ్గా ఆ సమయంలో

ఒక్కసారిగా రివ్వున గాలి వీచింది.

అటూ ఇటూ ఊగిసలాడుతున్న కొవ్వొత్తి మంట తప్పున ఆరిపోయింది.

* * * * * *

కొవ్వొత్తి ఆరిపోయిన వెంటనే నల్లముత్తు కళ్ళు ఆనందంగా మెరిశాయి.

దూరంగా నిలబడి చూస్తున్న శివాజీ నిస్పృహగా నిట్టూర్చాడు. గాలి మరొకసారి రివ్వున వీచింది.

ఆ చీకట్లో గోడౌన్ బయట ఎర్రటి నిప్పు కణికలా మెరుస్తున్న సిగరెట్ వేగంగా దొర్లింది.

అది శివాజీ విసిరిన సిగరెట్‌పీక.

షట్టర్ సందుల్లోంచి బయటకు కారుతున్న పెట్రోల్ వయిపు ఎర్రగా వెలుగుతున్న సిగరెట్ ముక్క దొర్లింది.

క్షణంలో వెయ్యో వంతు కాలంలో అక్కడ మంటలు అలుముకున్నాయి. ఆ మంటల్లో గోడౌన్ భస్మీపటలం అవసాగింది.

మనిషి శరీరం కాలిన వాసన ఆ చుట్టుపక్కల వ్యాపించింది.

శివాజీ తృప్తి నిండిన నవ్వు నవ్వి వ్యాన్‌గార్డ్ ముందుకు దూకించాడు.

మర్నాడు ఉదయం పది గంటలకు శివాజీ టెలిఫోన్స్ ఆఫీస్‌కు ఫోన్ చేసి రంగారావ్ గురించి ఎంక్వయిరీ చేశాడు.

రంగారావ్ డ్యూటీ పదిన్నరకు మొదలవుతుందనీ మరో గంట ఆగి ఫోన్ చేస్తే గ్యారెంటీగా సీట్‌లో ఉంటాడనీ అవతల్నుంచి సమాధానం వచ్చింది.

శివాజీ గంటసేపు ఆగి మరో సారి ఫోన్ చేశాడు.

ఈసారి రంగారావ్ లైన్‌లోకి వచ్చాడు. వెంటనే శివాజీ గొంతు గుర్తుపట్టాడు.

"నేను మీకోసం ఇందు డీలక్స్ ముందు ఎదురుగా చూస్తుంటా వెంటనే రండి".

"ఫైవ్ మినిట్స్‌లో వచ్చేస్తా"

రంగారావ్ ఫోన్ పెట్టేశాడు.

శివాజీ, రజని ఇందు డీలక్స్ హోటల్ ముందు రంగారావ్ కోసం వెయిట్ చేయసాగారు.

అరగంట తర్వాత రంగారావ్ వచ్చాడు.

తను ఆలస్యంగా వచ్చినందుకు సంజాయిషీ చెప్పుకున్నాడు.

"క్యాసెట్... ఎవరూ చూడకుండా తీసుకురావడానికి కాస్త కష్టపడవలసి వచ్చింది." అన్నాడు.

"కాళీప్రసాద్ ఫోన్ ఇప్పటి వరకూ అబ్జర్వేషన్‌లో ఉందా"

"ఉంది నేను క్యాసెట్ తీసేవరకూ అతడి ఇంటికి వచ్చిన ప్రతి ఫోన్ కాలూ రికార్డయ్యింది. మీకు అవసరం అయితే టేప్ ప్లే చేసి చూసుకోవచ్చు."

శివాజీ రంగారావ్ చేతినుండి క్యాసెట్ తీసుకుని వ్యాన్‌గార్డ్ వయిపు నడిచాడు.

వ్యాన్ గార్డ్‌లో ఉన్న టేప్ రికార్డర్‌లో ఇన్‌ఫర్ట్ చేసి ప్లే బటన్ నొక్కాడు.

తనకు అవసరం అయిన సంభాషణ రాగానే జాగ్రత్తగా వినసాగాడు.

"నేనే బాస్ నల్లముత్తుని. మీరు ఊర్నించి ఎపుడు వచ్చారు బాస్" అది నల్లముత్తు గొంతు.

"పొద్దున్నే వచ్చాన్రా. ఇంతకూ ఎర్రతేలూ కురియన్ ఎక్కడ చచ్చార్రా. అసలు మీరు చచ్చారా? బతికే ఉన్నారా?"

"చచ్చాం... సారీ.. బ్రతికే ఉన్నాం బాస్. ఇంతకూ మీ భార్య పార్వతిని చంపితే యాభై వేలు ఇస్తా అన్నారు కదా బాస్... ఆ డబ్బులు ఎపుడు ఇస్తారు? వాటి కోసం ఇపుడే రమ్మంటారా బాస్."

"ఒరి బద్మాష్ నాయాల. నేనేం చెప్పాను...."

శివాజీ టేప్ అయిపోయేంత వరకూ విన్నాడు. తృప్తిగా తల పంకించి క్యాసెట్ తీసుకుని కార్లోంచి దిగాడు.

హోటల్ ముందున్న పేవ్‌మెంట్ మీద నిలబడి తనకోసం ఎదురు చూస్తున్న రంగారావ్ దగ్గిరికి వెళ్ళి షేక్ హ్యాండ్

ఇచ్చి "థాంక్యూ బ్రదర్. నీరుణం జన్మలో తీర్చుకోలేను.... అవసరం వస్తే మళ్లీ కలుస్తాను బ్రదర్" అన్నాడు ఆనంద బాష్పాలు నిండిన కళ్లతో.

శివాజీ రంగారావ్‌కు వీడ్కోలు చెప్పాడు. రంగారావ్ వెళ్లిపోగానే క్యాసెట్ జేబులోకి వేసుకుని వ్యాన్ గార్డ్ వైపు నడిచాడు. డ్రైవింగ్ సీట్ ఆక్యుపై చేశాడు. రజని అతడి ప్రక్క సీట్ ఆక్రమించింది.

సరిగ్గా ఆ సమయంలో –

ఇందు డీలక్స్ హోటల్ లో పల్నించి టూత్ పిక్‌తో పళ్ళు శుభ్రం చేసుకుంటూ బయటకు వచ్చాడు ఇన్స్‌పెక్టర్ రాంశరణ్.

హోటల్ బయట ఉన్న కిళ్ళీ షాపు ముందు నిలబడి

"ఒక కస్మీరీ కిమామ్" అంటూ ఆర్డర్ చెప్పాడు.

బడ్డీ కొట్టు మనిషి పాన్ తయారు చేయడంలో మునిగి పోయాడు.

వేళ్ల మధ్య నున్న టూత్ పిక్ దూరంగా విసిరే ప్రయత్నంలో పక్కకు తిరిగిన ఇన్స్‌పెక్టర్ రాంశరణ్ ఠక్కున ఆగిపోయాడు. అతడి దృష్టి వ్యాన్ గార్డ్ డ్రయివింగ్ సీట్‌లో కూర్చుని ఉన్న శివాజీ మీద పడింది.

మరుక్షణం రాంశరణ్ వేగంగా కదిలాడు.

రాంశరణ్‌ను చూస్తూనే శివాజీ వ్యాన్‌గార్డ్ యాక్సిలేటర్ బలంగా నొక్కాడు. వ్యాన్‌గార్డ్ రాకెట్‌లా ముందుకు దూకింది.

రాంశరణ్ క్షణం ఆలస్యం చేయకుండా జీప్‌లోకి జంప్ చేసి వ్యాన్ గార్డ్‌ను ఫాలో అవ్వసాగాడు.

శివాజీ వ్యాన్‌గార్డ్ వేగం మరింత పెంచాడు. ఎల్. బి. స్టేడియం దగ్గిర కుడివైపుకు టర్న్ తీసుకున్న వ్యాన్‌గార్డ్ గన్‌ఫౌండ్రి వైపు పరుగు తీసింది.

సరిగ్గా చర్మాస్ రెడీమేడ్ షాపు దగ్గిర వ్యాన్‌గార్డ్ ఫ్యూయల్ ఇండికేటర్ నీడిల్ క్రిందికి దిగింది.

వ్యాన్‌గార్డ్ రెండు మూడు జర్క్‌లతో ఆగిపోయింది. శివాజీ రజని చెయ్యి

## హిట్‌లిస్ట్

పట్టుకుని క్రిందికి దూకాడు.

జనం మధ్య మెలికలు తిరుగుతూ పారిపోసాగాడు.

ఒలింపిక్ గోల్డ్ మెడల్ పొందిన రన్నర్‌లా పరుగెడుతున్న శివాజీ వంక అతడిని అనుసరిస్తున్న రజని వంక రాంశరణ్ ఆశ్చర్యపోతూ చూశాడు. అంత ట్రాఫిక్‌లో వాళ్లను పట్టుకోవడం అసాధ్యం.

రాంశరణ్ జీప్ వేగం పెంచాడు.

సరీగ్గా ఆ సమయంలో తాజ్‌మహల్ హోటల్ దగ్గిరున్న చౌరస్తా వద్ద రెడ్ సిగ్నల్ పడింది.

రాంశరణ్ జీప్‌కు సడన్ బ్రేక్ వేశాడు. కీచుమనే శబ్దాన్ని రోడ్డు మీద మూడు మీటర్ల పొడవున నల్లటి చారల్ని సృష్టిస్తూ జీప్ ఆగింది.

రాంశరణ్ చేయి పైకి లేచింది.

ఆ చేతిలో రివాల్వర్ మిలమిల మెరుస్తూ ప్రత్యక్షం అయ్యింది.

రాంశరణ్ సూటిగా గురిచూసి ట్రిగ్గర్ వెనక్కు లాగాడు.

పెద్ద శబ్దంతో వెలువడిన బుల్లెట్ నేరుగా వెళ్లి శివాజీ కుడికాలు పిక్కలో దిగబడింది. ఎర్రటి వేడి నెత్తురు ధారగా కారసాగింది.

శివాజీ పళ్ల బిగువున బాధను అణచిపెట్టి కాలు ఈడుస్తూ ముందుకు పరుగు తీశాడు.

జి. పి. ఒ. దగ్గిరున్న నెహ్రూ విగ్రహం దాటుతుండగా అతడికి ఎదురు పడ్డారు జబ్బార్ దాదా అతడి అనుచరులు.

జబ్బార్ అంతకుముందే పేపర్లో శివాజీ ఫొటో చూసి ఉన్నాడు.

అతడిని పట్టుకుని పోలీసులకు పట్టించాలని వేటకుక్కలా తన అనుచరులతో కలిసి సిటీ అంతా తెగ తిరుగు తున్నాడు.

అకస్మాత్తుగా శివాజీ ఎదురు పడగానే నడుముకున్న మోటార్ బైక్ చెయిన్ సర్రున లాగాడు. దాని చివర కొత్తగా అమర్చిన బ్లేడు ముక్కలు తళ తళ మెరుస్తున్నాయి

"ఆ రోజున మా ఏరియా పాలిమార్ థియేటర్ దగ్గరకొచ్చి బ్లాకులో టిక్కెట్లు అమ్మింది చాలక మాకె ఎదురు తిరిగి ఫైటింగ్ చేస్తావ్. ఇవాల్టితో నీపని ఖతం... ఈ రోజున నీ పేగులు ఏక మెడలో వేసుకోకపోతే నా పేరు జబ్బారే కాదు."

జబ్బార్ తన చేతిలోని చైన్ ఝుళిపించాడు.

శివాజీ తన మెడకు చుట్టుకో బోయిన మోటార్ సైకిల్ చైన్‌ను గాలిలోనే చేతికి చిక్కించు కున్నాడు. ఆ చైన్ చివరున్న బ్లేడ్లు అరిచేతి చర్మాన్ని చీల్చాయి.

శివాజీ పళ్ళు బిగపట్టి పిడికిలి మరింత బలంగా మూసి చైన్ తన వైపు గుంజాడు.

ఆ ఊపుకు జబ్బార్ విసురుగా శివాజీ వైపు ముందుకు తూలాడు. శివాజీ తన తలతో జబ్బార్ తలకు గట్టిగా



ఢీకొన్నాడు.

ఆ దెబ్బతో జబ్బార్ కళ్లముందు మెరుపులు మెరిశాయి. నక్షత్రాలు ప్రత్యక్షం అయాయి.

ఏనుగు కుంభస్థలాన్ని ఢీకొనే సింహంలా శివాజీ తన తలతో జబ్బార్ ఛాతీ ఢీ కొట్టాడు.

జబ్బార్ ఛాతీ ముందు వైపు ఎముకలు పటపట మంటూ విరిగాయి. పెద్దగా ఆర్తనాదం చేసి పడిపోయిన జబ్బార్ మరి పైకి లేవలేదు.

అతడికి స్పృహ తప్పింది.

అతడి అనుచరులు దుస్తుల చాటు నుండి రకరకాల ఆయుధాలు పైకి తీశారు.

శివాజీ వైపు ఒక్కొక్క అడుగే వేయ సాగారు.

సరీగ్గా ఆ సమయంలో వచ్చి పడ్డాడు రాంశరణ్. వస్తూనే పరిస్థితి గమనించి రివాల్వర్ గాల్లోకి పేల్చుతూ క్రిందికి దూకాడు.

అంతే- జబ్బార్ అనుచరుల చేతుల్లోని ఆయుధాలు దుస్తుల చాటుకు వెళ్లిపోయాయి.

వాళ్లు అక్కడ్నించి క్షణంలో అంతర్ధానం అయిపోయారు. ఎంత వేగంగా అక్కడికి వచ్చారో అంతే వేగంగా అక్కడ్నించి జారుకున్నారు.

జబ్బార్ అనుచరులు పారి పోవడంతో రాంశరణ్ వెనక్కు తిరిగాడు.

అక్కడ ఉండవలసిన అతడి జీప్ మాయం అయ్యింది. ఆ జీప్‌తో పాటే శివాజీ, రజని కూడా అంతర్ధానం అయ్యారు.

వెంటనే రాంశరణ్ రోడ్డు ప్రక్కనే ఆపిఉన్న ట్రాఫిక్ కంట్రోల్ వ్యాన్‌లోకి దూకాడు.

శివాజీ, రజని పారిపోతున్న దిశగా వ్యాన్ తిప్పాడు.

జీప్ తోలుతున్న శివాజీ కనుకొనల గుండా చూశాడు.

రాంశరణ్ అతడిని అనుసరిస్తూనే ఉన్నాడు. నయాపూల్ మీదుగా జీప్ ముందుకు పోనిచ్చి మదీనాకేఫ్ మీదుగా కుడివైపు తిప్పి హైకోర్టు ఆవరణలోకి వెళ్లిన తర్వాత క్రిందికి దూకాడు శివాజీ.

## హిట్‌లిస్ట్

రజని తన వెంటరాగాకోర్టు హాల్‌లోకి పరుగు తీశాడు.

అతడిని వెంబడిస్తూ రాంచరణ్ లోపలకి పరుగు తీశాడు.

శివాజీ ప్యాంట్ జేబులోకి చెయ్యి పోనిచ్చాడు. రంగారావ్ ఇచ్చిన క్యాసెట్ వేళ్లకు తగిలింది. దాన్ని చేతిలోకి తీసుకుని చీఫ్ జస్టిస్ వైపు కదిలాడు.

★ ★ ★ ★ ★ ★

వారం తర్వాత—

నగరంలో సంచలనం సృష్టించిన కాళీప్రసాద్ భార్య హత్యా కేసులో చీఫ్ జస్టిస్ తన తీర్పు వివరించారు.

పార్వతిని కిడ్నాప్ చేసినందుకు శివాజీ, రజనిలకు సంవత్సరం జైలు శిక్ష పడింది.

స్వంత భార్యను హత్య చేయడానికి ప్రోత్సహించి నందుకు కాళీప్రసాద్‌కు యావజ్జీవ కారాగార శిక్ష పడింది.

పన్నెండు నెలల కాలం గడిచింది—

శివాజీ రజని జైలు నుండి బయటకు వచ్చారు. రజనితో నేరుగా తన ఇంటికి వెళ్లిన శివాజీ ఆమె నుదిటిమీద ముద్దు పెట్టుకుని చెప్పాడు.

"ఇకనుంచి మనం పిక్ పాకెటింగ్ మానేద్దాం. హాయిగా ఓ మంచి అందమయిన ఇల్లు కట్టుకుని ఏదన్నా వ్యాపారం చేసుకుంటూ బతుకుదాం."

"ఊర్కే గప్పాలు కొట్టకు. వ్యాపారం చేయడానికి మనకు అంత డబ్బు ఎక్కడుంది... పైగా వాన ముఖానికి స్వంత ఇల్లు కూడానా?" రజని వేళాకోళంగా అన్నది.

"ఇల్లు మాత్రమే కాదు. ఆ ఇంట్లో నీకోసం అందమయిన బెడ్‌రూం కూడా ఏర్పాటు చేస్తాను... నువ్వు బండమైసమ్మ గుడిదగ్గిర నేను కొట్టుకు వచ్చిన కాళీప్రసాద్ డబ్బు విషయం అప్పుడే మర్చిపోయావా?"

ఆ మాటతో రజని కళ్లు ఒక్క సారిగా మెరిశాయి. ఆమె శివాజీ ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని అతడి పెదవుల మీద గాఢంగా ఓ ముద్దు పెట్టుకుంది.

రెండు రోజుల తర్వాత—

నగరంలో మిస్టీరియస్‌గా మరణించిన ముగ్గురు వ్యక్తులకు సంబంధించిన ఫైలు క్లోజ్ చేసేశాడు రాంశరణ్. చనిపోయిన ఆ ముగ్గురు వ్యక్తులూ ఎర్రతేలు, నల్లముత్తు, కురియన్‌లు.

వాళ్ళ హత్యకు సంబంధించిన కేస్ షీట్స్ నలిపి డస్ట్‌బిన్‌లోకి విసిరేశాడు.

సరీగ్గా అదే సమయంలో —

గుమ్మం బయట కాపలా కాస్తున్న కానిస్టేబుల్ ఫోర్ ట్వంటీ, పోస్ట్ మాన్ తెచ్చి ఇచ్చిన ఎన్వోలప్ రాంశరణ్ టేబుల్ మీద పెట్టాడు.

ఎన్వోలప్ తెరిచి లోపల్నించి ఒక వెడ్డింగ్ కార్డు తీసి చూసిన రాంశరణ్ పెదాలమీద చిరునవ్వు ప్రత్యక్షం అయింది.

అది నవభారత్ సమాజ్ వికాస కేంద్రంలో ఈ సారి నిజంగా పెళ్లి చేసుకుంటున్న శివాజీ, రజనిల వెడ్డింగ్ కార్డ్.

కార్డ్ పూర్తిగా చదివిన రాంశరణ్ కంగారు పడ్డాడు.

ముహూర్తానికి ఇంకా పావుగంట సమయం మాత్రమే ఉంది.

వెంటనే హడావుడిగా కుర్చీలోంచి లేచి బయటకు పరుగు తీశాడు.

రెండు క్షణాల తర్వాత—

రాంశరణ్ డ్రైవ్ చేస్తున్న జీప్ నవభారత్ సమాజ్ వికాస కేంద్రం వైపు దూసుకు పోసాగింది.

(అయిపోయింది)

## దేవుళ్ళు

ఎవ్వరు ఎవ్వరికి
ఏమవుతారోనని
అనుబంధ ఆత్మీయతలు
పెంచుకునేవారు
నిజమైన ఆత్మీయులు!
వారే అవుతారు బంధువులు
ఆపదలో ఆత్మీయులు!
ప్రాణానికి ప్రాణమిచ్చే జీవులు
మనిషికి ఊపిరి నిచ్చేవారలు
వారే మిత్రులు ఆపదలో
దేవుళ్ళు!

-కంకటి శంకర్‌రావు

# విఘ్నమూర్తి విశేష రూపాలు!

( 6 వ పేజీ తరువాయి)

అష్టోత్తర నామావళిలో చోటు చేసుకోవడం ఉదహరించ వచ్చు! 'మహా నిర్వాణ తంత్రం' అనే తంత్ర శాస్త్ర గ్రంథంలో వివరించినట్లు మంత్ర తంత్రాలు తెలిసిన పూర్వులు, విరోధులకు కీడు తలపెట్టే ప్రయత్నంలో భాగంగా అభిచార క్రియల్లో గణపతిని కొలిచే వారట! నేపాల్‌లో స్త్రీ రూపంలో 'గణేశాని' అని స్త్రీ దేవతగా గణేశ్వరుని పూజిస్తారు. అయితే తాంత్రిక పద్ధతులు



రేఖాదాస్ గుప్తా సేకరించిన ఒక అపురూప గణపతి పెయింటింగ్.

క్రమంగా కనుమరుగై పోయిన తర్వాత, గణపతిని దుష్టశక్తిగా కాక, సౌమ్యుడైన అధినాయకుడుగా పూజించడం మొదలైంది.

మన దేశంలోనే గాక, విదేశాల్లో కూడా వినాయకుడిని వివిధ రూపాల్లో ఆరాధిస్తున్నారు. రోమ్‌లో 'గెనస్'గా, బర్మాలో 'మహాసిన్'గా, మంగోలియాలో 'దోత్కార్'గా, జపాన్‌లో 'బినాయికియా'గా, గ్రీకులో 'డెమెటిర్' దేవతగా వివిధ రీతుల్లో పిలవ బడుతూ పూజ



వాలు కుర్చీలో విశ్రాంతి తీసుకుంటున్న వినాయకుడ్ని రూపొందించిన కళాకారుడు గోస్తోకుమార్. ఈ శిల్పాన్ని 'టెర్రకోట' (ఒక విధమైన ముడి సరుకు) వాడి తీర్చిదిద్దారు.

లందుకుంటున్నది మన వినాయకుడే! టిబెట్‌లో 'త్సొక్కప్రార్'గా, చైనాలో 'క్వాంతిసియన్'గా వినాయకుడి రూపమే కొలుస్తారు.

## విచిత్రం

అసలు విఘ్నేశ జననమే ఓ మహా విచిత్రం...

బ్రహ్మ వైవర్త పురాణంలో గణపతి కృష్ణుని అంశగా పేర్కొన్నారు. శివుని



నేపాల్‌లో వున్న 'ప్రత్యేక తరహా' 'పంచముఖి' వినాయకుడు. సాధారణంగా తల ప్రక్క తల వుండి వరసగా ఐదు ముఖాలు వుంటాయి. ఇందులో తల పైన తల వుండటం విచిత్రం.

సంపర్కం లేకుండానే పార్వతికి గణపతి పుత్రుడుగా జన్మించాడని వామన పురాణం చెబుతోంది. స్కంధ వామన లింగ పద్మ పురాణాలు, శివ రహస్యం, తైత్తిరీయో పనిషత్తుల్లో గణపతి గజ ముఖుడుగానే జన్మించినట్టు వర్ణన లున్నాయి. శివపురాణం, బ్రహ్మవైవర్త, వరాహ పురాణాల్లో ఆగమాల్లో కూడా గణపతి జననానికి సంబంధించిన విచిత్ర గాథలున్నాయి.

అష్టవిధ రూపాల్లో గణపతిని భక్తులు ప్రస్తుతం కొలుస్తున్నారు. అవి శక్తి గణపతి, వీర గణపతి, బాల, భక్తి, సిద్ధి, విఘ్నరాజ, ఊర్ధ్వ, నృత్య, లక్ష్మీ గణపతి, హేరంబ, క్షిప, తరుణ, భవనేశ, ఉచ్చిష్ట, ధ్వజ మహాగణపతి రూపాలు. అయితే– అష్ట విధ గణపతులకే వాస్తు శిల్పులు ఆకారాన్ని నిర్దేశించారు. ఏనుగు తల, పెద్ద బొజ్జ, మూషిక వాహనం తప్పనిసరిగా వుండేలా శిల్ప శాస్త్ర వేత్తలు అష్ట గణపతులను రూపొందించారు. వాటి ప్రకారం గణపతి ఎనిమిది రూపాలు ఇవి: సిద్ధి గణపతి, హేరంబ గణపతి, మహా గణపతి, విఘ్నరాజ గణపతి, నృత్య గణపతి, ఉచ్చిష్ట గణపతి, శక్తి గణపతి, బాల గణపతి.

ప్రాచీన కాలం నుంచీ గణపతిని సాంప్రదాయ రీతుల్లోనే (అంటే నిర్దేశించిన రూప కల్పన తోనే) పూజిస్తూ వస్తున్నా, ఇటీవలి కాలంలో గణపతికి మన చిత్ర శిల్ప కళాకారులు మరికొన్ని కొత్త ఆకృతులు కల్పిస్తున్నారు. వాలు కుర్చీలో పడుకున్న 'విశ్రాంతి గణపతి'ని గోస్తోకుమార్ (రూపశిల్పి) సృష్టిస్తే, ప్రముఖ చిత్రకారుడు ఎమ్. ఎఫ్. హుస్సేన్ కొవీన గణపతిని ఓ రేఖా చిత్రంలో సృజించారు. ఇంకా వివిధ రకాల గణపతులను రేఖా చిత్రాల్లో బంధించిన రామానంద బందోపాధ్యాయ, సముద్ర కెరటాలపై తేలియాడు తున్నట్టు గణపతిని గీసిన బికాస్ భట్టాచార్జీ, జైమినీ రాయ్ క్లాత్ డిజైన్ చేసిన 'శివుడు–దుర్గ'– వినాయక కుటుంబం' ఇటీవలి కాలంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించు

కున్నాయి. వివిధ గణపతి రూపాలను సేకరించడంలో... (అవి చిత్రాలు కానీయండి,... శిల్పాలు కానీయండి...) కొందరు ఉత్సాహం చూపిస్తున్నారు. వారిలో హర్షా నియోతియా, రేఖా దాస్ ప్పా ప్రముఖులు. నృత్య గణపతిని ఆరాధించడంలో ప్రముఖ నృత్య కళా ప్రి మల్లికా సారాబాయినే ముందు



27 అడుగుల ఎత్తున, 5,500 రికాయలతో బొంబాయి లాల్ బాగ్ కంలో రూపొందించిన వినాయకుడు. బాళేకుంద్రీ అనే కళాకారుడి సృష్టి ఇది.



సంగీత గణేశుడు :

కేవలం సంగీత వాయిద్యాలతోనే రూపొందించిన ఈ గణేశుని విగ్రహంలో తంబురాను గణేశుడి ముఖంగా, డప్పు కంజర్ చెవులుగా తబలా మృదంగం తొడలు చేతులుగా అమర్చిన ఈ గణపతికి హార్మోనియం ఆసనం.

## క్కటి మాత్రం నిజం

ణపతిని ఆరాధించడ మంటే త్రి –పుష్పాలతో పూజ చేయడం కాదు! తమ కళ ద్వారా చిత్రాన్ని ఒక చిత్రకారుడు చ్చు! ఒక శిల్పి ఎంతో భక్తితో రూపు దిద్దవచ్చు! నృత్య కళని నివేదనగా మలచవచ్చు! ఒక క శిల్పం... ఒక నృత్యం... ఒక కాదేదీ ఆరాధనకు అనర్హం.

ఈ ప్రముఖు లందరి ప్రత్యేక వ్యాసం ద్వారా పాఠకులకు ఇక్కడ కూడా ఒక ఆరాధనే...



సతుల సుబ్రహ్మణ్యం

64138

# సినిమా... సినిమా...

## "పందిరిమంచం"

"అచిరకాలంలోనే రచయితగా, నటుడుగా తనకో స్థానాన్ని కల్పించుకున్న ఓంకార్‌కు దర్శకత్వ బాధ్యతను అప్పగించాం," అన్నారు కాట్రగడ్డ ప్రసాద్. ఈయన నిర్మాణ సారథ్యంలో పి. బలరాం నిర్మించే శ్రీ అనుపమ ప్రొడక్షన్స్ "పందిరి మంచం" చిత్రంలో జగపతిబాబు సరసన దివ్య భారతి నాయిక. రాజ్‌కోటి, వై. మహీధర్, దోనేపూడి ప్రసాద్, మురళి రామయ్య ప్రభృత సాంకేతిక వర్గంతో కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు సమకూర్చి దర్శకత్వం వహించే ఓంకార్ "గ్రామీణ నేపథ్యంలో ఎన్నో మలుపులున్న కథ. ఆగస్ట్ 30 నుంచి రాజమండ్రి పరిసరాలలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది," అన్నారు.

## "శ్రీవారి చిందులు"

రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డి.వి.వి. రమణారెడ్డి, పంతంగి పుల్లయ్య నిర్మించే శ్రీ రవికిరణ్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "శ్రీవారి చిందులు" చిత్రంలో నరేష్, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, శుభలేఖ సుధాకర్, వేలు, కె.కె.శర్మ, 'శివ' చక్రవర్తి, సితార, తార, అన్నపూర్ణ, శ్రీలక్ష్మి, పి. ఆర్. వరలక్ష్మి పాత్రధారులు. తెర వెనుక కాశీ విశ్వనాధ్, సి. నారాయణరెడ్డి, వేటూరి, కె. వి. మహాదేవన్, నాగేంద్రకుమార్, సి.వి. రమణబాబు, శివశంకర్, రేలంగి సత్యం, తాండవకృష్ణ, జి.ఆర్.కె. కుమార్ కృషి చేస్తున్నారు. కె. పైడిబాబు నిర్మాణసారథి.

## "బొబ్బిలి రాజా"

"వారం రోజులపాటు పోలెండ్, బెల్జియం దేశాలలో జరిపిన ఔట్‌డోర్ షూ... చిత్రంలో హైలైట్," అన్నా... రామానాయుడు. ... సమర్పించే "బొబ్బిలి... చిత్రంలో వెంకటేశ్, దివ్య... వాణిశ్రీ, సత్యనారాయణ, శ్రీనివాసరావు, బాబూ మో... ప్రదీప్‌శక్తి, శివా... బ్రహ్మానందం, విద్యా... సుమిత్ర వగైరా నట... పరుచూరి సోదరులు, ... రామశాస్త్రి, ఇళయ... అశోక్, విజయన్, యన్... వెంకటరెడ్డి, పొన్ను... శాస్త్రి, కె. ఎ. మా... ప్రభృత సాంకేతిక వర్గం... గోపాల్ దర్శకత్వం వహి... చిత్రానికి డి. సురేష్ నిర్మాత.

-జీ.



"తేనెటీగ" లో రేఖ, రాజేంద్రప్రసాద్